# 'చతుర' ప్రపంచం

## కొత్తరకం క్లబ్బులు

మహారాష్ట్రలోని పూనాలో ఎన్నో వింతలు విడ్డూరాలు బయటపడుతుంటాయి. పూర్వం ఆ వూరికి డిప్యూటీ మేయర్‌గా పనిచేసిన వ్యక్తికి పబ్లిక్ స్పీచ్ లివ్వడం మహా ఇష్టం. పిలిచినా, పిలవక పోయినా తన స్వంత కారేసుకుని బయలుదేరి ఎక్కడ ఎలాంటి కార్యక్రమాలు జరుగుతున్నా హాజరైపోయి తను వెంట తెచ్చుకునే మైక్రోఫోన్ తీసుకుని స్టేజిమీదకెళ్లే వీలులేకపోతే తన కారుమీదనే ఎక్కి నుంచుని సదరు కార్యక్రమ విశేషాల్ని ప్రత్యక్ష ప్రసారం చేసేసేవాడు. ఓసారి ఆ వూళ్లో క్రికెట్ మ్యాచ్ జరుగుతోంది. దాని ప్రత్యక్ష ప్రసారాల్ని రేడియో ద్వారా అందరూ వింటూనే వున్నారు. అయినా ఊరుకోలేక సదరు మాజీ మేయరుగారు తన మైక్రోఫోను తీసుకుని ఓ పెద్ద బిల్డింగ్ పైకెక్కి స్టేడియంకేసి చూస్తూ, ఆటను గమనిస్తూ కామెంటరీ చెప్పడం ప్రారంభించాడు. దాంతో ఎప్పుడూ చెప్పే కామెంటేటర్‌కి చిర్రెత్తుకొచ్చింది. సదరు వ్యక్తి చేతిలోంచి మైక్రోఫోన్ లాక్కుని అతన్ని కిందికి దింపించేవరకు సణుగుతూనే వున్నాడా కామెంటేటర్. శ్రోతలు అతడి గురించి ఇప్పటికీ చెప్పుకుని నవ్వుకుంటూ ఉంటారు.

ఆమధ్య పూనా నగర సంస్కృతీ సంప్రదాయాలను నిలబెట్టాలంటూ ఓ కొత్త సంస్థ 'యువమహేశ్వరి' అనే పేరుతో వెలసింది. దీనికి అధ్యక్షులు శ్రీకంఠమన్‌గౌడ. వరకట్నా



లు, మూఢ నమ్మకాలు వగైరా సామాజిక రుగ్మతలను రూపుమాపడం కూడా దీని ధ్యేయం. ఇది కాక యువతకు అనేకానేక పోటీలను పెట్టి ప్రోత్సాహం ఇస్తూ వుంటుంది ఈ యువమహేశ్వరి. ఆమధ్య ఇడ్లీ తిన డంపై పోటీలను నిర్వహించి అందులో నెగ్గిన వారికి బహుమతి ప్రదానం చేసింది.

రాజకీయనాయకుల ప్రతిస్పందనలను ప్రజలకి తెలియజేయడానికి వార్తాపత్రికలు న్నాయి. మరి మామూలు ప్రజలు రాజకీయ, సామాజిక విషయాలపట్ల ఎలా ప్రతిస్పంది స్తున్నారో తెలియడానికి ప్రత్యక్ష సౌకర్యం లేదుకాబట్టి అలాంటి అవకాశం వారికి కల్పించేందుకు ఓ ప్రత్యేక వేదికను ఏర్పాటు చేశారు. దాంతో జనం తండోపతండాలుగా వచ్చి తమతమ భావాలను, ప్రతిస్పందనల ను వేదికనెక్కి చెప్పడం ప్రారంభించారు. అటుపై దానివల్ల ఒరిగిందేమిటి అన్నది జవాబులేని ప్రశ్న.

ఈ రెండు కార్యక్రమాలు దిగ్విజయంగా ముగియడంతో యువమహేశ్వరి మరో పోటీని పెట్టింది. 'విభిన్న వయసుల్లో వున్న స్త్రీ పురుషులు ఏ సందర్భానికి ఎలా ఏడుస్తా రు?' అన్నది ఆ అంశం. ఈ విచిత్ర కార్యక్రమా న్ని చూడ్డానికి ఇసకవేస్తే రాలనట్టు వచ్చారు జనం. నిశ్శబ్ద ఏడుపులు, అరుపులతో కూడిన ఏడుపులు, సన్నని రాగంతో కూడిన ఏడ్పుపు లు, నెత్తికొట్టుకుని గుండె బాదుకునే భయంక రమైన ఏడుపులు... ఇలా రకరకాల ఏడుపు లతో స్టేజిగగ్గోలెత్తిపోయింది. ప్రేక్షకుల్లో కూడా ఆ కార్యక్రమాన్ని తిలకించి కొంతమంది నవ్వితే మరి కొంతమంది ఏడ్చారు.

అటుపైన ప్రేమలేఖల పోటీని నిర్వహించా రు 'యువమహేశ్వరి' సంస్థవారు. 70 ఏళ్ళ వృద్ధుడినుంచి 14 ఏళ్ళ అమ్మాయిదాకా రకరకాలుగా ప్రేమ లేఖలు వ్రాసి తెస్తే వాటిని స్టేజిమీద చదివించింది ఆ సంస్థ.

కొంతమంది క్రికెట్ ప్రియులు ఆ ఆటకి సంబంధించిన పదజాలాన్నే ఉపయోగించి ప్రేమలేఖలు రాశారు. ఉదాహరణకు "ప్రియా! నువ్వు మిగిలిన వాళ్ళతో వన్‌డే మ్యాచ్ ఆడుతున్నావుగానీ, నాతో టెస్ట్ మ్యాచ్ ఆడుతున్నావు'' అంటూ.

మరో క్రికెట్ ప్రేమికుడు-

"ప్రియా! మనిద్దరిమధ్య అంపైర్స్‌లా నిలబడ్డారు మీనాన్న, మానాన్న. కోపంతో మీనాన్న నన్ను ఒక్క తాపు తన్ని సిక్సర్ కొడతాడేమోనని భయంగా వుంది'' అంటూ రాశాడు.

మరొకళ్ళు రెండు బొద్దింకలమధ్య నడిచే ప్రేమలేఖలను రాశారు.

"చూడు ప్రియా! నేను కల్చర్ తెలిసిన బొద్దింకని. షేక్స్‌పియర్, షెల్లీలాంటి మహాక వుల పుస్తకాల్లోనే నా నివాసం. నా గురించి నువ్వేమనుకుంటున్నావు. రేపటిలోగా నీ నుంచి ఉత్తరం రాకపోతే నేను బేగాన్‌స్ప్రే డబ్బాలో దూరి చచ్చిపోతాను'' అంటూ.

ఇలా ఎన్నో లేఖలు ఆ పోటీకి వచ్చాయి. కొన్ని లేఖలు బహుమతులనందుకున్నాయి. వీటన్నిటినీ ఒక పుస్తకరూపంలో కూడా ప్రచు రించింది యువమహేశ్వరి.

## ఒంటెల సుదీర్ఘ చరిత్ర

ఎడారుల్లో ఒంటెలను బరువులు మోసేందుకు ఉపయోగించే పద్ధతి ఇప్పటికీ నడుస్తూనేవుంది. అలగ్జాండర్, జెంఘీస్‌ఖాన్, నాదిర్‌షా, బాబర్... ఇలా ప్రపంచ చరిత్రలో ఎందరో రక్తపిపాసులు, సామ్రాజ్యకాంక్షతో స్వజనాన్ని కూడా మట్టుబెట్టినవారు... తమ, తమ యుద్ధసన్నాహాల్లో తుపాకులను, ఆహార పదార్థాలను ఒకచోటనుండి ఒకచోటకు రవా ణా చేయడానికి ఒంటెలనుపయోగించేవారు.





కానీ ప్రస్తుతం సహారా ఎడారిని ఎయిర్‌కండిషన్ కార్లు కూడా సునాయాసంగా దాటగలుతున్నాయి.

నార్త్‌ఆఫ్రికా, అరేబియా, పర్షియా, టర్కీ, ఇండియాల్లోని ఒంటెలకు వీపుమీద ఒకే మూపురముంటుంది. ఇవి మనుషులను కూడా వేగంగా ఒకచోటనుంచి మరొకచోటకు, లేదా ఎత్తయిన పర్వతాలమీదుండే దేవాలయాలకు నడవలేని వృద్ధులను మోసుకుపోతూవుంటాయి. వీటిని కామిలస్ డ్రోమిడేరిన్స్ అంటారు. మంగోలియన్ ఒంటెలకు మాత్రం

అసలు ఒంటె అయిదురోజులనుంచి ఏడురోజులదాకా నీరు లేకుండా ఉండగలదు. అవసరమయితే 20 గాలన్ల నీటిని- కూడా ఔపోసన పట్టినంత సులువుగా ఒకేసారి తాగ్గలదు కూడా.

ఎడారి ప్రాంతాల్లో నివశించే ప్రజలు ఒంటె పాలను తాగి దాని మాంసాన్ని కూడా తింటారు. ఒంటె నాలుక ఉప్పగా వుండి భోజనపదార్థంగా మంచి రుచిగా వుంటుందంటున్నారు ఒంటె మాంసప్రియులు.




రెండు మూపురాలుంటాయి. విటిని హెయిరి కామిలస్ బాక్ట్రియానస్ అంటారు.

లాటిన్ ప్రజలు ఒంటెమీద ఒక సామెత కూడా చెబుతారు. ఒంటె తనకు కొమ్ములు కావాలని కోరుకుందిట. అవి రాలేదు సరిగదా, చెవులు కూడా పోయాయిట' అంటూ దానిమీద ఓ సంస్కృత శ్లోకం కూడా వుంది. అయితే ఇవి నిజాలు కావని ఒంటెకున్న వినికిడి, ఘ్రాణశక్తులు అంతా ఇంతా కాదని పైగా అది ఒకటిన్నర మైళ్లదూరంలో వున్న నీటిమడుగులను గ్రహించి అక్కడికి వెళ్ళి నీళ్లు తాగ్గలవని అంటారు జీవజంతు శాస్త్రజ్ఞులు.

ఎడారులగుండా ప్రయాణాలు చేసే జిప్సీలు ఒంటెపాలను కాచి తోడుపెట్టి ఆ పెరుగుతో మంచి వంటకాన్ని తయారుచేస్తారు. ఈ వంటకాన్ని 'ఆయేబ్' అంటారు. దీని చర్మంతో పాదరక్షలు, బ్యాగ్‌లు, టోపీలు మొదలయినవి తయారుచేస్తారు. దీని కొవ్వు నుండి నూనె తీస్తారు. దీని ఒంటిమీద నూగువెంట్రుకలతో వెచ్చని దుస్తులు, రగ్గులు తయారుచేస్తారు. చైనాలో ఒంటె వెంట్రుకలతో పెయింటింగ్ బ్రష్‌లను తయారుచేస్తా

# ముద్దుగుమ్మలతో 'ముద్దు'మురిపాలు




హాలీవుడ్‌లోని ట్రాపికానా క్లబ్బులో అప్పుడప్పుడు అందమైన అమ్మాయిల బాక్సింగ్ పోటీలు జరుగుతూ వుంటాయి. ఈ పోటీలతోపాటు మరో ప్రత్యేక ఆకర్షణ ఏమిటంటే ఆడియన్స్‌కి అమ్మాయిలు డాలర్‌కో ముద్దుచొప్పున ఇస్తూ వుంటారు. బాక్సింగ్‌లో నెగ్గినా నెగ్గకపోయినా ముద్దుల ప్రహసనంతో ఇంటికి వెళ్ళేసమయానికి ఆ అమ్మాయిలు డబ్బు బాగానే పోగేస్తారు.

అయితే "ముద్దుకో డాలర్ మరీ ఎక్కువేమో?" అని ఓ ఆసామి అనుమానం వ్యక్తం చేస్తే "ఎక్కువేంటండీ... అసలు డాలర్‌కి ఈ రోజుల్లో ఏం వస్తోంది చెప్పండి'' అంటుందో అమ్మాయి. అదెలా ఉన్నా ఈరకం బాక్సింగ్ పోటీల్లో అమ్మాయిల అభినయాన్ని, అందాల్ని చూసి, అదనంగా మరికాసిన్ని డాలర్లు వెదజల్లి ముద్దులు పుచ్చుకుని వెళ్ళేవారికి మాత్రం ఆ కార్యక్రమానికి హాజరయినందుకు విపరీతంగా ఖర్చవుతుందంటున్నారు.

రు. ఒంటెపేడతో పిడకలేకాక మందులను కూడా తయారుచేస్తారు. కానీ దీనికి శిక్షణని వ్వడం చాలా కష్టమని, అసలు చెప్పినమాట వినదని అంటున్నారు ఒంటెశిక్షకులు. ఊరికే దాన్ని కూచోమని, నించోమని చెప్పి చే యించడానికే ఎంతోకాలం పడుతుందంటు న్నారు వారు.

డాన్‌గ్లాస్ స్లెడ్జెస్ అనే రచయిత తన 'తునీషియాట్రావెల్స్' అనే పుస్తకంలో "ఒంటె లు ఉదయాన్నే బద్ధకంగా, అతిమెల్లగా లే వడం చూస్తే స్కాట్‌లాండ్ పార్లమెంటు సభ్యులు తమ ఉపన్యాసాలివ్వడానికి అతిబ ద్ధకంగా ఆసనాల్లోంచి లేవడాన్ని గుర్తుచే స్తుంది'' అంటాడు.

కానీ... వాటి బద్ధకాన్ని వదలగొట్టి వాటిని కార్యోన్ముఖులను చేయగలిగేది మాత్రం ఒక్క అరబ్ సర్దార్లే అంటారు కొంతమంది. వాటికిచ్చే ఆహార, పానీయ పరిమాణాల్ని రోజురోజుకీ తగ్గించి అవి మోసే బరువుల్ని మాత్రం ప్రతిరోజూ పెంచి వాటికి పనికి అలవాటుపడేలా శిక్షణనిస్తారు.

పైకి సాధుజంతువుల్లా కనిపించే ఈ ఒంటెలు కోపం వస్తే మాత్రం ఎదురుగుండా వున్న మనిషిని పళ్ళతో చీల్చి చెండాడి, కాళ్లతో తొక్కి యమపురికి సాగనంపుతాయి.

ఎడారుల్లో ఇసుక తుఫానులు వచ్చినప్పు డు ఒంటెలకి కొన్ని మందులను ఇవ్వాల్సి వుంటుంది. లేకపోతే అవి ఆ తుఫాను తాకిడి కి అటూ ఇటూ గంతులేస్తే చివరికి కనపడ కుండాపోయే ప్రమాదముందంటాడు ఓ ఒంటె యజమాని. ఆ మందులివ్వడంతో అవి కొంత మత్తుగా వుండి కదలకుండా యజమాని వద్దనే వుంటాయి.

ఒంటెల వయసులను బట్టి వాటికి వేరు వేరు పేర్లు కూడా వుంటాయి. ఒక సంవత్స రంనుంచి మూడు సంవత్సరాల వయసు ఒంటెలను 'హేజీ'లంటారు. నాలుగేళ్ల వయ సు ఒంటెలను 'లేజీ'లంటారు. అయిదేళ్ల వయసుగల ఒంటెలను 'థేనీ'లంటారు. ఇలా చెప్పుకుంటూపోతే ఒంటెలను గూర్చి సుదీర్ఘ వివరాలున్నాయి అంటున్నారు శాస్త్ర జ్ఞులు.

## స్వభావాల సర్వే

**మ**నుషుల్లో ఎన్నోరకాల స్వభాలున్న వా ళ్లుంటారు. కొంతమంది మేధోవంతులుగా, మరికొంతమంది మేధకులుగా వుంటూవుంటా రు. కొంతమంది జీవితంలో ఓ ఆదర్శాన్ని చేపట్టి దాని సాఫల్యం కోసం అహరహం శ్రమిస్తే మరికొందరు జీవితాన్ని ఎంతో తేలి గ్గా తీసుకుని కాలం గడిపేస్తారు. మానవ స్వభావాలమీద మద్రాసులో ఆమధ్య జరిగిన ఓ సర్వే ప్రకారం కొందరి వ్యక్తుల గురించి తెలిసిన వివరాలు ఇలా వున్నాయి... బాలకృ ష్ణన్ అనేవ్యక్తి మద్రాసులోని నేషనలైజ్డ్ బ్యాంకులో గుమాస్తాగా పనిచేస్తున్నాడు. అత నికున్న స్నేహవలయం చాలా విస్తృతం కావడంతో ఎప్పుడూ ఏవో శుభకార్యాలకి సంబంధించిన ఆహ్వానపత్రాలు అందు కుంటూనే వుంటాడు. కానీ అతడు మాత్రం కట్నంలేని వివాహాలకు మాత్రమే హాజరవుతా నని ఓ ప్రతిజ్ఞ తీసుకున్నాడు. అతని రాకని అమితంగా కోరుకునే అతని స్నేహితులు లేదా బంధువులు తాము కట్నం తీసుకోవట్లే దని, లేదా... తాము కట్నం ఇవ్వడం లేదనీ, సాక్ష్యాధారాలతోసహా అతన్ని ఒప్పించి దగ్గ రుండి పెళ్లికి తీసుకెడతారు. 'ఇలా పెళ్ళికి రావడం మానేసినంతమాత్రాన వరకట్న సమస్య తీరుతుందా?' అని ఎవరైనా అడిగి తే, 'నాకు తెలుసు. ఈ కట్నం సమస్య నాలాంటి ఓ అల్పప్రాణి అలకవల్ల పోయేది కాదని. అయినా అలాంటి అనాచారానికి నిరసన అయినా వ్యక్తం చేయడం నా కనీస




ధర్మమనిపిస్తుంది' అంటాడతడు.

మరోవ్యక్తి పేరు శంకరకుమార్. ఇతను మందులు తయారుచేస్తాడు. ఇతగాడికి రోడ్ల పక్క గోడలపై పిచ్చిగా పెరిగిపోతున్న వాల్ పోస్టర్లంటే చెప్పలేని కసి. ఏ పోస్టర్ తన కంటబాటులో దొరికినా వెంటనే చింపి పోగు పెడతాడు. ఈ పోస్టర్ల మూలంగా వీధి పేర్లుగల బోర్డులన్నీ కనిపించకుండాపోతున్నాయని, అంతేకాకుండా వాటిని చూస్తూ ఎదరవచ్చే వాహనాలను కూడా పట్టించుకోని పిచ్చిజనం యాక్సిడెంట్లకు గురవుతున్నారంటాడు.

పోతే... ఓదంబరం అనే ఆసామి ఓ కంపెనీలో ఎగ్జిక్యూటివ్‌గా పనిచేసి రిటైరయ్యాడు. ఆయనగారికి శబ్దకాలుష్యం పడదు. దాంతో తన కూతురు వివాహోత్సవంలో ఓ మైకుగానీ, సన్నాయిగానీ ఎలాంటి శబ్దాలు లేకుండా నీరవనిర్మల వాతావరణంలో పెళ్ళి అయిందనిపించాడు. బహుశా కట్నానికి లొంగి మగపెళ్లివారు కూడా చచ్చినట్టు ఈ పెళ్లికి అంగీకరించివుంటారు అంటుంటారు గిట్టనివాళ్లు.

మరోవ్యక్తి గోపాలరావు. ఎనిమిదేళ్లక్రితం ప్రభుత్వోద్యోగంనుంచి రిటయిరయ్యాడితడు. చిత్రమేమిటంటే ఈ ఎనిమిదేళ్లనుంచీ క్రమం తప్పకుండా టైముకి రోజూ ఆఫీసుకి చేరి అక్కడ తాను సర్వీసులో వుండగా పెండింగ్ పెట్టిన ఫైళ్ల వర్క్‌ను చేసి ఇంటికొస్తూ వుంటాడు. టైము దాటిపోతోందనుకున్నప్పుడు ఆటోలో మరీ ఆఫీసుకు పరుగెత్తే గోపాలరావుకి, ఆ పనివల్ల పైసా ఆదాయంలేదు. ఖర్చులేకుండా పని జరుగుతోంది పోనిమ్మని చూసీచూడనట్టు ఊరుకుంటున్నారు అధికారులు. మరోవ్యక్తి పద్మచెంద్. ఈయన వడ్డీవ్యాపారి. తరతరాలనుంచీ వీరి వృత్తి వ్యాపారమే. అనేక వస్తువులను తనఖా పెట్టుకుని డబ్బు ఇస్తూవుంటాడీయన. అయితే ఈయనకున్న ఒకేఒక్క ఆదర్శమేమంటే ఎవరైనా మంగళసూత్రం, మట్టెలు, నల్లపూసలులాంటివి తెచ్చి డబ్బిమ్మంటే మాత్రం ససేమిరా అంటాడు. హిందూ ధర్మశాస్త్రం ప్రకారం ఈ వస్తువులను స్త్రీలు అతిపవిత్రంగా చూసుకుంటారు. అందుకనే వాటిని తీసుకోడానికి నా మనసంగీకరించడం లేదంటాడీతడు.





ఆంధ్ర విశ్వవిద్యాలయంనుండి 'సైకాలజీ'లో మాస్టర్స్ డిగ్రీ తీసుకున్నాను. నా తొలికథ 'స్పందన'. బాలసాహిత్యానికి సంబంధించిన 7 నవలలు బాలజ్యోతిలో ప్రచురించబడ్డాయి. అందులో 'దక్షిణధృవ యాత్ర'కి బహుమతి లభించింది.

'విశ్వం', 'భూమికథ', 'అగ్నిపర్వతాలు-భూకంపాలు' అనే సైన్స్ గ్రంథాలు ప్రచురించబడ్డాయి. యువ, స్వాతిలలో ఎనిమిది నవలలు వచ్చాయి. ఆంధ్రప్రభ వారపత్రికలో 'స్త్రీ పర్వం' కథకు ప్రథమ బహుమతి, 'తిలదానం' కథకు ప్రత్యేక బహుమతి లభించింది. దాదాపు 40 కథలు ప్రచురించబడ్డాయి. అందులో కొన్ని ఇతర భాషల్లోకి తర్జుమా చేయబడ్డాయి.

'తిలదానం' కథకు ఢిల్లీవారి 'కథ అవార్డు' రావడం దానిని భారత రాష్ట్రపతి చేతులమీదుగా అందుకోవడం రచయితగా నన్ను బాగా సంతోషపరచిన, బాధ్యత పెంచిన విషయం. ఆ కథపై 'ది హిందూ', 'సండే క్రానికల్ (ఢిల్లీ)వారు సమీక్షలలో చేసిన ప్రశంసలు నా మనోధైర్యాన్ని పెంచాయి. నా 'ఆవలిగట్టు' నవలకు ప్రత్యేక బహుమతినిచ్చిన చతుర సంపాదకవర్గానికి, న్యాయనిర్ణేతలకు కృతజ్ఞతలు.

# ఆవలిగట్టు

– రెంటాల నాగేశ్వరరావు

# చతుర

సంపుటి : 18 సెప్టెంబర్
సంచిక : 8 1995

"మనం చనిపోయాక వైతరిణీ నది దాటాలట. చీమూ, నెత్తురులతో అమిత దుర్గంధ భూయిష్ఠమైన ఆ నదిలో మొసళ్ళు, సర్పాలు భీతిగొలువుతుంటాయట. ఆ నది దాటటానికి గోదానం చేస్తారు మృతుల పేరుతో. అవి పురాణాలు కావచ్చు. కానీ... మామూలు మనిషి కష్టాల ఏటిని దాటటానికి 'మంచి' అనే ఆవుతోక ఆధారం ప్రతి మనిషికీ అవసరం. అలాంటి ఏటికి ఆవలిగట్టుకు చేరడానికి కనీసం నా జీవితంలో ఒక్క మంచిపని అయినా చెయ్యాలని ఇలా వచ్చాను" అంది ఆమె.

*వింటున్నవాళ్ళు తెల్లబోయారు. ఎందుకు? జీవిత చరమదశలో ఆమె చెయ్యబోయిన మంచి పని ఏమిటో అంతకుముందు. ఆమె జీవితం ఎలా నడిచింది? ఆమెతోపాటు అనేకానేక వ్యక్తుల జీవితాల్లోని మంచి చెడులకు, సుఖదుఃఖాలకు మౌనసాక్షిగా నిలిచిన ఓ ఊరు నోరువిప్పి చెప్పిన స్వీయకథ...*

...నవలల పోటీలో కన్సొలేషన్ బహుమతి రూ. 5,000/- పొందిన రెంటాల నాగేశ్వరరావు "ఆవలి గట్టు" ఈ నెల చతుర సమగ్ర నవల.

కొందరు గొప్పవారు ఆత్మకథలు వ్రాసుకుంటారు. చరిత్ర సృష్టించిన మహామహుల జీవిత చరిత్రలు కొందరు రాస్తారు. అలాటి మహానుభావులు లక్షకో కోటికో ఒక్కరుంటారు.

మాలోనూ అంతే.

నేనో చిన్న గ్రామాన్ని. పదివేలలోపు జనాభావున్న చిన్న గ్రామాన్ని, దేశంలోని వేలాది గ్రామాలలో నేనొకదానిని. హైదరాబాద్‌లా, ఢిల్లీలా నాకో ప్రసిద్ధిచెందిన చరిత్రలేదు. అయోధ్యలా పేరుప్రఖ్యాతులూ లేవు. కాని, పేరుప్రఖ్యాతులులేని ఒక సగటు మనిషిలా నాకూ ఒక జీవన స్రవంతి వుంది. అది చరిత్ర కాదేమోగాని, దానిలో ఒక ప్రాముఖ్యతలేని పుటని. మారుతున్న కాలానికి సజీవ సాక్ష్యాన్ని.

నా కథ వ్రాయటమంటే-ప్రజల కథ వ్రాయటమే. నా కాలక్రమంలో పదిపది హేనేళ్లు ఏమంత లెక్కలోకి తీసుకోదగినవికావు. వెయ్యి పేజీల జీవిత పుస్తకంలో పది పుటలనగా ఎంత?

కాని, ప్రజలకు అలాకాదు. కొందరికి ఆ కొద్దికాలమే జీవిత విధానాన్నే మారుస్తుంది. కొందరు జీవిత వైకుంఠపాళీలో నిచ్చెనలకెగ ప్రాకుతారు...కొందరు పాముల బారిన పడతారు. ఇది ప్రతి గ్రామంలోనూ జరిగేదే...

కేవలం-వాటికి సాక్షీభూతాన్ని నేను.

చుట్టూవున్న కొండలపైనుండి, చల్లగా మెల్లగా అలల్లా కదలాడే పిల్ల వాయువులనూ అనుభవించాను. వెచ్చగా ఊపిరి సలపనంతగా ఉండే వేడి వాయువులనూ భరించాను. ఒక్కోసారి గట్లు విరగదోసుకుని, ప్రళయగర్జన చేస్తూ వచ్చే వాగులనూ భరించాను. ఆ కాలువ నీళ్లే మెల్లగా పారుతూ, పిల్లగాలులకు మెల్లగా తలలూపే పైర్లను తడుపుతూ వెళ్లటం గమనించాను.

వచ్చేవాళ్ళు వస్తూ వుంటారు, పోయేవాళ్లు పోతుంటారు. పుట్టేవాళ్ళు, గిట్టేవాళ్ళు ఎపుడూ వుంటారు. మనుషుల సుఖదుఃఖాలకి నేను కేవలం సాక్షిని...

## 1980

కాలసర్పం బుసగొట్టినట్లుగా వారిని వదలి, మెల్లగా ప్రాక్కుంటూ వెళ్లింది ట్రైన్, కీచుగొంతుతో శబ్దంచేసుకుంటూ.

ఆ స్టేషన్‌లో సాధారణంగా ఒకరిద్దరు కంటే ఎపుడూ ఎక్కువమంది దిగరు. ఆరోజు 'దించివేయబడింది' మాత్రం ఒకే ఒక్క కుటుంబం. ముతకచొక్కావేసుకొని, కొద్దిగా చినిగిన పంచె కట్టుకుని, తలగుడ్డ చుట్టుకున్న శేషయ్య. అతడి మెడపై కూర్చుని తలను గట్టిగా పట్టుకున్న మూడేళ్ళ వెంకటేశు, కుడిచేయి పట్టుకుని వెళుతున్న రైలు వేపు, చుట్టూ భయం భయంగా చూస్తున్న రెండేళ్ల తిరుపతమ్మ, ఒక చినిగిన గోతంలో సామానులు పెట్టి, వాటికేసి చూస్తున్న శేషయ్య భార్య రాజమ్మ ఎపుడు లోకాన్ని చూద్దామా అని ఆశతో కడుపులో అటూ ఇటూ తిరుగుతున్న పసిగుడ్డు.

"ఏ వూరిది?" భర్తకేసి చూస్తూ అంది రాజమ్మ. ఆమెకు దాదాపు ముప్పై ఏళ్ళు ఉంటాయి. చామనఛాయరంగుతో, నుదుట ఇంత కుంకుమ బొట్టుతో, మెడలో నల్లపూసలతో, మంగళగిరి నేత చీరెలో నిండుగా ఉందామె. రెండు చేతులకు రెండేసి ప్లాస్టిక్ గాజులు, మోచేతుల వరకు జాకెట్, మడమపైకి కట్టిన చీరె, ఎత్తుగావున్న పొట్ట, చూడటానికి బీదదిలా అనిపిస్తున్నా, ముఖంలోని ఛాయ, కళ్లలోని ఆత్మవిశ్వాసం, బుగ్గలలోని మెరుపు ఒక మంచి రైతు భార్యలా అనిపిస్తోంది.

"అదే చూస్తున్నా" పిల్లోడిని భుజం మార్చుకుంటూ అన్నాడు శేషయ్య. చేతనున్న డబ్బులన్నీ లాక్కుని హఠాత్తుగా ఆ స్టేషన్‌లో టి.సి దిగిపొమ్మనటంతో ముందుగాభరా,




తరువాత భయం, ఆదుర్దా, ఆందోళనా అన్నీ కలిసి ఉక్కిరిబిక్కిరి చేసినట్లయి చుట్టూ పరికిస్తున్నాడతడు.

స్టేషన్ చుట్టూ పొలాలు. కొంత పత్తి కొంత మిరప, కొంత జొన్నవేసి వుంది. దూరంగా ఊరు కనబడుతోంది. రేకుల షెడ్డు కిందగా రాసివున్న అక్షరాలను కూడబలుక్కుని చదివాడు శేషయ్య.

"పిడుగురాళ్ల..."

"పిడుగురాళ్లా...?" ఉలిక్కిపడింది రాజమ్మ. "ఇదీ పల్నాడేగా..." నిట్టూరుస్తూ అంది.

"అవును..." పిల్లాడిని క్రిందకు దింపి అన్నాడు శేషయ్య. "ఏం చేస్తాం మరి? ఆ టిక్కెట్లాయన ఇక్కడే దింపేసె..." నిట్టూర్చాడు. సామాన్ల మూటకు కొంచెం దూరంగా, ప్రక్కనే కూర్చుంది రాజమ్మ. "ఆc. ఏవూరయితేనేంలే- సొంతవూరు వదిలాక బతకటానికి ఏవూరయినా ఒకటే..."

ఇక కొన్నిగంటలదాకా బండి ఏదీరాదు గనుక, తన రూంకి, తాళంవేసి, ఈ కుటుంబంకేసి ఓరగా చూస్తూ తన క్వార్టర్‌కి వెళ్లిపోయాడు స్టేషన్ మాస్టర్. పాసింజర్ల దగ్గర టిక్కెట్లు తీసుకోవటం లేదా అమ్మటం చాలా అరుదుగా జరిగే సంఘటన ఆ స్టేషన్లో.

"ఇపుడెక్కడికి వెళ్లటం?...ఈ వూర్లో నీకెవరయినా తెలిసినోళ్ళున్నారా?" అంది. ఆలోచిస్తూ రేకుల షెడ్డు కేసి చూశాడు శేషయ్య. కాసేపాగి అన్నాడు, "ఎవరో దూరపు బంధువులుండాలె...పేరు గుర్తుకు రావటల్లా..."

"ఉండి బంధువులింటికి, చెడి స్నేహితులింటికి పొమ్మన్నారు...బంధువులింటికి వద్దులే..." పిల్లాడిని తన దగ్గరకు లాక్కుని ఒళ్లో కూర్చోబెట్టుకుంటూ, "డబ్బులేవన్నా మిగిల్చాడా? అన్నీ లాక్కున్నాడా?" టి.సి.ని తిడుతూ అంది రాజమ్మ. పెదవి విరిచాడు శేషయ్య. మెటికలు విరిచిందామె. బొడ్లోంచి చీరె కొంగు తీసి ముడి విప్పింది. రూపాయి నోట్లున్నాయి దానిలో. ఒకటొకటీ తీసి లెక్క పెట్టింది. పదకొండు.

తీసి భర్త చేతికిచ్చింది.

"నీవు తొందరగా ఊళ్లోకెళ్లి ఉండటానికి ఇల్లు దొరుకుద్దేమో కనుక్కోనిరా... రేపు పని కూడా దొరుకుద్దేమో విచారించు..."

మాట్లాడలేదు శేషయ్య "పనా?" గొణిగాడు.

"అదే... కూలిపనికెళదాం... నీవైతే అరక దున్నగలవు. ఎదబెట్టగలవు... నేనూ పత్తి ఏరతాను, మిరపకాయలు కోస్తాను... ఏదైనా... ఏపనైనా... ఈ డబ్బులయిపోతే రేపు పస్తు పడుకోవాల్సిందే..."

"కూలిపనా...?" గొణిగాడు శేషయ్య. అతడి కళ్లలో నీరుబికింది. అయినా ఆ నీరు కళ్లలోనే ఇంకిపోయింది. గాఢంగా నిట్టూర్చి, పైపంచ విదిలించి భుజాన వేసుకొని కదిలాడు శేషయ్య.

నెమ్మదిగా ఊరికేసి అడుగులు వేస్తున్నాడు. స్టేషన్‌కి ఊరికి దాదాపు మూడు ఫర్లాంగులుంటుంది. నడుస్తూ వుంటే గుర్తొచ్చింది శేషయ్యకు... తనెప్పుడో పదేళ్ల క్రితం అంటే దాదాపు పందొమ్మిది వందల డెబ్భైలో ఆ వూరొచ్చాడు. ఎందుకబ్బా? ఎడ్ల జత కొనటానికా? కాదు. మరెందుకు? ఊరు కొద్దిగా గుర్తొచ్చింది.

ఊరినానుకొని గుంటూరు-మాచర్ల రోడ్డు పోతుంది. ఊళ్లోకెళ్లేదారిలో ఎదురుగ్గా కారంపూడి పొయ్యేమట్టిరోడ్డు వుంది. ప్రక్కగా ఒక రెల్లు గప్పిన గుడిసెలో ఒక హెూటలుండేది. అదొక్కటేహెూటల్ ఆ వూరికి. ఆ హెూటల్ ముందు టాపులేని మోటారుకారు వుండేది. అది గొప్ప వాళ్ల పెళ్లిళ్లకు ఊరేగింపుకు వెళ్లేది. ఆ రోజుల్లో దాని కిరాయి యాభైరూపాయలుండేది. ఆ హెూటల్‌నాను

కొని అటువేపూ ఇటువేపూ హరిజన వాడ వుండేది. రోడ్డుకు ఇవతల ప్రక్క ఊరు. ఊరు చిన్నదే. దగ్గర దగ్గర ఏడెనిమిదొందల గడప ఉండేది. దానిసానుకొని చెరువు. చెరువు కింద మాగాణి. ఒక చివరగా స్మశానాల దగ్గరగా శివాలయం వుండేది...

ఊహిస్తూ మెయిన్ రోడ్డుపైకి అడుగు పెట్టాడు శేషయ్య. వస్తూనే ఉలిక్కిపడ్డాడు. అది తాను చూసిన వూరు కాదు. రహదారి వెడల్పుగా ఉంది. రెండువేపులా పక్కాబిల్డింగ్స్ వున్నాయి. అన్నీ షాపులే. ఫాన్సీ, కిరాణా, ఎరువుల కొట్లూ, హొటళ్లు... హడావిడిగా తిరిగేజనం, ఎక్కడ చూసినా రిక్షాలు, కాఫీ హొటళ్లు, పళ్ల దుకాణాలు, సోడాల బండీల వాళ్లు... ఎక్కడా పూరిగుడిసెలుకాని, హరిజనుల మట్టి మిద్దెలుకాని కనిపించలేదు. అదసలు పల్లెటూరిలా లేదు.

చిన్నపట్నంలా వుంది.

"ప్రక్కకు... ప్రక్కకు..." రిక్షా బెల్ మోగిస్తూ అరుస్తున్నాడు. తప్పుకుని ఒదిగి ఒదిగి నడుస్తున్నాడు శేషయ్య.

పట్నం రావటం శేషయ్యకు వింతేమీ కాదుగాని, 'ఈ గ్రామం ఇంతలా పెరిగిపోయిందే' అని ఆశ్చర్యపోతున్నాడు.

శేషయ్యకు ఫలానా చోటికి వెళ్లాలని ఏంలేదు. తనలాంటి రైతు లెవరయినా కనిపిస్తారేమో ఉండటానికి, పనికి విచారిద్దాం అని అతడి ఉద్దేశ్యం. కాని, ఎడ్ల బండ్లు తోలుకొస్తున్నవారుగాని, గడ్డిమోపులు తెస్తున్నవారుగాని, చెర్నకోల భుజాన వేసుకుని పశువుల్ని తోలుకొస్తున్నవారుగాని ఎవరూ కనిపించలేదు. అందుకు ఆశ్చర్యపోతున్నాడతడు. తనకు తెలిసి మంచి రైతులున్న వూరు అది. ఒకపక్క చెరువుకింద మాగాణి, వాగుల కిందసాగు, దూరంగా సాగర్ ఆయకట్టు భూమి ఉన్న గ్రామం అది. కాని ఒక్కరైతూ కనిపించలేదు.




'పదేళ్లలో ఎంత మార్పు' అనుకున్నాడు తనలోతానే. ఒక గ్రామం చిన్న పట్టణంలా రూపుదాల్చింది.

మంచినీళ్లు తాగుదామని ఒక టీ కొట్టు దగ్గర ఆగాడు శేషయ్య. నించుని టీ తాగుతున్న ఒక వ్యక్తి శేషయ్య కేసి పరీక్షగా చూడసాగాడు. దానిని గమనించాడు శేషయ్య. కాని తలపుకురాలా.

కాసేపాగి దగ్గరగా వచ్చాడతను. పరీక్షగా చూశాడు శేషయ్య. మాసిపోయిన తెల్ల చొక్కా వేసుకుని వున్నాడు అతను. ఖాకీనిక్కరు. కొంచెం మాసిన వెంట్రుకలు. పొడుగాటి ముక్కు... శేషయ్యకు గుర్తుకురాలా.

"శేషయ్యన్నా! నువ్వేనా?" దగ్గరగా వచ్చి అన్నాడతను. కంచులా మోగింది కంఠం. అపుడు గుర్తుకొచ్చాడతడు! ఆ కంఠం ఎన్ని వేలమందిలో వున్నా గుర్తించగలడతడు.

"నువ్వా ఇస్రాయేలు!" ఆనందంగా అన్నాడు శేషయ్య. అపుడే గుర్తుకొచ్చింది అతడికి పదేళ్ళ క్రితం తానీవూరు ఎందుకొచ్చాడో.

ఇస్రాయేల్‌ది తమ వూరే. తన చిన్ననాటి స్నేహితుడు. అతడికి సంబంధం కోసం ఆ వూరు వచ్చారు ఇద్దరూ కలిసి. ఆ సంబంధమే చేసుకుని ఇల్లరికం ఉన్నాడు ఇస్రాయేల్. తరువాత ఒకటి రెండుమార్లు కలిసినా, రాకపోకలు బాగా తగ్గిపోవటంతో గుర్తుపట్టలేకపోయాడు శేషయ్య.

ఆనందంతో శేషయ్యను కౌగలించుకున్నాడు ఇస్రాయేలు.

"ఏవన్నా ఊళ్ళో అందరూ బావుండారా! పిల్లలెందరు? వదిన బావుందా? " పేరుపేరునా అడిగాడు. అంతా బాగానే వున్నట్లు చెప్పాడు శేషయ్య.

"అది సరేగాని- మీ వదినా పిల్లలూ కూడా వచ్చారు అనుకోకుండా... స్టేషన్‌లో వున్నారు. నువ్వు వెంటనే నేను ఉండటానికో చిన్న ఇల్లు, చేయటానికి పని చూపించాలి'' గబగబా అన్నాడు శేషయ్య. అపుడనలేకపోతే, కాసేపాగితే తిరిగి అనలేనేమోనని. ఆశ్చ

ర్యంగా శేషయ్యవైపు చూశాడు.

"అదేంటన్నా? రెండుగాళ్ళ ఆసామీవి... నా బోటోళ్లకి పదిమందికి పనిచూపించేవా డివి... నీకు పనేంటి?... ఇల్లేమిటి?" వినగూ డనిది విన్నట్లుగా అన్నాడు.

"ఆ విషయం తరువాత మాట్లాడదాం... 'ముందా పని చెయ్యాలి..." తల పక్కకు తిప్పుకుని అన్నాడు శేషయ్య.

"సరే పద..." టీకి డబ్బులిచ్చి, శేష య్యకు మంచినీళ్ళిప్పించి, రిక్షావేపు కదిలా డు.

"రిక్షానా... వద్దు వద్దు... నడిచే పోదాం..." కంగారుగా అన్నాడు శేషయ్య.

"రిక్షా మనదేలే- ఎక్కు" నవ్వుతూ అన్నా డు ఇస్రాయేల్.

"నీ రిక్షానా?" ఈసారి ఆశ్చర్యపోవటం శేషయ్య వంతయింది.

"అవును నాదే... నా స్వంతం" కొంచెం గర్వంగా అన్నాడు ఇస్రాయేల్. "దీనికి అద్దెక ట్టాల్సిన పనిలేదు. వచ్చేదంతా నాదే..."

"కానీ-" రిక్షాలో ఎక్కటానికి సందేహిస్తు న్నాడు శేషయ్య. తను రిక్షాలో కూర్చోవటం, ఇస్రాయేల్ తొక్కటం అతడికెందుకో బాధవే సింది.

"అదేంటన్నా ఆలోచిస్తుండావు?" నవ్వాడు ఇస్రాయేల్.

"ఇది తప్పేంకాదు... కార్లుండోళ్ళు పెళ్లా న్ని, చుట్టాల్ని కూర్చోబెట్టుకోని పోటల్లా? ఇదీ అంతే... ఎక్కెక్కు..." బలవంతాన గూడు రిక్షాలో ఎక్కించి, తను ముందుకొచ్చి, రెండ డుగులు వేగంగా వేసి, పెడల్పై కాలుబెట్టి రిక్షా ఎక్కాడు ఇస్రాయేల్. పావుగంటలో స్టేషన్ చేరారు వారు. దారిలో తన పరిస్థితులు ఏమిటో చెప్పలేదుగాని, ఊరు విడిచి బ్రతకటా నికి వచ్చానని మాత్రం చెప్పాడు శేషయ్య. ఏ గనాప పని చూసుకోకుండా వుంటే తన కుటుంబం పస్తులుండాల్సి వస్తుందనీ చెప్పా డు.

"సరేనన్నా... ముందు మా ఇంటికి వెళ దాం... రాత్రికి అన్నీ వివరంగా మాట్లాడు కుందాం" అంటూనే 'నీకేం అభ్యంతరం లేకపోతే' అని కలిపాడు.

"ఇపుడు నీకంటే బీదవాడినిరా!" నవ్వా డు శేషయ్య. "నీకు స్వంత రిక్షా అయినా వుంది... నాకు స్వంతం అంటూ భార్యాపిల్ల లు తప్ప ఏదీ లేదు" అతడి గొంతులో వేదాంతం ధ్వనించింది.

"నా దగ్గర మొహమాటమేందన్నా... చె ప్పు... మీ బంధువులున్నారు ఈ వూళ్లో వాళ్ళింటికి తీసుకుపోనా?"

"వద్దురా! చుట్టాలింటికి వెళ్ళదలచలే దు... ఈ రోజు నీ ఇంట్లోనే వుంటాను. నాకు ఉండటానికి చిన్న ఇల్లు, పనీ చూపించు చాలు... నీ మేలు ఈ జన్మకు మర్చిపోలే ను..."

"అంత పెద్ద మాటలొద్దన్నా..." ఇస్రా యేల్ కంఠం రుద్ధమయింది. రిక్షా స్టేషన్ ముందు ఆగింది. రాజమ్మని ఆప్యాయంగా పలకరించాడు ఇస్రాయేల్. తానే పిల్లల్ని ఎత్తు కుని రిక్షాలో కూర్చోబెట్టాడు. సామానున్న బస్తాను పైన కట్టి, వాళ్ళిద్దరినీ లోపల ఎక్క మన్నాడు. మొహమాట పడుతూనే రిక్షా ఎక్కారు వారు. రిక్షా కదిలింది.

రిక్షా మెయిన్ రోడ్ వేపు వెళ్ళకుండా రైల్వేగేట్ దాటి వెళుతోంది.

"అదేంటిరా ఇస్రాయేలూ ఇటొస్తున్నావ్... మీ ఇల్లు మెయిన్ రోడ్డుమీదే వుందిగా?" ఆశ్చర్యంగా అడిగాడు శేషయ్య.

"నిజమేనన్నా... కాని దానిని అద్దెకిచ్చా ను. గవర్నమెంటు కాలనీలో నాకు ఇల్లు ఇచ్చారు గదా... దానిలో ఉంటున్నాం. అద్దెకి చ్చేటప్పుడు షాపు వాళ్ళు ఎడ్వాన్సు ఇచ్చా రు. దాంతోనే స్వంత రిక్షా కొనుక్కున్నాను"

రైలు కట్టకు ఆనుకుని వుంది వెనుకబడిన వర్గాలకోసం ప్రభుత్వం కట్టించిన కాలనీ. దానిలో ఒక ఇంటిముందు రిక్షా ఆపాడు




ఇస్రాయేలు.

శేషయ్య దిగుతుంటే, గబగబా పైనున్న మూటను అందుకొని లోనికి తీసుకెళ్ళాడు ఇస్రాయేల్.

భార్యకు శేషయ్య కుంటుబాన్ని పరిచయం చేయగానే ఆనందంతో పొంగిపోయింది ఇస్రాయేల్ భార్య మరియమ్మ. పెద్దింటివాళ్ళు తమ ఇంటికి అతిథులుగా రావటం, అదీగాక తన సంబంధాన్ని ఖాయం చేయించిన శేషయ్యేరావటం దానికి కారణం. వెంటనే మంచంవేసి దానిమీద శుభ్రమైన దుప్పటి పరిచి కూర్చోబెట్టింది. కాసేపట్లోనే అందరికీ కాఫీలు ఇచ్చింది. ఆమె కొడుకు ఏసుపాదంని దగ్గరకు తీసి ముద్దాడింది రాజమ్మ.

'అదే తమ పల్లెటూళ్లో అయితే అలా చేయగలిగేదా?' ఎందుకో తనలో తానే అనుకుంది రాజమ్మ. డబ్బు, సంఘంలో హోదా ఎంత దగ్గరివారినయినా దూరంగానే వుంచుతాయి. ఇస్రాయేల్ తమ ఇంటికి ఒకటి రెండుసార్లు వచ్చాడు. కాని ఇంటిలోపలికి రాలేదు. పంచలోనే ధాన్యం బస్తాలపై కూర్చుని, తన భర్తతో మాట్లాడి, తను కాఫీ ఇస్తే తాగి గ్లాసు తానే కడిగి అక్కడుంచేవాడు. అది గుర్తుకువచ్చి నిట్టూర్చింది రాజమ్మ.

ఇస్రాయేలు, శేషయ్య బయటవరండాలో ఇనుప కుర్చీలు వేసుకుని కూర్చున్నారు. తన అవసరం గురించి మళ్ళీ చెప్పాడు శేషయ్య.

"అన్నా! మా కాలనీలోనైతే ఇళ్లు చవకగా అద్దెకు దొరుకుతాయి... ఉంటావా?" ఆలోచిస్తూ అన్నాడు.

"ఇక్కడ ఇళ్లు అద్దెకు ఇస్తారా?" ఆశ్చర్యపోయాడు శేషయ్య.

"ఆc! కావాలంటే అమ్ముతారు కూడా. అన్నట్లు మా బంధువు దేవసహాయానికి రెండిళ్ళున్నాయి ఈ కాలనీలో... ఒకటి అద్దెకిచ్చాడు రెండోది ఖాళీగా వుంది... దానిలో చేరుదువు... అద్దె పదిహేను రూపాయలేలే'

"రెండిళ్ళున్నాయా?" ఆశ్చర్యపోయాడు.

"అదెలా?"

"అదంతేలే అన్నా... దేవసహాయం మా చినమావగారవుతార్లే. ఆయన ఈ వూళ్లోనే పంతులుగా పనిచేస్తున్నాడు. ఆయన భార్య దానమ్మ కూడా పంతులమ్మే... ఊళ్లో మంచి మేడ కూడా కట్టుకున్నాడు. వారిద్దరిపేరా రెండిళ్ళిచ్చారు. పలుకుబడి వున్నవాడు కదా..." నవ్వాడు ఇస్రాయేల్. "అయితే ఆయనకూ నాకూ విరోధంలేదుగాని అంత మంచి సంబంధాలు లేవు... అయినా నేమాట్లాడతాలే..."

"ఎందుకు? ఏమయినా ఆస్తిగొడవలా?"

"కావు... మతం గొడవలు..." నవ్వాడు ఇస్రాయేల్. "మేం మతం పుచ్చుకున్నాం కదా... క్రిస్టియన్స్‌మి. ఆయనా మతం తీసుకున్నాడుగాని రిజర్వేషన్ కోసం రికార్డుల్లో మార్చుకోలేదు. కొడుకుకి కూడా మతం పేరు పెట్టకుండా ప్రఫుల్లకుమార్ అని పెట్టాడు... అది మాకు నచ్చలేదు. ఆయనా చర్చికి వస్తాడు అన్నీ చేస్తాడు, ఇంట్లో ఏసుక్రీస్తు బొమ్మలు, అంబేద్కర్ బొమ్మలూ పెట్టుకుంటాడు''

తల పంకించాడు శేషయ్య.

ఆపూట వారింట్లోనే భోజనం చేశారు శేషయ్య కుటుంబం. వారికోసం ప్రత్యేకంగా చేపల పులుసు వండింది మరియమ్మ. భోజనం కాగానే శేషయ్యని విశ్రాంతి తీసుకోమని చెప్పి, ఊళ్లోకి వెళ్లి ఇల్లు ఖాయం చేసుకొచ్చాడు ఇస్రాయేల్.

రాత్రి భోజనాలయ్యాక శేషయ్య చుట్ట త్రాగుతూ బయటకూర్చున్నాడు. ఇస్రాయేల్ని పని గురించి అడిగాడు.

"ఈ ఊళ్లో కష్టపడేవారికి పనికి ఢోకాలేదన్నా... కాని ఏం పని చేస్తావు?"

"ఏదయినా?"

"ఇక్కడేపనయినా దొరుకుతుందన్నా...

బయట ఊళ్లోనుండి ఎందరో పనివారు వస్తుంటారు. సున్నపు బట్టీలలో పని దొరుకుతుంది. రాళ్ళు చిన్న ముక్కలుగా కొట్టటం కాని, గనిలో అయితే రాళ్ళు తవ్వటంగాని ఏదయినా... లేదా పొలం పనులైనా వున్నాయి''

"నాకు తెలిసింది పొలం పనేగదా అదే చేస్తాను''

"కాని కూలి తక్కువన్నా... మిగతా పనులైతే కూలి ఎక్కువ. పోనీ రిక్షావేస్తావా?" నవ్వాడు శేషయ్య. ఇస్రాయేల్ అతడిని ఎగతాళి చేయటానికి ఆ మాట అనలేదు. అది శేషయ్యకూ తెలుసు. కాని తను రిక్షా ఏం తొక్కగలడు? అదేమాట అన్నాడు.

"పోనీ ఏ రైతు దగ్గరయినా జీతగానిగా పని దొరుకుతుందా? అదయితే కొంత భద్రతా వుంటుంది. నీకు తెలుసు గదా నాకు పూర్తి వ్యవసాయం పనులు తెలుసు''

'ఇక్కడ అలాటివి దొరకవన్నా... చిన్నా చితకా రైతులున్నా స్వంతంగా చేసుకుంటారు. జీతగాళ్లను భరించే స్తోమత ఎవరికీ లేదు. పొలాలు దున్నటానికి, దమ్ముకి ట్రాక్టర్లు వచ్చేశాయి. పోనీ పొలం కౌలుకు తీసుకుని వ్యవసాయం చేయకూడదూ?"

విషాదంగా నవ్వేడు శేషయ్య "అదే చేయగలిగితే ఊరు వదిలి వచ్చే అవసరం నాకు లేదు'' శూన్యంలోకి చూస్తూ అన్నాడు. వివరాలడగటం ఇష్టంలేక వూరుకున్నాడు ఇస్రాయేల్. తెలుసుకుందామనే ఆసక్తి వున్నా గతాన్ని తవ్వి బాధపెట్టటం ఎందుకు అని అడగలేదు.

"సరే మా కాలనీలోనే కొందరు వ్యవసాయపు పనులకెళ్లే వారున్నారు. వారితో మాట్లాడతాను. రేపు ఇంట్లోకి చేరి, ఎల్లుండి నుండి పనిలోకి వెళదువు... నాలుగైదు రోజులకు సరుకులు మా ఇంట్లో పట్టుకెళ్లు... వీలయినపుడు ఇవ్వవచ్చు''

"సరే... మీ వదిన గూడా పనికెళుతుంది'' చెప్పి తల తిప్పుకున్నాడు శేషయ్య. మాట్లాడలేదు ఇస్రాయేల్. కాని అతడి గుండె బాధతో చలించిపోయింది.

మరునాడుదయమే ఇల్లు మార్చాడు శేషయ్య. ఒక్క గది, ముందు వరండాలున్న ఇళ్లు కాలనీలోవి అన్నీ. దేవసహాయం మాష్టారు మాత్రం తన ఇళ్లకు మరోగది అదనంగా కట్టించుకున్నాడు. చుట్టూ కాంపౌండ్‌వాల్, చుట్టూ పూలమొక్కలు పెంచాడు. ఇల్లు బాగా నచ్చింది శేషయ్యకి. అతనుగాక మరో ఇద్దరు ఆ కాంపౌండ్‌లోనే అద్దెకు ఉంటున్నారు. తన పోర్షన్‌కి ఆనుకుని వున్న భాగంలో వెంకటసుబ్బయ్య కుటుంబంతో ఉంటున్నాడు. చిన్న వ్యాపారంచేసి, అందరికీ అప్పులు పెట్టి వసూలుగాక దివాలా తీసి, తిరిగి ఊళ్లో ముఖం చూపలేక మార్కాపురంనుండి గత సంవత్సరమే లేచివచ్చి ఇక్కడ వుంటున్నాడు.

అవతల పోర్షన్లో కృష్ణాజిల్లానుండి బ్రతుకు తెరువుకోసం వచ్చిన జయప్రకాష్ ఉంటున్నాడు. అతడికి పెళ్లి కాలేదు. ఎస్సెస్సీదాకా చదువుకున్నాడు. వయసు కూడా ఇరవైఐదులోపే వుంటుంది. ఇంట్లో చేరగానే పరిచయమయ్యారు వారు ఇద్దరూ. అవతల మరో గదిలో ఒక ఆడకూతురు వుంటోందిగాని శేషయ్యకు ఆమె కనిపించలేదు.

క్షణాలలో ఇల్లంతా శుభ్రంచేసి ముగ్గులు పెట్టింది రాజమ్మ. శేషయ్య కూడా పనిలో సాయపడసాగాడు.

వెంకటసుబ్బయ్య కాంపౌండ్ వాల్ దగ్గర నిలబడ్డాడు పేపరు కుర్రాడికోసం చూస్తూ. ఆయనకు ముప్పైఐదేళ్లుంటాయి. కొంచెం వల్లగా వుంటాడు. ముఖ్యంగా చెరిగిపోని చిరునవ్వు ఆయన ప్రత్యేకత. ఖద్దరు చొక్కా వేసుకుని, పంచె కట్టుకుని వుంటాడు.

ఆయన పేపర్‌బోయ్ కోసం ఎదురుచూట్టం, పేపరు కొంటానికి కాదు. కుర్రాడు ఆ దారిన వస్తూ వుంటే అడిగి పేపర్ తీసుకుంటాడు అందుకోసం. అంతలోనే బెల్ కొట్టు

కుంటూ అటుకేసి వచ్చాడు పేపర్ కుర్రాడు. వెంకటసుబ్బయ్యను చూడగానే నవ్వుతూ పేపరిచ్చి వెళ్లాడు.

వెంకటసుబ్బయ్యా పేపరు వార్తలకోసం చదవడు. ధరల కోసం చదువుతాడు. పైగా పెద్దగా చదవటం ఆయన అలవాటు. పేపరు అందుకుని తనకి కావాల్సిన పేజీ తిప్పాడు వెంకటసుబ్బయ్యా.

"ఊం... బియ్యం రూపాయిన్నర... నూనె ఏడున్నర. పంచదార రెండూ పదిహేను పైసలు... ఉల్లిగడ్డలు రూపాయి... ఆం... ఆం... బంగాళాదుంపలు రెండు రూపాయలు... టమోటా అర్ధరూపాయి... సజ్జలు రెండు రూపాయలు... పచ్చిమిర్చి రూపాయి... అబ్బో కొంచెం పెరిగిందే. ఆం... కోడిగుడ్డు ముప్పై పైసలు... మటన్ తొమ్మిది రూపాయలు... ఛీ... ఛీ... అరటిపళ్లు డజన్ రూపాయి..."

"ఏవండీ సుబ్బయ్యగారూ పేపర్ చదవటం అయిపోయిందా?" దగ్గరగా వచ్చాడు జయప్రకాష్.

"ఆం... ఆం... ఏవుందీ... ఏంతసేపు చదవటం... రెండు నిమిషాలు... ఏవిటో అన్నీ రేట్లు పెరుగుతున్నాయి"

జయప్రకాష్ త్వరగా పేపర్ లాక్కుని గబగబా చదివేస్తున్నాడు. తెల్లటి లాల్చీ వేసుకుని, శుభ్రమైన లుంగీ కట్టుకుని వున్నాడు. అతడు ఏ ఉద్యోగమూ పని ఏదీ చేయకపోయినా బట్టనలగకుండా ఎలా వుండగలుగుతున్నాడో అర్థం కాదు వెంకటసుబ్బయ్యకు. పొడవైన నాసికతో, ఉంగరాల జుట్టులో, కోరమీసంతో హుందాగా, గంభీరంగా కనిపిస్తాడు. చదివింది ఎస్సెస్సీ అయినా అన్ని విషయాలు చాలా చక్కగా మాట్లాడతాడు.

అంతలో సైకిల్ బెల్ వినిపించింది. అంటే పేపర్కుర్రాడు పేపర్లు అందరికీ ఇచ్చేసి వస్తున్నాడన్నమాట. పేపర్ శుభ్రంగా మడిచి, కొత్తదానిలా వుండేలా చేసి ఆ కుర్రాడి చేతికిచ్చాడు జయప్రకాష్. వెంటనే వెంకటసుబ్బయ్య పదిపైసలు, జయప్రకాష్ పదిపైసలు ఆ పేపర్ కుర్రాడికి ఇచ్చారు. తీసుకుని పైజేబులో వేసుకొని రయ్యన వెళ్ళిపోయాడు ఆ కుర్రాడు.

"ఏం వార్తలున్నాయని రోజుకు పది పైసలు ఖర్చుపెడుతున్నావబ్బాయ్?" ఊసుపోక అడిగాడు వెంకటసుబ్బయ్యా.

"మీరెందుకు కేవలం సరుకుల ధరలు చూడటం కోసం పది పైసలు ఖర్చుపెడుతున్నారు'' చిలిపిగా అడిగాడు జయప్రకాష్.

"ఏదో బతికి చెడ్డవాడిని. ఎప్పటికైనా తిరిగి చిల్లరకొట్టు పెట్టుకోలేకపోతానా అని నా ఆశ. అందుకు అన్ని సరుకుల రేట్లు బాగా తెలిసివుండాలి. అది వ్యాపార రహస్యం"

"అయినా మీ వ్యాపారం బాగానే వుందిగా?" నవ్వుతూనే అన్నాడు. సుబ్బయ్య రోజూ పొద్దుటే ఇడ్లీచేసి వీధి వీధి తిరిగి అమ్ముకొస్తాడు. ఉదయం తొమ్మిది గంటలలోపే అతడి పని పూర్తవుతుంది. తరువాత వెళ్ళి ఒక ఫచారికొట్లో గుమాస్తాగా పనిచేస్తాడు.

"ఏం వ్యాపారంలే అబ్బాయ్. ఏదో కుటుంబం నెట్టుకుపోతోంది అంతే. ఇలా ధరలు పెరిగేరోజుల్లో ఈ సంపాదనతో ఏం బతకగలం? మధ్యాహ్నం బజార్లో టీ తాగాలంటే పదిహేను పైసలు... ఎండకి సోడా తాగుదామంటే పదిపైసలు. నోరు చచ్చి కిళ్లీ వేసుకుంటే పదిహేనుపైసలు. ఈ పెరిగే ధరల్లో ఎలా బతకాలో అర్థం కావటంలేదు. ఏదో నాలుగురాళ్లు కూడబెట్టి చిల్లర దుకాణం పెట్టుకుందాం అని నా ఆశ. అదీ జన్మకు నెరవేరుతుందో, లేదో?" నిట్టూరుస్తూ అన్నాడు.

"భలేవారే! వ్యాపారం చేయటానికి పెట్టుబడి కావాలా?" నవ్వాడు ప్రకాష్. ఆశ్చర్యంగా చూశాడు సుబ్బయ్యా.

"పెట్టుబడి పెట్టి వ్యాపారం చేయటంలో గొప్పతనమేముంది? అది ఏ తెలివితక్కువ





దద్దమ్మ అయినా చేస్తాడు. పెట్టుబడి లేకుండా వ్యాపారం చేయటమే గొప్పతనం. తెలివితేటలూ'' నవ్వాడు.

కళ్ళు చిట్లించి చూశాడు సుబ్బయ్య. "అబ్బాయ్! నాకో అనుమానం, అసలు నువ్వేం పనిచేస్తావ్? తిండి ఎలా జరుగుతుంది?"

"చెప్పానుగా... తెలివితేటలే నా పెట్టుబడి..."

"అంటే?"

"చెప్పానుగా... తెలివితేటలే నా పెట్టుబడి. పరిచయాలే నాకున్న ఎస్సెట్. ఉదాహరణకి మీరున్నారు. మళ్ళీ చిల్లరకొట్టు పెట్టాలనేది మీ ఆశయం. మీరు ఇలాగే చేస్తూపోతే జీవితాంతం ఇడ్లీలు అమ్ముకుంటూ, కలలు కంటూ ఇలాగే వుండిపోతారు. ఎందుకంటే మీకు మోసం చేయటం చేతకాదు. అందర్నీ తేలికగా నమ్ముతారు. అదే అతితక్కువ పెట్టుబడితో ఎంతో సంపాదన వచ్చే మార్గం మీకు చెబుతాను''

"ఏమిటది?" ఆత్రుతగా అడిగాడు సుబ్బయ్య.

నవ్వాడు ప్రకాష్. "ఇందాక అడిగారు చూడండి. నీవెలా బ్రతకుతావని... ఇలాగా. ఇప్పుడు మీకు ఆ పథకం చెప్పాననుకోండి దానికి ఫీజు కింద వంద రూపాయలు తీసుకుంటాను''

"వందా?"

"అవును. నా పథకం విన్నాక మీకు నచ్చితేనే ఇవ్వండి. అంతేకాదు అది పూర్తవటానికి అన్ని పనులు నేనే చేసిపెడతాను. దాని ఛార్జీలు మరో రెండు వందలు ఉంటాయి''

కొద్దిక్షణాలు ఆలోచించాడు సుబ్బయ్య. "ఇదుగో అబ్బాయ్... ఇంటిపక్కనే ఉంటున్నాం. మోసం చేస్తే బావుండదు. ఆ పద్ధతి ఏమిటో చెప్పు''

"వంద ఇస్తారా?"

"ఆఁ"

"మీ వద్ద ఇప్పుడు డబ్బెంత వుంటుంది?"

"ఇదిగో అబ్బాయ్... ఆ పద్ధతి నాకు నచ్చితేనే డబ్బిచ్చేది...."

"అలాగే... అసలు డబ్బులేకుండా కూడా చేయవచ్చుగాని, వడ్డీ అవుతుంది. అందుకే మీ దగ్గర ఎంత డబ్బుందని అడిగాను''

"సుమారుగా ఐదువందల రూపాయలు''

"అయితే అందులో నాకిచ్చే వందరూపాయలు పోతే- ఇంకా నాలుగొందలుంటుందన్నమాట" అంటూనే మనసులోనే లెక్కలు కట్టాడు.

"ఇంతకీ విషయం చెప్పు''

"చెబుతాను... ఇడ్లీలు మీ భార్యే చేస్తారుకదా. చాలా రుచిగా వుంటాయి. ఇకనుండీ మీరు వీధి వీధి తిరిగి ఇడ్లీలు అమ్మే అవసరంలేదు. కష్టమర్లే మీ దగ్గరకొస్తారు''

"అంటే- హోటలు పెట్టాలా...? నా వద్ద డబ్బులేదు''

"డబ్బు అఖ్ఖరలేదు... హోటలూ పెట్టరు''

"మరి''

"మీరు రేపే ఒక నాలుగు చక్రాలబండి అద్దెకు తీసుకుంటారు. దాని అద్దెరోజుకు పది రూపాయలు. మీ దగ్గర ఇడ్లీ పాత్రలు అన్నీ వున్నాయి గాబట్టి అవి కొనే పనిలేదు. మీరు కొనాల్సినవి పెద్ద బాణలి ఒకటి. అది 250 రూపాయలు అవుతుంది. పెద్ద చిల్లుల గరిటె 60 రూపాయలు. మరో రెండు చిన్న గరిటెలు రెండు కట్టల టిఫిన్ ఆకులు, చిల్లరవస్తువులూ అన్నీ కలిపి ఇరవై రూపాయలు అవుతాయి. ఇక గాలికొట్టే పెద్ద కిరసనాయిల్ స్టౌ కొనాలి. అది డెబ్బైరూపాయలు అవుతుంది. దాంతో మీ స్వంతవ్యాపారం ప్రారంభం. మీ మొత్తం పెట్టుబడి నాలుగొందలు. సరేనా-!"

"అంటే?"

"మీరు రేపు ఉదయమే బండిమీద ఇడ్లీ పాత్ర పెట్టుకుని ఊళ్లో మంచి సెంటర్లో

ఉంటారు. అక్కడే బండిమీద ఇడ్లీలు అమ్ము తారు. తరువాత బార్‌కి దగ్గరగా బండివుంచి గారెలు, మిరపకాయ బజ్జీలు అమ్ముతారు''

"దానికి పెట్టుబడి''

"మీరు కొట్లో గుమాస్తాగా చేస్తున్నారుగ దా? ఆ కొట్లోనే నాలుగు కిలోల సెనగపిండి, మూడు కిలోల నూనె వగైరాలు అరువు తీసుకోండి. సాయంత్రానికి ఆ అప్పు తీర్చేయ వచ్చు. అలాగే కిరసనాయిలూ. మీకు డబ్బు కొద్దిగా అవసరమయినా అప్పు ఏర్పాటు చేస్తాను. మీకు ఐదొందలు అవసరం అను కోండి, అతడు మీకు వడ్డీ యాభై తగ్గించి 450 చేతిలో పెడతాడు. మీరు రోజుకు పదిరూపా యల చొప్పున ఏభైరోజులు తీర్చాలి''

"కాని... నాకు అప్పెవరిస్తారు. బండి అద్దెకు ఎవరిస్తారు? బజార్లో పెట్టుకుంటే పోలీసులు ఊరుకుంటారా? షాపులవాళ్లు ఊరుకుంటారా?" అనుమానంగా అడిగాడు.

"ఆ ఏర్పాట్లన్నీ చేసేందుకే నేను రెండొందలు తీసుకుంటాను. మీకు అప్పు ఇప్పిస్తాను. బండి అద్దెకు ఇప్పిస్తాను. బండి పెట్టుకునేందుకు జాగా చూపిస్తాను. అయితే ఆ షాపువారికి మీరు నెలకింతని అద్దె కట్టాల్సి వుంటుంది. అలానే పోలీసు మామూళ్లు మా ట్లాడి పెడతాను. ఈ పనులన్నీ చేసినందుకు నా ఫీజుగా రెండొందలు నీకు ఇప్పించే అప్పులోనే తీసుకుంటాను''

"ఎంత మిగుల్తుందంటావు?"

"రోజుకు మీ ఖర్చులన్నీ పోను... వంద రూపాయలు మిగుల్తాయి. అంటే నెలకు మూడువేలు. ఈ రోజుల్లో ఒక గవర్నమెంటా ఫీసులో పన్చేసే యూడీసీకి వచ్చే జీత మెంతో తెలుసా? ఆరొందలు. అంటే మీ సంపాదన ఎంత పెద్దదో ఆలోచించుకోండి''

కొద్దినిమిషాలు లెఖ్ఖలు కట్టి సరేనన్నాడు సుబ్బయ్య.

"ముందు నా ఫీజు వందా ఇవ్వండి. ఇప్పుడే నాతో బయల్దేరితే మీ పనులన్నీ సాయంత్రానికి పూర్తవుతాయి. రెండొందలూ సాయంత్రం ఇవ్వండి'' సుబ్బయ్య లోనికెళ్ళి వంద రూపాయలు తెచ్చిఇచ్చాడు. కళ్లకద్దు కుని జేబులో పెట్టుకున్నాడు ప్రకాష్.

అరగంటలో స్నానంచేసి, ఇస్త్రీ బట్టలు వేసుకుని, పౌడర్ పూసుకుని, మెడలో రోల్డ్‌గో ల్డ్ చెయిన్ వేసుకుని, టక్‌చేసి, షూ వేసుకుని రెడీ అయ్యాడు ప్రకాష్. అప్పటికే సిద్ధంగా వున్నాడు సుబ్బయ్య.

సాయంత్రానికి అన్ని పనులూ పూర్తిచేసి తన రెండువందలూ జేబులో వేసుకుని ఇంటి కి తిరిగివచ్చాడు ప్రకాష్. అతడితోపాటే చక్రాలబండిని తోసుకుంటూ వచ్చాడు సుబ్బ య్య. దానిపై భాండీ, చిల్లుల గరిటెలు, స్టౌ, ఇతర పదార్థాలు ఉన్నాయి.

మరునాడు రాత్రికి బండితోసుకుని తొమ్మి దింటికి ఇల్లు చేరాడు సుబ్బయ్య, భార్య పరమేశ్వరి, కూతురు, ఇద్దరు కొడుకులతో. వస్తూనే రెండు మిరపకాయబజ్జీలు ప్రకాష్‌కి ఇస్తూ అన్నాడు... "ఈరోజు మిగిలింది ఎనభై రూపాయలు'' అని.

ఆరోజే శేషయ్య రాజమ్మ కూలికి వెళ్ళివ చ్చారు. వచ్చిన కూలీ ఇరవైరూపాయలలో సరుకులుపోను మిగిలింది ఒక్కరూపాయి!!



బయట అరుగులా కట్టబడిన సిమెంట్ చప్టా పై దుప్పటి పరుచుకుని పడుకున్నాడు శేష

య్య. అతడికి నిద్రపట్టటంలేదు. ఆశాజన కంగా లేని బ్రతుకులా పైన నక్షత్రాలు మిలమి లా మెరుస్తున్నాయి. చందమామ వెలుగు పట్టపగల్లా వుంది. 'పున్నమి' కాబోలు అను కున్నాడు తనలోతానే.

పున్నమిని తలుచుకోగానే ఎన్నో స్మృతు లు శేషయ్య మదిలో కదలాడాయి. తన స్వంతగడ్డ, ఇల్లు, చుట్టాలు. స్నేహితులు అంతా గుర్తుకొచ్చారు...

పున్నమి...

అదే పున్నమి ఐదేళ్లక్రితం అతడి జీవి తంలో మార్పు తెచ్చింది. అదీ పతనంవేపు.

ఎగువ పల్నాడులో మాచర్ల తాలూకాలో చిన్న పల్లెటూరు రామాపురం. అంతకు ముందు ఆ ప్రాంతం కరువుకు నెలవైనా నాగార్జునసాగర్ నీళ్లు రావటంతో రైతులు బాగుపడ్డారు. నీటికరువు లేకపోవటంతో పంటలు విపరీతంగా పండేవి. దానికితోడు వాణిజ్యపంటలు మిర్చి, ప్రత్తి మొదలైనవి రైతు చేతిలో డబ్బాడేలా చేసింది.

అంతకుముందు గ్రామంలో రెండు పార్టీ లు వున్నా గొడవలు వుండేవి కావు. రెడ్లు ఒకపక్షం, కమ్మవారు ఒకపక్షం వుండేవారు. మిగతావర్ణాలవారు ఈ రెండువర్గాల వెనకాలే వుండేవారు. పంచాయతీ ఎలక్షన్స్ సమ యంలో కొద్దిగా ఉద్రిక్తతలు రేగినా, తరువాత సర్దుమణిగేవి.

అసలే పల్నాడు, కక్షలకు కార్పణ్యాలకు, ఉద్రేకాలకు, వీరత్వానికి పెట్టిందిపేరు. హత్యలు మురాతగాదాలు ఆ ప్రాంతంలో సర్వసాధారణం.

ఆ గ్రామంలో పెదకాపు శేషయ్య. కొద్దిగా చదువుకున్నాడు. పదెకరాల ఆరుదళ్ల పొలాని కి ఆసామీ. రెండుగాళ్ల వ్యవసాయం, ఇద్దరు పాలేర్లు, మంచి ఇల్లు, తరతరాలుగా వస్తున్న వంశగౌరవం అతడి స్వంతం.

ఊళ్లో రెండు పార్టీలు వున్నా ఏ పార్టీకీ చెందని వ్యక్తి శేషయ్య. నీతికీ నిజాయితీకీ మారుపేరు. అన్నపూర్ణమ్మ తల్లిలా పేరుంది రాజమ్మకు. ఊళ్లో తగాదాలు అతడే ఎక్కువ పరిష్కరించేవాడు. రెండు పార్టీల మధ్య చిన్న చిన్న పొరపొచ్చాలొచ్చినా సర్దిచెప్పేవా డు.

జ్యేష్టమాసం ఆరంభంలోనే తొలకరి జల్లుతో పుడమితల్లి పులకరించింది, కడుపు పండుతుందనే ఆశతో. నట్టు తీసిన చేలలో పెద్ద పెద్ద పెడ్డలపై ముత్యాల్లా రాలిన నీటిబొట్లకు ఆ పెడ్డలు ఉప్పొంగి స్వాతిచిను కుకోసం ఎదురుచూస్తున్న ముత్యపు చిప్పల్లా విడివడ్డాయి. తడిసిన మట్టినుండి వచ్చే అదో రకమైన వాసన భూదేవి బిడ్డల తనువు పులకరింపజేస్తున్నది.

వానతగ్గి, సన్నని జల్లు పడుతోంది. కురి సిన మబ్బులు దాహంతీరిన ఏనుగుల మందలా భారంగా ఒకదానినొకటి రాసు కుంటూ పోతున్నాయి. పిల్లలు వానలో తడు స్తూ 'వానావానా చెల్లప్పా' అని పాడుతూ గంతులేస్తున్నారు. కొందరు పిల్లలు చిన్న చిన్న పడవలు చేసి నీటిలో వదులుతున్నారు.

వరండాలో కూర్చుని చుట్ట చుట్టుకుంటు న్న శేషయ్య చెవులకు, పెంకుల అంచుల నుండి అడపాదడపా 'టప్'మని రాలుతున్న నీటిబిందువుల శబ్దం లయబద్ధమైన సంగీ తంలా వినిపిస్తోంది. వానజల్లుకి పరవ శించని రైతెవ్వడు.

"ఇదో, పున్నమి ఎప్పుడూ?" లోనికి తల తిప్పి భార్యనుద్దేశించి అన్నాడు శేషయ్య.

"ఎల్లుండేకదా? అయినా నాకు తెలీకడుగు తాను, ఎన్నిసార్లడుగుతావీ ప్రశ్నని?" చిరు కోపం తెచ్చుకుని, ముక్కు విచిత్రంగా విరిచి అంది రాజమ్మ. చిన్నగా నవ్వేడు శేషయ్య. ఆమె ముక్కుకు కొత్తగా కొన్న ముక్కుపుడక ప్రకాశానికి ముక్కు అందంగా వుందో లేక ముక్కు అందానికి ముక్కుపుడక ప్రకాశిస్తు న్నదో అతడికి తెలియలేదు. కళ్లలోని మెరుపు ముక్కుపుడకపై పడి అది మెరుస్తోందో లేక

ముక్కుపుడక మెరుపు కళ్లల్లో ప్రతిఫలిస్తోందో కూడా అర్థం కాలేదు శేషయ్యకు. మెడలో నానుతాడుతోపాటు ఉన్న కాసులపేరు శంఖంలాంటి ఆ మెడను మరింత శోభాయమానంగా చేస్తున్నది. భార్యకేసి ఆనందంగా, తృప్తిగా చూసి చిన్నగా నవ్వేడు.

"రేపొచ్చే పున్నమి పండుగే... ఆమాత్రం తెలీదూ?"

"ఏం పండుగంట?"

"ఏరువాక పున్నమే..."

ఉలిక్కిపడింది రాజమ్మ. "అవునుకదూ! మర్చేపోయాను'' హడావిడి పడుతూ లోనికెళ్లిందామె.

మట్టిమనిషికి సంక్రాంతి పండుగ ఎంత ముఖ్యమో, ఏరువాక కూడా అలాటిదే. తన శ్రమ ఫలించి, ఇంటికి చేరిన ధాన్యపు రాసులను చూసి ఆనందంలో మకర సంక్రాంతి జరుపుకుంటే, వచ్చే ఏడాదికి అంతకంటే ఎక్కువ పంట, దిగుబడిని సాధించాలనే ధ్యేయంతో కంకణధారుడై రైతు జరుపుకునే పండుగే ఏరువాక పున్నమి.

గిత్తలను అలంకరించి కాడిగట్టి, విఘ్నేశ్వర పూజచేసి, దుక్కిలో ఒక చాలు ఏరువాక చేస్తారానాడు. చిన్నతనంనుండి మేడిపట్టి దుక్కిదున్ని తన ఘర్మజలంతో భూమిని పులకింపజేసి, మట్టితో ప్రతిరోజూ కలిసివుండి మట్టితో మానసికంగా తాదాత్మ్యం చెందిన రైతు అతడు. అందుకే ఆ పండుగంటే అంత ఆపేక్ష. అంత ఇష్టం.

వాన బాగా తగ్గింది. మబ్బుల్ని చీల్చుకొని భానుడు ప్రకాశిస్తున్నాడు. పైపంచ దులుపుకొని బయటకు వచ్చాడు శేషయ్య. 'ఎండా వానా పెళ్లంట. కుక్కల నక్కల పెళ్లంట' పిల్లలు ఆనందంతో గంతులు వేస్తూ పాడుకుంటున్నారు.

"శేషయ్య బావా రావూ!" బండి ఇరుసుకి కందిన వేయటం కోసం, డొలుపు కింద కర్రనుంచి చక్రం తీయటానికి సాయం కోసం ఎదురు చూస్తున్న సుబ్బారెడ్డి శేషయ్యను చూస్తూనే పిలిచాడు. పలకరింపుగా నవ్వి సాయం చేశాడు శేషయ్య.

"పండగ ఏర్పాట్లు అయిపోయినయ్యా?"

నవ్వి, అతడి వెన్నుతట్టి ముందుకు కదిలాడు శేషయ్య ఏర్పాట్లకోసం.

ఆరోజే ఏరువాక పున్నమి.

తొలికోడి కూతకే నిద్రలేచిన రాజమ్మ అంతకుముందురోజే పాలేర్లు బాగా శుభ్రంచేసి నూనె పూసిన నాగలి, కాడిమాను, మేడిలకు పసుపుపూసి, కుంకుమ పెట్టింది. తలారా స్నానంచేసి, కొత్త చీరెకట్టుకుని, తమలపాకు తోరణం గడపకు కట్టి, తమలపాకు కట్టిన పచ్చతాడు నాగలికి, కాడికి కట్టింది.

అప్పటికే స్నానంచేసి, కొత్త పంచె కట్టుకుని, కొత్తచొక్కా వేసుకుని, తలపాగా చుట్టి సిద్ధమయ్యాడు శేషయ్య. అతడి చేతికి పసుపుతాడు కట్టింది. తను స్వయంగా తయారు చేసిన పగ్గాలు పరీక్ష చేస్తున్నాడు శేషయ్య. ఇత్తడి చెంబును శుభ్రంగా కడిగి, దానికీ తమలపాకు తోరణం కట్టి, పసుపుపూసి, బొట్టు పెట్టి, నిండా వసంతంపోసి మూడు తమలపాకులు వేసి పూర్ణకుంభాన్ని తయారు చేసి, పొంగలి చేయటానికి లోనికెళ్ళింది రాజమ్మ.

పోట్లగిత్తలను శుభ్రంగా కడిగి అలంకరిస్తున్నారు పాలేర్లు. శేషయ్య ఉత్సాహంతో కదిలి పాలేర్లను త్వరగా కానివ్వండని హెచ్చరిస్తూ, ఒకదాని మొగదాడు సరిచేసి, మరోదాని బొడ్డువారు సరిజూసి, మెడలోని మువ్వల పట్టెడలను కదిలించి, మోగించి మూపురపు అద్దాల పట్టెడలో ముఖం చూసుకుని తలగుడ్డ సరిచేసుకొని, బారెడ సర్ది, చిరుత సరిజేసి పాలేర్లను హుషారు గొలిపేలా చేస్తున్నాడు.

ముందుగా కదలాల్సిన అరక పెదకాపుదే. అంటే శేషయ్యదే. అందుకే హడావిడి. అప్పటికే డప్పులవారు వచ్చి, ఇంటిముందు




చిన్నమంట వేసి, డప్పులను వేడిచేసి సరిచేస్తున్నారు.

ఇంట్లోకి వెళ్ళి, వెంకటేశ్వరస్వామి పటంముందు భక్తిశ్రద్ధలతో పూజచేసి, టెంకాయకొట్టి మొక్కాడు శేషయ్య.

బయట డప్పుల శబ్దం మొదలయింది. ఒక్కసారిగా పదేళ్ల వయసు తగ్గినట్లుగా అనిపించింది శేషయ్యకు. ఎవరూ లేకుండా చూసి భార్య చెక్కిలిపై చిన్నముద్దిచ్చి బయటకు వచ్చాడు హుషారుగా, రంగుల చెర్నకోలా భుజాన వేసుకొని ములుగర్ర తీసుకుని.

కొత్తగా అలవార్చిన గిత్తల గంగడోలు సవరిస్తూ శేషయ్య వుంటే, తప్పెట్ల శబ్దం లయబద్ధంగా మారింది. సంబరం పెరుగుతోంది. డప్పుల శబ్దాలకనుగుణంగా కొందరూగిపోతోంటే, కొందరు యువకులు నృత్యం చేస్తున్నారు.

రాజమ్మ ముందుకు వచ్చి కొబ్బరికాయ కాడి మానుపై కొట్టి, హారతులు ఇచ్చి, వారు పోసి, పూర్ణ కుంభంతో ఎదురు రాగానే ఊరేగింపు మొదలయింది.

ముందుగా పాలేర్లు పగ్గాలు పట్టుకుని నడుస్తుంటే వెనుకగా కిర్రుచెప్పులతో హుందాగా నడుస్తున్నాడు శేషయ్య. ఎవరింట ముందుకు రాగానే ఆ ఇంటి అరక ఊరేగింపు చివరలో చేరతాయి. పెద్దకాపు అరక వెనకాల మాత్రం కరణంగారి అరక, తరువాత మున్సబుగారి అరక, తరువాత ప్రెసిడెంటుగారి అరక, తరువాత రైతుల అరకలు ఏరువాకకు సాగటం తరాలుగా వస్తున్న సాంప్రదాయం.

ముందుగా వినాయకుని గుడిచుట్టూ మూడు ప్రదక్షిణలు చేసి, మొక్కి, ఊరిబయట జమ్మిచెట్టువద్దకు వెళ్ళి, నాగలిని పూజించి, తవ్వుకోలలతో పక్కనున్న చిన్న మొక్కను సాంప్రదాయంకోసం పెళ్లగించి, తరువాత తమ తమ పొలాలకు వెళ్ళి మూడు రాళ్లు పసుపు కుంకుమలతో పూజించి, భక్తితో నమస్కరించి, చుట్టూ నారుపోసి పొలంలో ఒక కోండ్రు వేస్తారు. అది ఎపుడూ జరిగే పద్ధతి.

ఊరేగింపు హుషారుగా సాగుతోంది. శేషయ్య అరక వెనకాలే కరణంగారి అరక, మున్సబుగారి అరక చేరాయి. వెనుక రైతుల అరకలున్నాయి. ప్రెసిడెంటు పెద్దిరెడ్డిగారింటి దగ్గరకొచ్చింది ఊరేగింపు. ఆయన అరక సిద్ధంగా కట్టబడి వుంది. ఊరేగింపు దగ్గరకు రాగానే పూజకానిచ్చి, అరక ముందువార పోసింది ఆయన భార్య.

తప్పెట్లు ముందుకు సాగగానే తన అరకను ముందుకు కదిపాడు పెద్దిరెడ్డి శేషయ్య అరకకు ముందుగా. "ఆపు ఆపు... మున్సబుగారి అరక వెనుకుండాలి నీది'' అరిచాడు వెనుకనున్న రామయ్య.

రామయ్య అంతకుముందు జరిగిన ఎలక్షన్లలో పెద్దిరెడ్డిమీద ఓడిపోయిన వ్యక్తి. 'అతడి మాటను తను వినటమా?' అనే అహం అడ్డొచ్చింది ప్రెసిడెంట్ పెద్దిరెడ్డికి.

"ఏం? నా అరక ఎందుకు ముందుండగూడదు? ఈ గ్రామానికి సర్పంచ్‌ని. మొదటి మనిషిని. ఊర్లోకెల్లా ఎక్కువ పొలం వున్న ఆసామీని... నాదే ముందు పోతుంది'' గట్టిగా అన్నాడు పెద్దిరెడ్డి.

"వీల్లేదు... అది సంప్రదాయం కాదు. పెదకాపు అరకే ముందుండాలి..." అన్నాడు రామయ్య.

"అది వెనకటి రోజుల్లో... ఆరోజుల్లో ఎవరికెక్కువ పొలం వుంటే వాళ్లు పెదకాపు అయ్యేవారు. తరువాత అది వారసత్వంగా వచ్చింది. కరణం మున్సబులకే వారసత్వం రద్దుచేశారు. ఇంక దీనికి వారసత్వం ఏంది? నేనే ఎక్కువ పొలం గల ఆసామీని గనుక సర్పంచ్‌ని గనుక.. నేనే పెదకాపుని'' గట్టిగా అన్నాడు పెద్దిరెడ్డి.

"అవునవును'' ములుగర్ర ముందుకు చాపి అన్నారు కొందరతడి బంధువులు. రామయ్య మాటకంటే తమ మాటే చెల్లుబాటు కావాలనే తత్వం కుర్రకారులోవుంది.

రామయ్య బంధువులు ములుగర్రలు ముందుకు చాపారు. రామయ్యను గేలిచేశారు కొందరు కుర్రకారు. "ఎలక్షన్‌లో గెలవలేక అసూయతో పేచీ పెడుతున్నావా?" అన్నారు.

"మీరు దొంగోట్లు వేసుకొని గెలిచారు. మీదీ ఒక గెలుపేనా?" అన్నారు రామయ్య వేపు కుర్రవాళ్లు. అంతలో తాగివున్న రామయ్య పాలేరు పెద్దిరెడ్డిని తిట్టటం ప్రారంభించాడు. అది విని ఉద్రేకం పట్టలేక అతడిని చెర్నకోలాతో కొట్టాడో యువకుడు.

అంతే....!

అప్పటిదాకా ఉన్న సంబరమంతా ఒక్కసారిగా ఆగిపోయింది. క్షణాలలో కొట్లాటగా మారిపోయింది.

వీర పలనాడు అది! పౌరుషానికి పెట్టింది పేరు! బాలచంద్రుడు, నాగమ్మ పీల్చిన గాలి అది! ఒకరికి తల వంచని శక్తి అది! వీర మాంచాలి రక్తం ప్రవహించే స్త్రీజాతి కారాలతో, రాళ్లతో సిద్ధమయ్యారు. ములుగర్రల స్థానంలో పొలాలలో పందులను చంపే బరిశెలు వచ్చాయి.

కేకలు... పెడబొబ్బలు, ఏడ్పులు... రణరంగమే అయింది. ఎవరు ఎవరిని కొడుతు



న్నారో తెలియని పరిస్థితి!

అంతలో 'అబ్బా' అని పెను కేక వేశాడు పెద్దిరెడ్డి. అతడి గుండెల్లో లోతుగా దిగబడింది బరిశ. కిందపడిన అతడిని కొన్ని క్షణాలు బిత్తరపోయి చూశారు. శేషయ్య నిర్ఘాంతపోయాడు.

పెద్దిరెడ్డి ధరించిన సిల్కు లాల్చీలో రక్తం మూటలా కదలాడుతోంది. ప్రాణాలు పోతూ బిగ్గరగా కేకలు వేస్తున్నాడు అతడు!

అంతే - ఆ అరుపులకు ఎద్దులు బెదిరి పారిపోయాయి. మరుక్షణంలో అక్కడ ఎవరూలేరు! నీరసంగా ఇంటికి చేరాడు శేషయ్య.

అర్థగంటలో మాచర్లనుండి పోలీసు జీపులు వచ్చాయి. ఊరంతా పోలీసులతో నిండిపోయింది. ఊరిలో ఒక్క మగపురుగూ లేదు!!

పంచనామా జరిపి శవాన్ని తీసుకెళ్లారు. ఊళ్లోని ప్రతి ఒక్కరి గుండెల్లో రైళ్లు పరిగెడుతున్నాయి. అసలు చంపిందెవరో తెలియదు. తెలిసినవారు మాట్లాడరు. పెద్దిరెడ్డి కొడుకులు రామయ్యను వారి పార్టీలవారిని ముద్దాయిలుగా చేసి కేసుపెట్టారు.

పెద్దిరెడ్డి తరపున ముఖ్యమైన సాక్షి శేషయ్య.

నిజానికి హత్య చేసిందెవరో శేషయ్య చూడలేదు.

తమపై అనవసరంగా కక్షకొద్దీ కేసుపెట్టారనీ, శిక్షలు పడటం జరిగితే మరికొన్ని శవాలు లేస్తాయనీ బెదిరించారు రామయ్య తరపువారు.

ఊళ్లో పోలీసురాజ్యం.

రెండురోజుల్లో ఊళ్లో ఉన్న కోళ్లన్నీ మాయమయ్యాయి. పొట్టేళ్లు పోలీసులకాహారమవుతున్నాయి. ఊళ్లో మగపురుగులేకున్నా పక్కవూళ్లో అందరూ కలుస్తూనేవున్నారు. ఎకరాలవారీగా ఇరుపక్షాలవారూ చందాలు వసూలు చేశారు. అటువేపు, ఇటువేపు లక్షలు పోగయ్యాయి. పోలీసుల జేబులు నిండాయి.

ఆ ఏడు ఏరువాక సాగలేదు.

వ్యవసాయమూ సాగలేదు. చేలన్నీ బీళ్లు పడ్డాయి.

ఊరికి అరిష్టం దాపురించిందనుకున్నాడు శేషయ్య. అతడూ అజ్ఞాతంలోకి వెళ్లిపోయాడు. ఆరునెలలకు ఎఫ్.ఐ.ఆర్ తయారయి కోర్టులో ప్రెజెంట్ చేయబడింది. ముద్దాయిలంతా కోర్టులో లొంగిపోయి బెయిల్ తీసుకున్నారు. శేషయ్య ముద్దాయి కాడు. కేవలం సాక్షి మాత్రమే!

బెయిల్ వచ్చాక అంతా తిరిగి ఇళ్లకు చేరుకున్నారు. ఊరిలో తూర్పువేపంతా కమ్మవారున్నారు. పడమరవేపు రెడ్లున్నారు. వీరిద్దరిని వేరుచేస్తూవున్న ప్రధానవీధిలో వైశ్యులు, బ్రాహ్మణులు వున్నారు. కమ్మవారి పొలాలు పడమరన వున్నాయి. రెడ్ల పొలాలు తూర్పువేపునున్నాయి. ఎవరూ తమవేపు నుండి మరోవేపుకు వెళ్ళరు. వెళితే చంపేస్తారేమోనని భయం.

శేషయ్య ఇరువర్గాలవారినీ కలవగలడు కనుక రాజీకోసం ప్రయత్నం చేశాడు. కాని ఎవరూ అంగీకరించలేదు. ఇబ్బడిగా ఉన్న డబ్బు, అనవసరమైన పట్టుదల, మొండితనం, మూర్ఖత్వం, వివేకశూన్యత ఇరువేపులా వ్యాపించివుంది. కొందరు తెలిసినవారు సర్దిచెప్పబోయినా, కుర్రకారు పడనియ్యటంలేదు. ఎవరికివారు రహస్యంగా కడప నుండి బాంబులు తెప్పించి ఇళ్లలో వుంచుకున్నారు రక్షణార్థం. అటువేపూ ఇటువేపూ బాంబులు చేయటం కూడా నేర్చుకుంటున్నారు.

పట్నంలో లా చదువుకుంటున్న పెద్దిరెడ్డి పెద్దకొడుకు పోలిరెడ్డి! తండ్రి మరణవార్త వినగానే పల్లెకు వచ్చాడు చదువు మానేసి. వస్తూనే తమ ముఠాపెత్తనం అందుకున్నాడు. అతడిలో ఉవ్వెత్తున ఎగసిపడే ఆవేశం వుంది. తండ్రి హత్యకు ప్రతీకారం తీర్చుకోవాలనే పగ వుంది. డబ్బు వుంది. అహం




వుంది. రెచ్చగొట్టే అనుచరగణం వుంది! అతడికీ రామయ్య తన తండ్రిని చంపలేదని తెలుసు. చంపినవాడు రామయ్యపక్షంవాడు అనేది ఖాయంగా తెలిసిన విషయం. తలా ఒక పేరు చెబుతున్నా నిజంగా చంపిందెవరో అతడికి తెలియలేదు. కత్తికి కత్తి, రక్తానికి రక్తం. తమవేపు నాయకుడు పోయాడు గనుక అటువేపూ నాయకుడు పోవాలి. ఎలా చంపాలో, ఎలా చంపితే కేసు నిలవదో, లేదా కేసునుండి ఎలా తప్పించుకోవచ్చో పెద్ద క్రిమినల్ లాయర్స్‌ని అడిగి తెలుసుకున్నాడు.

ఇదంతా రామయ్య వర్గంవాళ్లకి తెలిసింది. రామయ్యను హత్య చేయటం ఖాయం అని అందరికీ అర్థమయింది. రామయ్య తాను హత్య చేయబడకుండా వుండాలంటే పోలిరెడ్డి హత్య కావింపబడాలి! అనేది అర్థం చేసుకున్నాడు. అతడికీ హత్య ఎలా చేయాలో, ఎలా తప్పించుకోవాలో వివరంగా చెప్పారు క్రిమినల్ లాయర్లు.

రామయ్యకు శిక్షపడాలంటే శేషయ్య సాక్ష్యం చాలా అవసరం అని గమనించాడు పోలిరెడ్డి. అతడి లాయర్లు అదే విషయం చెప్పారు.

ఒకరోజు శేషయ్యకు కబురు పంపాడు పోలిరెడ్డి. వెళ్లాడు శేషయ్య. హుందాగా కుర్చీలో కూర్చుని సిగరెట్ తాగుతున్నాడు పోలిరెడ్డి. చుట్టూ పదిమంది వ్యక్తులున్నారు బాణాకర్రలు, బరిసెలు పట్టుకుని.

"రా కూర్చో మావా'' నవ్వుతూ ఆహ్వానించాడు పోలిరెడ్డి. పలకరింపులయ్యాక కాఫీ ఇస్తే తాగాడు శేషయ్య.

"ఈ కేసులో నీ సాక్ష్యం ముఖ్యమైంది మావా! నీకు తెలుసు రామయ్యకు మా నాన్నకూ పడదని... అదీగాక రామయ్య నన్ను చంపించాలని ప్లాన్లు వేస్తున్నాడనీ నీకు తెలుసు. మా నాన్నను చంపింది రామయ్యపక్షంవాళ్లనీ నీకు తెలుసు. నీవు పెద్దమనిషివి. ఏ కులానికీ కాపు కాయనివాడివి. మన ఊరు బాగుండాలంటే రామయ్య చావనైనా చావాలి. లేదా జైలుకు పోవాలి. అందుకని... మా నాన్నను రామయ్య చంపుతుండగా చూశానని సాక్ష్యం చెప్పాలి. మావాళ్లు చాలా మంది సాక్ష్యాలు చెప్పినా, నీలాటి న్యూట్రల్ మనిషి సాక్ష్యానికి విలువ ఎక్కువ. అందుకని నీవీ సాయంచేయాలి'' నమ్రతగా అడిగాడు పోలిరెడ్డి

"నిజమేనల్లుడూ! కాని రామయ్య మీ నాన్నని చంపలేదే? అబద్ధమెలా చెప్పను. నాకే చాలా దూరంగా వున్నాడు రామయ్య''

"మరెవరు చంపారు?"

"నేను చూడలేదు''

"అబద్ధమాడకు మావా'' ఖంగున మోగింది పోలిరెడ్డి కంఠం. "మా నాన్నకు అతి దగ్గరగా వున్నది నీవే. నీవు చూడలేదంటే నన్ను నమ్మమంటావా? నేనంత అమాయకుడిలా కనిపిస్తున్నానా?"

"నిజం పోలిరెడ్డీ! నేను చూడలేదు. ఆ గొడవకి నిర్ఘాంతపోయాను..."

"ఆయనెందుకు సాక్ష్యం చెబుతాడండీ. తన పెదకాపుతనం తీసేశాడని మీ నాన్న మీద అసలే కోపంగా వుంటే'' ఒకతను అన్నాడు.

ఊహించని ఈ మాటలకు ఆశ్చర్యపోయాడు శేషయ్య.

"అలా అనుకోకు మావా! మా నాన్నేదో తొందరపడ్డాడు. ఇకనుండి ఏరువాకలో నీ అరకే ముందు సాగుతుంది. ఆ హామీ నేనిస్తా... నీవుమాత్రం రామయ్యే ఈ హత్య చేశాడని సాక్ష్యం చెప్పాలి''

"అబద్ధం నేనెలా చెప్పను?" తూచి తూచి అన్నాడు శేషయ్య.

"నీ నిజాయితీ నాకు తెలుసు మావా! కాని కోర్టులో ఈ విషయం చెప్పకపోతే కేసు నిలవదే? మా నాన్న ఆమధ్య ఎపుడో అన్నాడు మీ చేను గట్టుకానుకొని దక్షిణంవేపున మా రేగడివుందికదా... అది శేషయ్యకి అమ్మి

తే చేలో చేను కలుస్తుంది. అమ్ముదాం! 'అన్నాడు. కానీ నీకు అమ్మటం నాకిష్టంలేదు మావా... కావాలంటే ఆ పొలం నీకు రాసిస్తాను. నాకుమాత్రం ఈ సాయం చేయాలి'' దగ్గరగా వచ్చి భుజంపై చేయి వేసి అన్నాడు.

"నేనెలా అబద్ధం చెప్పను?" గొణిగాడు శేషయ్య. పోలిరెడ్డి తనను ప్రలోభపెడుతున్నాడని అర్థమయింది.

"సరే మావా! ఆలోచించుకొని చెప్పు. నీ ఇష్టం" అని సాగనంపాడు పోలిరెడ్డి.

పోలిరెడ్డి శేషయ్యను పిలిపించుకుని మాట్లాడాడు, తన కనుకూలంగా సాక్ష్యం చెబితే రెండెకరాల పొలం ఇస్తానన్నాడన్నది ఊరంతా తెలిసిపోయింది. ఆరోజు రాత్రే రామయ్య కబురుపెట్టాడు.

"రాం! శేషయ్య బావా కూర్చో'' ఆహ్వానించాడు రామయ్య. అతడిచుట్టూ పది మంది మనుషులు బరిసెలతో నిలబడి వున్నారు. "ఏవిటీ విశేషాలు?"

"ఏముంది... మామూలే' నవ్వాడు శేషయ్య.

"ఆ ఏటి పొద్దున ఆ పోలిరెడ్డిగాడు నీకు కబురెట్టాడట కదా? నేనే చంపానని సాక్ష్యం చెబితే రెండెకరాల పొలం ఇస్తానన్నాడట"

'అవున'న్నట్లు తలూపాడు శేషయ్య.

"శేషయ్యబావా! నీగురించి నాకు తెలుసు. నీవు నిజాయితీపరుడివి. అబద్ధం చెప్పవనీ నాకు తెలుసు. నేను పెద్దిరెడ్డిని చంపలేదని నీకు తెలుసు. ఎవడో వెధవ తొందరపడి ఆ పని చేస్తే నామీద దొంగకేసు బనాయించారు. ఇదేం న్యాయం? నువ్వే చెప్పు బావా? నీవు తప్పుడు సాక్ష్యం అసలెలా చెబుతావు? మీ వంశమే నిప్పులాంటిది. అలాటి నీవు అబద్ధం చెబుతావంటే నేను నమ్మలేదనుకో... అసలదీగాక తగాదా ఎందుకు మొదలయింది? నీగురించేకదా!? తరతరాలనుండి మీ అరకే ఏరువాకలో ముందు నడవాల. దానిని పెద్దిరెడ్డి ఖాతరు చేయకపోతే నీ తరపున పోట్లాడింది నేనేకదా? అసలు మీ వంశగౌరవాన్ని నిలబెట్టడానికేకదా నేను పోట్లాడింది. నిన్ను అడ్డుకోకుంటే ఇక నీకు విలువుంటదా? నువ్వేచెప్పు బావా. నీకోసమే నేను పోట్లాడితే నామీదే వ్యతిరేక సాక్ష్యం చెబుతావా?"

"నేనెందుకు చెబుతాను బావా? నీవు చంపలేదనే చెబుతాను'' శేషయ్య అన్నాడు.

"అద్గదీ మనిషంటే. నీలా నిజాయితీగా వుండాలి బావా... అసలీసారి ఎలక్షన్లలో నేను నిలబడదామనుకోటల్లా. నీకంటే నిజాయితీపరుడు ఊళ్లో ఎవరున్నారు చెప్పు? అందుకు నిన్నే సర్పంచ్‌ని చేద్దామనుకుంటున్నాను''

"నాకెందుకులే బావా ఎలక్షన్లు... నా మా నాన నన్ను బ్రతకనియ్'' నవ్వి అన్నాడు శేషయ్య.

"అలా కాదులే బావా! ప్రతిభని, నిజాయితీని గుర్తించాలి. ఈసారి సర్పంచ్‌వి నీవే'' మృదువుగానే తిరస్కరించాడు శేషయ్య.

'శేషయ్య తనకు వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పడు' అనే నిశ్చయం రామయ్యకు కలిగింది. అప్పటికప్పుడు కోడిని కోయించి బలవంతాన కొసరి కొసరి తినిపించిగాని వదల్లేదు శేషయ్యను.

రెండు రోజుల తరువాత మళ్లీ శేషయ్యను పిలిపించాడు పోలిరెడ్డి. తనకి పనికివచ్చేవిధంగా సాక్ష్యం చెప్పమని బతిమిలాడాడు. పొలం ఇస్తానని ఆశపెట్టాడు. కాని అతడు లొంగడు అని అర్థమయింది పోలిరెడ్డికి.

మరునాడు ఊళ్లో మరో పుకారు లేచింది. అదీ బలమయిన సాక్ష్యాలతో. శేషయ్య కోర్టులో సాక్ష్యం చెప్పేంతవరకు రామయ్యపక్షానే వుండేట్లు, చివరికి కోర్టులో రామయ్యే హత్య చేశాడని చెప్పేట్లుగా ఒప్పందం కుదిరిందని ఆ పుకారు. ఒకరిద్దరు శేషయ్యను అడిగారు కూడా. శేషయ్య దానిని ఖండించాడు.




ఆరోజు రాత్రే రామయ్య దగ్గర్నుండి పిలు పొచ్చింది. వెళ్లాడు శేషయ్య.

"ఏం బావా! నీవు నిజాయితీపరుడివను కున్నాను. ఇలా డబ్బుకాశపడి నాపై తప్పు డు సాక్ష్యం చెప్పేంత నీచానికి దిగజార్తావను కోలేదు'' కొంచెం కోపంగానే అన్నాడు రామ య్య.

"అదేంటి బావా నన్నునుమానిస్తున్నావా?" ఆశ్చర్యంగా అన్నాడు శేషయ్య.

"ఈరోజుల్లో ఎవర్ని నమ్మగలం బావా? డబ్బుకోసం నీతి నిజాయితీలు అమ్ముడుపో తున్నాయి... సాక్షాత్తూ హరిశ్చంద్రుడే దిగివ చ్చినా ఈరోజు డబ్బుకోసం వెయ్యి అబద్ధాలు ఆడతాడు'' వ్యంగ్యంగా అన్నాడు.

"నేనబద్ధమాడను బావా... నిజమే చెబుతా ను'' నిజాయితీగా అన్నాడు శేషయ్య.

"ఇదుగో ఆ నిజానికి సాక్ష్యం" ఒక దస్తా వేజు ఫోటోస్టాట్ కాపీ తీసి ఇచ్చాడు రామ య్య. ఆశ్చర్యపోతూ చదివాడు.

శేషయ్య పొలం పక్కనున్న రెండెకరాల పొలం, పోలిరెడ్డి శేషయ్యకు అమ్మినట్లుగా రాసి రిజిస్టరు చేయబడ్డ కాపీ నకలు అది!!

దాదాపు పదిరోజులక్రితం అది రిజిస్టర్ చేయబడింది.

"నాకేం తెలీదు బావా!" బిత్తరపోతూ అన్నాడు శేషయ్య.

"ఇంకా బుకాయిస్తావా శేషయ్యా. ఇవి రిజిస్టర్డ్ డాక్యుమెంట్లు... నీకు తెలీకుండానే నీపేర పొలం రిజిస్టర్ అయిందంటావా? పోనీ నిన్ను డబ్బాశపెట్టి కొనేసి సాక్ష్యం చెప్పించా డని అంటానికయినా మా లాయర్ చెప్పాడు దానిలోని రహస్యం. నాలుగేళ్లక్రితం పెద్దిరెడ్డి చే రాయబడ్డ ఎగ్రిమెంట్ని ఇపుడు రిజిస్టర్ చేసినట్లుగా ఈ దస్తావేజులో స్పష్టంగా రా సివుంది... ఇక నిన్నెలా నమ్మను? నీవు అమ్ముడుపోలేదని..."

"తల్లితోడు బావా! నీవే ప్రమాణం చేయ మంటే ఆ ప్రమాణం చేస్తాను. ఈ గొడవే నాకు తెలీదు. నేను నీకు వ్యతిరేకంగా చచ్చి నా సాక్ష్యం చెప్పను''

"చూస్తాను. రేపే రిజిస్ట్రార్ ఆఫీసునుండి నకలు తెప్పిస్తాను. అది నిజమైతే నీవు అమ్ముడు పోయింది నిజమే. రెండెకరాల సుక్షేత్రమయిన భూమిని నీకు అంత చవక గా అమ్మేంత తెలివి తక్కువవాడు కాదు పోలిరెడ్డి. నీ మాటలు నేను నమ్ముతానను కోకు. అదే నిజమైతే చూస్తాను... అసలు నీవెలా సాక్ష్యం చెబుతావో...? నామీద ఎటు దిరిగి ఒక మర్డర్ కేసెలాగూ వుంది... నిన్నూ పైకి పంపిస్తే ఇంకో కేసు తగులుకుంటుంది. అంతేగా... తెగించినవాడికి ఇవేవీ పట్టవు. ఎన్ని మర్డర్లు చేసినా శిక్ష ఒకటే'' బెదిరించి పంపాడు రామయ్య.

బిక్క ముఖం వేసుకుని ఇంటికి వచ్చాడు శేషయ్య. వెంటనే పోలిరెడ్డిని నిలదీద్దామను కున్నాడు. కాని వాళ్లింటికి వెళితే రామయ్య అనుమానం ఇంకా పెరగవచ్చు. అందుకని మానేశాడు.

ఒకరోజు అర్ధరాత్రి మెల్లగా తలుపు తట్టిన శబ్దమయింది. "ఎవరది?" అన్నాడు శేష య్య.

"నేనే... పోలిరెడ్డిని''

తలుపు తీశాడు. పోలిరెడ్డి, మరో పది మంది వచ్చి తలుపులు వేశారు.

"ఏమిటి హడావిడి? ఇంత రాత్రిపూట వచ్చారు?" ఆతృతగా అడిగాడు శేషయ్య.

"ఆ రామయ్య మనుషులు నిన్ను చంపే ద్దామని నిశ్చయానికొచ్చారు. నిన్ను హెచ్చ రిద్దామని వచ్చాను. అన్నట్లు ఆ పొలం నీపేర రిజిస్టర్ చేశాను. ఈమధ్య వెతుకు తుంటే మా నాన్న రాసుకున్న కాగితాలు కనిపించాయి. దానిలో ఆ పొలం నీకు అమ్ము దామని రాసుకున్నాడు. నీవు నోటిమాటగా చెబితే తీసుకోవు. పొలం నేనే ఇస్తున్నానన్నా నీవు నమ్మవు. అందుకే ఎవరికీ తెలీకుండా రిజిస్టర్ చేయించుకొచ్చాను. దీనిని బయటకు

రానీయబాకు. సాక్ష్యం నాకనుకూలంగా చెప్పించటంకోసం పొలం ఇచ్చాననుకుంటూరు'' దస్తావేజులు తీసి శేషయ్య చేతిలో పెడుతూ అన్నాడు పోలిరెడ్డి.

"నాకెందుకు పొలం... నాకక్కరలేదు'' అన్నాడు శేషయ్య.

"తీసుకోవటం, తీసుకోకపోవటం నీ ఇష్టం. ఇష్టం లేకుంటే వదిలెయ్. నీకెప్పుడు తీసుకోవాలనిపిస్తే అపుడు తీసుకో. అదిసరే అసలు ముఖ్యమైన విషయమేమిటంటే - రామయ్య మనుషులు నిన్ను చంపుదామనుకుంటున్నారు. ఎవరో నీవు నావేపు తిరిగిపోయావని పుకారు పుట్టించారు మామా... నేనేం చేయను దానికి!''

"దానికి ఆధారం ఈ పొలం రిజిస్ట్రేషన్ అయింది'' నిష్టురంగా అన్నాడు శేషయ్య.

"వాళ్లెలా అయినా అనుకోనియ్ మావా! నేను దీనిని చాలా రహస్యంగా చేశాను. వారికెలా తెలిసిందో నాకు తెలీదు. ఇది మా నాన్న ఆత్మశాంతికి చేసిన పని... ఏది ఏమైనా నీకు రామయ్య మనుషులనుండి రక్షణ అవసరం. పోనీ నా మనుషులను కాపలా వుంచనా? నీవు ఏమైనా సాక్ష్యం చెప్పు... నీలాటి మంచివాడి ప్రాణాలు కాపాడటం నాలాటివాళ్ల బాధ్యత మామా'' వినయంగా అన్నాడు పోలిరెడ్డి.

"నాకీరక్షణ వద్దు... నా మానాన నన్ను బతకనీయండి..." విసుగ్గా అన్నాడు శేషయ్య. "సరే నీ ఇష్టం" అంటూ రహస్యంగానే వెళ్ళిపోయాడు పోలిరెడ్డి.

మరునాడుదయమే రామయ్య తన మనుషులతో ఇంటికి వచ్చాడు.

"ఏం శేషయ్యా! అర్ధరాత్రి పోలిగాడితో మంతనాలు జరిపావ్? నామీద వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పటానికే నిశ్చయించుకున్నావా ?"

మాట్లాడలేదు శేషయ్య.

"ఏం మాట్లాడవ్? రాత్రి పోలిగాడు రావటం అబద్ధమా? మా మనుషులు చూశారు. నీలో ఏమీ కుట్ర లేకుంటే- అంత అర్ధరాత్రి రహస్యంగా నీతో మాట్లాడాల్సిన పనిఏమిటి?"

"ఏమో నాకు తెలియదు''

అంతలో రామయ్య అనుచరుడు ఒక మూలగా పడివున్న దస్తావేజు కాగితాలు తెచ్చి రామయ్య చేతికిచ్చాడు. చూశాడు రామయ్య.

"ఓహెూ! దస్తావేజులు ఇచ్చి వెళ్ళటానికి వచ్చాడా? అయితే నాకు వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పటం ఖాయమేనన్నమాట" కోపంగా అన్నాడు రామయ్య.

ఏం మాట్లాడాలో కూడా అర్థంకావటంలేదు శేషయ్యకు.

ఒక మూలన నిలుచున్న రాజమ్మ నోట్లో పమిటకొంగు పెట్టుకుని మౌనంగా రోదిస్తోంది. ఆమెకేసి తిరిగాడు రామయ్య.

"చూడు రాజమ్మా! నీవు నా చెల్లెలులాంటి దానివి. నీ పసుపు కుంకాలు కాపాడటం అన్నగా నా ధర్మం... కాని నేను చేయని నేరాన్ని నా మీదకు నెట్టేట్లుగా నీ పెనిమిటి సాక్ష్యం చెబితే? నేను జైలుకు పోతాను. లేదా ఉరివేస్తారు. ఇది న్యాయమా? నీవే చెప్పు. నీ మొగుడివల్ల నాకు ఏ శిక్షపడ్డా నీ పసుపు కుంకుమలు నిలవ్వు... మా వాళ్లు బ్రతకనివ్వరు. జాగ్రత్త... నీ పెనిమిటికి ఎలా చెప్పుకుంటావోఏమో? నీ ఇష్టం" అని బెదిరించి వెళ్ళిపోయాడు రామయ్య.

అతడు వెళ్ళిపోయాక, తలుపు దగ్గరగా వేసి భర్త భుజంపై తల వాల్చి వెక్కివెక్కి ఏడ్చింది రాజమ్మ. "మనకీ సాక్ష్యాలూ- కేసులూ వద్దు... ఊరొదిలి వెళ్ళిపోదాం... ఎక్కడయినా కలో గంజో తాగి, కూలి పని చేసుకునయినా బతకొచ్చు..."

ఆలోచిస్తూ మెల్లిగా వెన్ను నిమిరాడు శేషయ్య.




# ఏరిన ముత్యాలు

★ ఖర్చు పెట్టాక బాధపడేబదులు ఖర్చు పెట్టటానికి ముందు పడే బాధని బడ్జెట్ అంటారు

-వాల్

★ చేసిన నేరానికి ప్రతిఫలంగా ఆత్మ చెల్లించే సుంకమే భయం

-న్యూవెల్

★ ప్రపంచంలో శ్రామికవర్గంకన్నా అతి దారుణంగా దోచుకోబడుతున్నది స్త్రీజాతే

-లెనిన్

★ దేశంలో అవినీతి ఎక్కువైనకొద్దీ చట్టాలు, శాసనాలు, నీతిసూత్రాలు ఎక్కువవుతుంటాయి

-టాస్టన్

★ అనేక సుగుణాలు వున్నంత మాత్రాన ప్రయోజనం లేదు. వాటిని జీవితానికి అన్వయించుకోవడం ముఖ్యం

-రోష్‌ఫోకాల్డ్

★ స్త్రీ ప్రేమ అనంతం. సముద్రంవలె దాని తీరాలు కంటికి కానరావు

-మిల్టన్

★ తమ స్వగృహంలో ఆదరణ పొందిన వ్యక్తులను వేళ్లమీద లెక్కించవచ్చు

-న్యూటన్

★ వివేకంగలవాడు ముందు ఆలోచించి తర్వాత మాట్లాడతాడు. అవివేకి ముందు మాట్లాడి తర్వాత ఆలోచిస్తాడు

-డేవాలే

★ తేనెటీగవలె మన కృషిని మనం వినోదంగా భావించుకోవాలి

-గోల్డ్‌స్మిత్

★ ఈ లోకానికి వింతవారముగా వస్తాము. అతిథుల్లా వుంటాము. స్నేహితుల్లా వెళ్లిపోతాము

-టాగూర్

★ పొగడడానికి నాలుక చల్లదనం ఒక్కటే చాలదు. హృదయచల్లదనం కూడా కావాలి

-గాండేకర్

---

సేకరణ: **అంగర శ్రీదేవి**

---




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనా శక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

**సెప్టెంబర్ చతుర నవల ఆవలిగట్టు**

**సమీక్షకుని పేరు :** ......................................................................

**చిరునామా :** ......................................................................

......................................................................

......................................................................

......................................................................

హత్యకేసుతో పాటు దొమ్మీ కొట్లాటల కేసులు కూడా పోలీసులచే పెట్టబడ్డాయి. అటో వందమందిని, ఇటో వందమందిని కేసుల్లో ఇరికించారు పోలీసులు. వారి దృష్టిలో శేషయ్యే అసలీ గొడవకు మూల కారణం అని, అతడిని రామయ్య తరపు మనిషిగా లెక్కవేసి అతడిని కూడా ఇరికించారు.

అసలా కేసులే అలాంటివి. నాలుగైదురోజులకోసారి వాయిదాలు పడతాయి. గురజాల టి.బి.కి రమ్మని సమన్లు వస్తాయి. అందరూ చద్దికట్టుకుని వెళ్ళి ఉదయం తొమ్మిదింటికల్లా టి.బి. దగ్గరకు చేరతారు. ఇరుపక్షాల వారూ చెరో వేపు కూర్చుంటారు. వారికి పోలీసుల కాపలా. సాయంత్రం ఐదారు గంటలకు గుమాస్తా వచ్చి పేర్లు చదివి అటెండెన్స్ తీసుకుంటాడు. రానివాళ్ళకి, రానందుకు మెడికల్ సర్టిఫికేట్ పెట్టని వారికి అప్పటికప్పుడే నాన్ బెయిలబుల్ వారెంట్స్ పోలీసులచేతికివ్వబడతాయి. అందరూ హాజరయితే- నాలుగురోజుల తరువాత నర్సరావుపేట కోర్టులో హాజరు కమ్మంటారు. అక్కడా ఇదే తంతు. ఒకసారి గుంటూరు. ఒకసారి రేపల్లే మరోసారి సత్తెనపల్లి వాయిదాలువేసి త్రిప్పుతుంటారు.

దీనివలన చాలామంది ఆర్థికంగా కృంగిపోసాగారు. తమ ముఠాలో వారికి, వారివారి నాయకులు ఆర్థిక సాయంచేస్తున్నారు. ఏ ముఠాలోనూ లేని శేషయ్యకు చేతి డబ్బు వదలసాగింది. పైపెచ్చు పొలాలన్నీ బీళ్ళు. ముందు నగదు అయిపోగానే, నగలు, ఎద్దులు క్రమంగా అమ్ముడుపోయాయి. పైపెచ్చు ఏదో ఒకసారి శేషయ్యను చంపేస్తారనే పుకారు వుంది. వాయిదాకి వెళితే తిరిగి వచ్చినదాకా ప్రాణాలు అరచేతులో పెట్టుకుని వుంటున్నది రాజమ్మ.

ఆర్థిక ఇబ్బందులు తట్టుకోలేక పొలంబేరం పెట్టాడు. కానీ కొనేదెవరు? అందరి పొలాలూ బీళ్ళయితే ఇక పంట ఎక్కడ? డబ్బు ఎక్కడ?

అంతకుముందు సశ్యశ్యామలంగా వున్న వూరు స్మశానవాటికలా మారింది. శేషయ్యమీద ఇరుపక్షాల నుండీ వత్తిడి పెరుగుతోంది తమ ముఠాలో చేరమని. కాని ముఠాలలో చేరటం అతడికి ఇష్టంలేదు. ఇరుపక్షాలవారూ అతడిని నమ్మటంలేదు. ఎవరిని ఎలా నమ్మించాలో శేషయ్యకూ అర్థంకావటంలేదు. అతడిని వంటరితనం ఆవహించింది.

ఒకరోజు తెల్లవారుఝామున బహిర్భూమికి వెళ్ళాడు శేషయ్య. అప్పటికింకా తూర్పు ఎర్రబడలేదు. మసకచీకట్లు విడిపోలేదు. తిరిగి వస్తుంటే హఠాత్తుగా కర్రలతో దాడిచేశారు ఎవరో. తలమీద, వంటిమీదా బాణా కర్రలతో బాదేశారు. ముఖాలకు గుడ్డలు కట్టుకుని వుండటంవలనా, చీకటివలనా వారెవరో గుర్తించటం సాధ్యపడలేదు అతడికి. తల చిట్లి కారిన రక్తం కళ్ళలోకి పాకింది. నిస్సహాయంగా ఆక్రోశిస్తూ అలానే పడిపోయాడు. స్పృహ తప్పుతుండగా వినిపించిన మాటలు అతడికి బాగా గుర్తు. "చచ్చాడు లేరా... ఇక పోదాం పదండి..." అని.

తరువాత ఎవరో చూసి రాజమ్మకు విషయం చెప్పారు. ఆమె భోరున విలపిస్తూ అక్కడికి వెళ్ళింది. సాయం చేస్తామని ఇరుపక్షాల వారూ వచ్చారు. కాని తనే పాలేర్లసాయంతో, పట్నం తీసుకెళ్ళి హాస్పిటల్లో చేర్పించింది.

హాస్పటల్లో దాదాపు నెలరోజులున్నాడు శేషయ్య. అప్పుడే రాజమ్మ ముక్కుపుడక, పుస్తెలతాడూ ఇక తిరిగిరాని మార్వాడీకొట్లోకి వెళ్ళిపోయాయి. పోలీసులు కేసు నమోదు చేశారుగాని, ఎవరిమీద అనుమానం అంటే చెప్పలేకపోయాడు శేషయ్య.

తనమీద వ్యతిరేకసాక్ష్యం చెబుతాడేమోనని రామయ్యే ఆ పనిచేయించివుండవచ్చు. తనకెటూ ఉపయోగపడడు గనుక పోలిరెడ్డే ఆ పని చేయించి వుండవచ్చు... ఇద్దరినీ అనుమానించే ఆస్కారం వుంది. ఇద్దరికీ

శేషయ్యమీద ద్వేషంవుంది!

'తనకి అనుకూలంగా నిజం సాక్ష్యం చెబుతాడని శేషయ్యని చంపించటానికి పోలిరెడ్డి కుట్రచేశాడని' రామయ్య పోలీస్ కేస్ పెడుతూ సాక్షికి రక్షణ ఇవ్వాలని కోరాడు.

'తనకి అనుకూలంగా నిజాన్ని నిర్భయంగా సాక్ష్యం చెబుతాడనీ, అతడి సాక్ష్యంలో శిక్ష తప్పదని భావించిన రామయ్య శేషయ్యను చంపించటానికి ప్రయత్నం చేశాడనీ... తన సాక్షికి రక్షణ ఇవ్వాలనీ పోలీస్ కేసు పెట్టాడు పోలిరెడ్డి.

కాని తనకే రక్షణా అక్కరలేదని తిరస్కరించాడు శేషయ్య. ఎందుకంటే ఒకరిద్దరు పోలీసుల్ని నియమిస్తే గవర్నమెంటే వారికి జీతాలు, డి.ఏలు ఇచ్చినా వారిని అనధికారికంగా పోషించాల్సింది, అదీ సర్వలాంఛనాలతో శేషయ్యనే... తమను తామే పోషించుకోలేని స్థితిలోవున్న తాను వారిని ఒక్కరోజుకూడా భరించలేనని తెలుసు.

రాజమ్మ మాటలు విని 'ఊరినుండి పారిపోదామా?' అనిపిస్తోందొకోసారి శేషయ్యకు. కాని దొమ్మీ కేసులలో వాయిదాకు అటెండ్కాకపోతే వారెంట్ వస్తుంది. అందువలన తప్పనిసరై ఊళ్లోనే వుంటున్నాడు.

రామయ్య, పోలిరెడ్డి ఆడుకునే ఆటలో తాను పావునైనట్లు, బాగా కూరుకుపోయినట్లు అర్థమయింది శేషయ్యకు. ఇక ఏదో ఒక పక్షంలో చేరకుంటే తనకు రక్షణ లభించదనీ భావించాడు. కాని తన లాంటి అర్భకుడికి రాజకీయాలు అనవసరం: ఈ కేసు తేలగానే ఊరు వదిలి పెట్టటానికి నిశ్చయించుకున్నాడు.

ఇపుడు శేషయ్యకు వెనుకటి పెద్దరికంలేదు. ఎవరూ తీర్పులు చెప్పమని రావటంలేదు. ఊరు ఊరంతా రెండుగా' చీలిపోయివుంది.





కేసు సెషన్స్ బెంచ్ మీదకు వచ్చింది. నాలుగైదు రోజుల్లో శేషయ్య సాక్ష్యం ఇవ్వాల్సివుంది. ఇరుప్రక్కలా టెన్షన్.

తనకు వ్యతిరేకంగా గనుక సాక్ష్యంచెబితే కోర్టునుండి బయటకురాగానే చంపి సాగర్ కాల్వలో పారేయమని రామయ్య తన అనుచరులకు ఆజ్ఞ ఇచ్చేశాడు. అది తెలిసింది శేషయ్యకు.

పోలిరెడ్డి ఇంకోరెండెకరాల పొలం ఇస్తాననీ, డబ్బు ఇస్తాననీ కబురుపెట్టాడు. పట్టించుకోలేదు శేషయ్య.

ఆ రోజురాత్రి తలుపు తట్టిన శబ్దం వినిపించింది. తొందరపడి తలుపు తెరవలేదు శేషయ్య "ఎవరది?" అడిగాడు.

"నేను బాబూ సూరిగాడిని'' అతడు శేషయ్య పాలేరు రెండు, మూడు సంవత్సరాల క్రితం. కిటికీ సందులోంచి చూసి మెల్లిగా తలుపు తెరిచాడు.

"ఏంటి?" నెమ్మదిగా అడిగాడు. శబ్దం చేయొద్దన్నట్లుగా పెదవులపై వేలుంచి, చెవిలో రహస్యంగా చెప్పాడు.

"బాబుగారూ రేపు అమ్మగార్ని పిల్లల్ని ఆ పోలిరెడ్డి మనుషులు ఎత్తుకుపోతారట. మీరు గనుక వారు చెప్పినట్లుగా సాక్ష్యం చెప్పకపోతే వాళ్లని చంపేస్తారట"

నిర్ఘాంతపోయాడు శేషయ్య. "వాళ్ళని రహస్యంగా ఎక్కడికయినా పంపేయండి బాబూ... లేకుంటే ప్రమాదం ఇది ఎవరికీ తెలియనీయకండి... నేను వెళతాను. నేను మీకు చెప్పినట్లు వాళ్ళకు తెలిస్తే నన్ను చంపేస్తారు'' తలుపువేపు కదుల్తూ అన్నాడు.

"ఆగు'' ఏదో ఆలోచించి అన్నాడు శేషయ్య.

ఆగాడు సూరిగాడు.

"ఈ పరిస్థితులలో నేనెవరినీ నమ్మలేను. నీవే అమ్మగార్ని ఎక్కడయినా దాచివుంచు. దాని పుట్టింటివాళ్ళు కూడా ఎవరూ లేరని నీకు తెలుసు గదా!" చేతులు పట్టుకున్నాడు శేషయ్య.

"ఎలా బాబూ... వారికి తెలిస్తే నా ప్రాణాలు తీస్తారు'' భయం భయంగా అన్నాడు.

"ఫర్వాలేదు... నేను చూసుకుంటాను'' మాటయితే అన్నాడు గాని తానేమి చూడగలడో శేషయ్యకే తెలియదు.

రెండు నిముషాలు తర్జన భర్జన తరువాత వాళ్ళను తనతో తీసుకెళ్ళటానికి అంగీకరించాడు సూరిగాడు. భార్యను లేపి, పరిస్థితిని వివరించి, పిల్లలతోసహా ఆ అర్ధరాత్రే సూరిగాడుతో పంపాడు శేషయ్య.

అయితే వాళ్ళు వెళ్ళిపోయాక శేషయ్యకు అనుమానం వచ్చింది. సూరిగాడిని అడ్డంపెట్టుకుని పోలిరెడ్డే ఈ పని చేయించాడా? అని.

శేషయ్యలో ఆందోళన మొదలైంది.

మరునాడు శేషయ్య సాక్ష్యం ఇవ్వాల్సి వుంది.

ఆరోజువరకు ఏ బెదిరింపూ రాలేదు కనుక ఇది పోలిరెడ్డి పనికాదని నిశ్చయించుకున్నాడు. సూరిగాడికి మన సులోనే కృతజ్ఞతలు తెలుపుకున్నాడు.

కోర్టులో సాక్ష్యం చెప్పాడు శేషయ్య. తానేం చూశాడో అదే చెప్పాడు. ఒక్క ముక్క కూడా అబద్ధం చెప్పలేదు. రామయ్య ఆశ్చర్యపోతే, పోలిరెడ్డి ముఖంలో ఏ భావాలూ లేవు.

క్రాస్ ఎగ్జామినేషన్ కూడా ఆరోజే అయిపోయింది.

వెంటనే బయటకువచ్చి తన దారిన తాను బస్టాండుకు చేరుకున్నాడు. ఇక తన భార్యా పిల్లలికేమీ ప్రమాదం లేదని తృప్తిపడ్డాడు.

అక్కడే కనిపించాడు సూరిగాడు. దగ్గరగా వెళ్ళి ఆప్యాయంగా కౌగలించుకుని మరీ మరీ కృతజ్ఞతలు చెప్పుకున్నాడు శేషయ్య. ఆరోజు అతడు రాకుంటే తానెంత మానసిక వత్తిడికి లోనయ్యేవాడో చెప్పాడు. దేవుడిలా వచ్చి ఆదుకున్నావన్నాడు.

"బాబుగారూ! పోలిరెడ్డిగారు హోటల్ రూంలో వున్నారు. మిమ్మల్ని వెంటబెట్టుకు రమ్మన్నారు. ఎందుకంటే- అమ్మగారు పిల్లలు ఆయన అధీనంలోనే వున్నారు'' సూటిగా సూరిగాడికేసి చూశాడు శేషయ్య. అతడు చూపు తిప్పుకున్నాడు. సూరిగాడూ పోలిరెడ్డి మనిషే!! సంభ్రమాశ్చర్యాలతోపాటు నిస్సహాయత నిస్సత్తువ ఆవరించింది. అసంకల్పితంగా హోటల్‌కి వెళ్ళాడు సూరిగాడితోపాటు.

బెడ్‌పై పడుకుని వున్నాడు పోలిరెడ్డి. తలుపు దగ్గరగా వేసి బయటకెళ్ళాడు సూరిగాడు.

"శేషయ్యా! నాకు కావాల్సిన విధంగా నీవు సాక్ష్యం చెప్పలేదు. సూరిగాడు నీతో చెప్పింది నిజమే. నీవు నాకు అనుకూలంగా సాక్ష్యం చెప్పకపోతే నీ భార్యా పిల్లల్ని చంపిస్తానని'' తాపీగా చెబుతున్నాడు.

నిలబడే వున్నాడు శేషయ్య. వారికేమయిందోననే భయంతో గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి. "వారిప్పుడెక్కడ ఉన్నారు?"

"చావుకి అతిదగ్గరగా..."

"వాళ్ళని చంపొద్దు పోలిరెడ్డీ..." బతిమిలాడుతున్నట్లుగా అన్నాడు శేషయ్య.

"నేను బతిమిలాడితే నీవు విన్నావా శేషయ్యా?"

బదులు పలుకలేదు.

"వాళ్ళు బ్రతకాలంటే ఒక్కటే మార్గం వుంది''

"ఏంటది? త్వరగా చెప్పు... చేస్తాను''

"నీవు రామయ్యని చంపాలి''

"నేనా? చంపటమా? అబద్ధమే ఆడటం నాకు చేతకాదని నీకు తెలుసు''

"అది నాకూ తెలుసు... నీవు తెలివి తక్కువ వాడివనీ నాకు తెలుసు. నిన్ను బతిమాలాను. ఆశపెట్టాను. కొట్టించి బెదిరించాను. నీవు లొంగలేదు. మంచిదే. కాని

నీకు ఒరిగిందేమిటి? నేను రామయ్యను చంపించి తీరాలి. నీవు చంపవనీ నాకు తెలుసు. అందుకే నీ భార్యా పిల్లల్ని నేను చంపిద్దామనుకుంటున్నాను''

"వద్దు పోలిరెడ్డీ'' శేషయ్య కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. "అదిగాక నీవేం కావాలన్నా చేస్తాను''

బెడ్‌క్రిందనుండి దస్తావేజుల కాగితాలు తీశాడు. అవన్నీ టైప్ చేసి వున్నాయి.

"దీనిలో నీ ఆస్తిపాస్తులన్నీ, ఇంటితోసహా సుబ్బారావుకి అమ్మేస్తున్నావు''

"అతడెవరు?".

"ఆ పేరు వుంది గాని ఆ మనిషి నిజంగా లేడు. నా రహస్య ఆస్తులకు మరో పేరు అది. రేపుదయం రిజిస్ట్రేషన్ జరిగి తీరాలి. ఎల్లుండి నీవు ఊరొదిలి వెళ్ళిపోవాలి... రైల్వే స్టేషన్లో నీ భార్యా పిల్లలూ నిన్ను కలుస్తారు. వచ్చే రైలులో ఎక్కడకయినా వెళ్ళిపో... సరేనా?".

నిస్సహాయంగా తల వూపాడు శేషయ్య.



కాగితాలు ముందుకు తోసి, పెన్ తీసి ఇచ్చాడు. మౌనంగా అన్నిటిమీదా సంతకాలు చేశాడు శేషయ్య.

వాటిని తీసి బెడ్‌కింద పెట్టాడు పోలిరెడ్డి.

"నీతో పనయిపోయింతరువాత నీ భార్యా పిల్లల్ని వదిలిపెడతానని ఎలా అనుకున్నావు?" తాపీగా అన్నాడు పోలిరెడ్డి.

విరక్తిగా నవ్వాడు శేషయ్య.

"నేను నీవు కోరినట్లుగా సాక్ష్యం చెప్పినా ఈ కేసులో రామయ్యకు శిక్షపడదని నీకు తెలుసు. లేకుంటే ఈ బెదిరింపు ముందే చేసి వుండేవాడివి. ఇక రామయ్యను చంపటానికి నీకు డబ్బు కావాలి. అందుకోసం నా ఆస్తి తీసుకున్నావు. మరో విషయం ఏమిటంటే- నీ పొలంగుండా నా చేనుకి నీళ్ళు రావాలి. నీవు నీళ్ళు పారనివ్వవు. నేనేమీ చేయలేను. నా చేతగానితనం, మంచితనం నీకర్థమయాక నీవు నా భార్యాబిడ్డల్ని చంపి చేజేతులా హత్యా నేరాన్ని నెత్తికి తెచ్చుకోవు"

"అబ్బో తెలివయినవాడివే... ఏమో అనుకున్నాను..."

"నేను తెలివికలవాడిని కాను. కాని ఇదంతా మీరే నేర్పారు. ఇంకొకటి ఏమిటంటే- నా సాక్ష్యంతో నిజాయతీపరుడుగా నా పేరు ఊళ్ళో పెరుగుతుంది. రామయ్యావాళ్ళు నన్ను తమ గ్రూపులో చేర్చుకుంటారు. రేపు రాబోయే పంచాయతీ ఎలక్షన్‌లో రామయ్య ఎలానూ గెలవడు. నన్ను పోటీకి పెడితే నీవు ఓడిపోతావు... అందుకని నన్ను తరిమేస్తావు... నీతో పగకు, తగాదాకు నేను సమ ఉజ్జీకాదని నీకూ తెలుసు. అంతేకాదు పగటబట్టటం నాకు చేత కాదని నీకు తెలుసు... నేను మంచితనం అనుకునేది. నీవు చేతగానితనమనుకున్నావు"

నవ్వాడు పోలిరెడ్డి.

"నీకు ఊళ్లో వున్న అప్పులు నాలుగువేల ఆరొందలు వున్నాయి. ఆ అప్పులు తీర్చి వెళ్ళిపో" ఏభై రూపాయల నోట్లకట్ట ఒకటి విసిరేశాడు.

వంగి దానిని తీసుకున్నాడు శేషయ్య.

"ఇక నీవు వెళ్ళవచ్చు... రేపు పొద్దుటే నీ ముఖ్యమైన సామాను తీసుకుని రిజిస్ట్రార్ ఆఫీస్‌కిరా. సంతకాలు అయిపోయాక నీ భార్యాపిల్లలు నీకు అప్పచెప్పబడతారు"

శేషయ్య బయటకు వెళ్ళిపోయాడు.

రిజిస్ట్రార్ ఆఫీస్‌లో సంతకాలు చేసి బయటకు వచ్చాడు శేషయ్య. అతడికెంతో రిలాక్సింగ్‌గా వుంది. స్వేచ్ఛపొందినట్లుగా వుంది. ఆస్తిపోయినందుకు ఏమాత్రం బాధలేదు.

బయటకురాగానే భార్యాపిల్లలు కనిపించారు శేషయ్యకు. పరుగున వెళ్ళి వారిని అక్కున చేర్చుకున్నాడు. అతడి భుజంపై తల వాల్చి రోదిస్తోంది రాజమ్మ.

"ఏడవకే పిచ్చిదానా... ఇప్పుడు మనం కొత్తగా పుట్టాం" సూరిగాడు మాట్లాడిన రిక్షాలో ఎక్కి కూర్చుని రైల్వేస్టేషన్‌కి వచ్చారు. సూరిగాడికి టిక్కెట్లు కొనమని పోలిరెడ్డి ఇచ్చిన డబ్బులో మూడొంతుల సొమ్ము తను దాచుకుని, దగ్గర స్టేషన్‌కి టిక్కెట్లు కొని వారికిచ్చాడు. టిక్కెట్లను పరీక్షగా చూడలేదు శేషయ్య.

టి.సి. పట్టుకోవటం. డబ్బు వసూలు చేయటం, పిడుగురాళ్ళలో దింపేయటం జరిగింది.

గాఢంగా నిట్టూర్చాడు శేషయ్య. అవే నక్షత్రాలు, అదే చందమామ. కాకపోతే ప్రదేశం వేరు. సాంఘికస్థాయి వేరు.

★ ★ ★

"ఏందన్నా ఎలా వుందీ వూరు?" ప్రొద్దుట వస్తూనే అడిగాడు ఇస్రాయేల్. చిన్నగా నవ్వేడు శేషయ్య.

"పని బాగానే వుందా? కష్టమేమీ అనిపించటం లేదు కదా?"

"లేదు... అలవాటయిన పనేగా కొత్త ఏమీ





లేదు. నాకు పన్నెండు రూపాయలు, రాజమ్మకు ఎనిమిది రూపాయలు ఇస్తున్నారు. ఏదో తిండికి లోటు లేదు. కాని, రాజమ్మకు నెలలు నిండబోతున్నాయి. ఇక పనికి వెళ్ళలేదేమో. అపుడు నా ఒక్కడి కూలి సరిపోతుందా? అని ఆలోచిస్తున్నాను. అంతేకాదు రెండు నెలల్లో పంటల సీజన్ అయిపోతుంది. ఇక ఆరు నెలల పాటు పను లేమీ వుండవు. అపుడేం చేయాలి అని ఆలోచిస్తున్నాను''

"ఈ వూళ్ళో వ్యవసాయపు పనులమీదే ఎవరూ ఆధారపడరన్నా... సున్నపుబట్టీలున్నాయి. గనులున్నాయి. వేరే ఎన్నో పనులున్నాయి. వళ్ళు వంచి పని చేసేవారికి భుక్తికి లోటులేదు''

"ఏదో ఒక పని చూపించు ఇస్రాయేలూ... కష్టపడేవాడికి ఏ పనైనా ఒకటే... మరొకరి మీద ఆధారపడి బ్రతకకుండావుంటే అంతే చాలు''

"బతుకు గురించి భయం లేదన్నా... కాని మనిషి పెరగటానికే అవకాశాలు రావటంలేదు'' నిట్టూరుస్తూ అన్నాడు. "మెయిన్ రోడ్డు మీద ఉన్న ఇళ్ళన్నీ క్రిష్టియన్లవీ, హరిజనులవే గదా... అయితే ఎవరూ వ్యాపారంలోకి రాలేదు. తమ ఇంటిముందు కిళ్లీషాపులు కొందరు పెట్టుకుంటే, కొందరేమో సోడా బండ్లు వేసుకుంటున్నారు. ప్రభుత్వం నుండి సాయం వస్తున్నదని పేరేగాని ఎవరూ వృద్ధిలోకి రావటంలేదు. చుట్టుపక్కల గ్రామాల నుండి రెడ్లు వచ్చి వైన్‌షాపులు పెట్టి పైకివస్తున్నారు. కమ్మోరు ఫైనాన్స్ కంపెనీలు పెడతండారు. వైశ్యులు, ఇతర కులస్తులు సున్నం వ్యాపారంలో లక్షలు గడిస్తున్నారు. మరి మాలాటోళ్లేమో ఇలానే వుండిపోతున్నారు. జనతా గవర్నమెంటున్నపుడు రేట్లయినా స్థిరంగా వున్నాయి. ఉల్లిపాయలు కిలో ఆరు రూపాయలు అమ్మేసరికి జనం బెదిరిపోయి ఇందిరమ్మను మళ్ళీ గెలిపించారు. సంపాదన పెరగటం లేదు గాని రేట్లు మాత్రం అన్నిటికీ పెరుగుతున్నాయి. నీ ప్రక్కనున్న వెంకట సుబ్బయ్యను చూడన్నా... నీవు వచ్చేసరికి ఇడ్లీలు అమ్మేవాడు. ఇప్పుడు ఎంత పెరిగాడో- ఈ రెండు నెలల్లో... మరి నీవు? నీవూ వదినా కష్టపడ్డా మీరు మిగిల్చిందెంత? నేను రోజూ రిక్షా తొక్కి సంపాదించినా మిగుల్తున్నదెంత? నాకర్థంగానిదొకటున్నదన్నా కష్టపడేవాడు ఎపుడూ పైకి రావటంలేదు... కొందరసలు కష్టపడకుండా పైకి వస్తారు'' నిట్టూరుస్తూ అన్నాడు.

అది శేషయ్యకీ అర్థంకాలేదు.

"ఆ పక్కింట్లో వున్న కుర్రోడు ఏ పనీచేయడు. కానీ అందరికంటే ఎక్కువ సంపాదిస్తాడు. అవతలి పోర్షన్లో ఉందే ఆమె. ."

"ఆమె ఎవరు? నేనెప్పుడూ చూడలేదు''

నవ్వాడు ఇస్రాయేల్. "ఆమె తెలీనివాళ్ళు ఈ ఊళ్ళో ఎవరూ ఉండరేమో... ఆమె ఈ వూరి మొదటి చింతామణి. పేరు అంజమ్మ. నాకు తెలిసినప్పటినుండీ రాత్రింబవళ్ళు వళ్ళు అమ్ముకుని బతికింది. కాని నెలనెలా అద్దె కూడా సరిగా కట్టలేదు... పాపం... అందరూ దాన్ని 'లంజ' అంటారు నీచంగా... కాని నాకు తెలుసన్నా ఎందరో ఆడోళ్లు మాట్నీ సినిమాకని వచ్చి లాడ్జింగ్‌లో పడుకునేవాళ్ళు... వాళ్ళు మాత్రం మేడలు కడతండారు. ఇప్పుడు చెరువు కట్ట బజారులోని అంజమ్మ కంపెనీకి జనం వచ్చేవాళ్లే లేరు... కాని ఆ పతివ్రతలు మాత్రం రెండ్రోజులకోసారి సినిమాలకని బయల్దేరి వచ్చి ఎంతెంతో డబ్బు సంపాదించుకుంటారు. రాత్రిపూట నేను రిక్షాలో వారినింటికి తీసుకుపోతే ఆనందంగా పదిరూపాయలు విసిరేస్తాను... అదే అంజమ్మకు ఇంటికి రావటానికి నడిచే ఓపికలేక, రిక్షా ఎక్కడానికి డబ్బుల్లేకపోతే నేనే ఎన్నోసార్లు డబ్బు తీసుకోకుండా ఇంటికి చేర్చాను... అదన్నా ఈ లోకం"

శేషయ్య మాట్లాడలేదు. ఇస్రాయేల్ అనుభవంముందు తనకున్న పరిజ్ఞానం తక్కువని పిస్తోంది.



"సరే... నువ్వు పనికి వెళ్ళన్నా... నేను రిక్షా ఏయాలిగా... రేపట్నించి వదినను పనికి పంపమాకు... మరియమ్మ పురుడు పోస్తది లే" అన్నాడు.

'అలాగే'నన్నట్లు తలూపాడు శేషయ్య.

"పొలం పనులయ్యాక దేనికి వెళతావు బట్టీలకా? గనులకా? ఆలోచించి చెప్పన్నా... ఈలోగా పని నేను దొరికేలా చేస్తాను"

కళ్ళు చిట్లించాడు శేషయ్య.

నవ్వాడు ఇస్రాయేల్. "ఇక్కడా ముఠాలున్నాయ్‌లే అన్నా... ఇపుడు కోణంకి ఊరి వాళ్ళ ముఠా వుందనుకో- వాళ్ళలో రెడ్లు ఎక్కువ. అదే జానపాడు వాళ్ళయితే కమ్మోళ్ళెక్కువ. కరాలపాడు వాళ్ళయితే సాయిబు లెక్కువ. అక్కడ కూలీ అందరిమీదా పంచుతారు. అందుకని ప్రతివాళ్ళూ 'మనోడు' వుంటే బాగుండుననుకుంటారు. అది నేమాట్లాడతాలే నీవాలోచించుకుని చెప్పు" అనేసి వెళ్ళిపోయాడు ఇస్రాయేల్.

శేషయ్య, రాజమ్మ మిరపతోటకి కాయ విరుపుకి కూలికి వెళ్లారు. నెలలు నిండిన రాజమ్మ వంగొని కాయలు కోయటానికి కొంత ఆయాస పడుతోంది.

"రేపట్నుంచి నువ్వు పనిలోకి వద్దులే... ఇంటి దగ్గరే వుండు... మరియమ్మ పురుడు పోస్తుందట..." చెప్పాడు శేషయ్య.

"ఇప్పటికే ఇద్దరు పిల్లల్ని ఆమె మీదకు తోలి వస్తున్నాం. ఇంకా ఆమెకు శ్రమ"

"అయినా తప్పదు మరి" బాధగానే అన్నాడు.

నాలుగురోజుల తరువాత రాజమ్మ ప్రసవించింది. మగపిల్లవాడు. శ్రీనివాస్ అని పేరుపెట్టుకున్నారు. కాని ముద్దుగా శీను అని పిలుస్తున్నారు.

వ్యవసాయపు పనులు కూడా అయిపోవచ్చినయ్. ఇక ఏ పనిచేయాలి అని ఆలోచనలో పడ్డాడు శేషయ్య.




'మహాత్మగాంధీ బార్ అండ్ రెస్టారెంట్' పిడుగురాళ్ళ గ్రామంలో బాగా ప్రసిద్ధి చెందిన బార్. అధికరేట్లకు, కల్తీ సరుకుకు, బాగుండని ఆహారపదార్థాలకు పేరెన్నిక గన్నది.

అయినా ఆ బార్‌లో కూర్చోవటానికే ఖాళీ దొరకదు. ఎక్కడ చూసినా సున్నం డబ్బే... ఏం చేయాలో తోచని యువత అంతా అక్కడికే చేరతారు. పార్టీలు బాగా వచ్చి డబ్బు ఎవరికి వచ్చినా రెవెన్యూ డిపార్ట్‌మెంట్‌వారు, వచ్చిన వాటాల్లో కొంత శాతం 'మందు'కు కేటాయించే కమర్షియల్ టాక్సెస్ ఉద్యోగులు, పైడబ్బులేమీరాక, ప్రక్క ఉద్యోగస్తులను చూసి బాధపడుతూ 'బార్'కి చేరే హెల్త్ స్టాఫ్ ప్రతి రోజూ అక్కడకు చేరతారు. మందుకొట్టి ఎన్.టి.రామారావు రాజకీయాల్లోకి వస్తాడా? రాడా? అని చర్చించుకుంటారు. అప్పటికే ఆయన రాజకీయాల్లోకి వస్తాడు అనే పుకార్లు పుట్టాయి.

జయప్రకాష్ కూడా రోజూ 'బార్'కి వస్తాడు. అయితే మందుతాగడు. త్రాగేవాళ్ళకు కంపెనీ ఇస్తుంటాడు. ఏ టేబుల్ దగ్గర చికెన్ కర్రీ కనిపిస్తే ఆ టేబుల్ దగ్గిర కూర్చుని వారితో ముచ్చటిస్తుంటాడు. వారి డబ్బుల్తో కూల్‌డ్రింక్‌లు, చికెన్ పలావ్‌లు తింటాడు. వారు ఏ పార్టీ వారయితే ఆ పార్టీ గొప్పలు చెబుతాడు. వ్యాపారస్తులు కూర్చున్న




టేబుల్ అయితే వ్యాపార రహస్యాలు ఉద్బోధ చేస్తాడు. కార్మికులు కూర్చున్న టేబుల్ అయితే- వారి హక్కుల గురించి మాట్లాడతాడు. ఉద్యోగస్తుల టేబుల్ అయితే వారి సాధక బాధకాలు. ప్రజలు వారి సేవను ఎందుకని గుర్తించటం లేదోనని వివరించి ఓదారుస్తాడు.

నిజానికి జయప్రకాష్‌ది ఏకులమో, మతమో ఎవరికీ తెలియదు. ఏ కులంవారితో ఆ కులంవారిలాగానే ప్రవర్తిస్తాడు. ఆస్తికులలో ఆస్తికుడుగా, నాస్తికులలో నాస్తికుడిగా వుంటాడు. రెండువేపులా 'ఆర్గ్యూ' చేయగలడు. ఉపన్యాసాలు ఇవ్వగలడు. ఎప్పుడూ ఒక్క కథ రాయకపోయినా రచయితనని చెప్పుకొంటాడు. నాటకాలలో అనుభవం వుంది అని చెబుతాడు. సినిమా ఛాన్స్ వస్తే తానే తిరస్కరించానని నమ్మిస్తాడు.

విచిత్రమేమిటంటే అతడి మాటలు అందరూ నమ్ముతారు. అతడికి గొప్ప పలుకుబడి, ఆస్తిపాస్తులు వున్నాయని అనుకుంటారు.

ఏడెనిమిది నెలలుగా 'బార్'కి రావటంలో అతడికి ఒక ధ్యేయం వుంది. అతడికి ఒక వ్యక్తి కావాలి. అతడికోసమే అతడి డేగ కళ్ళు వెతుకుతున్నాయి.

చివరికతడిని మూడోనెంబర్ సుబ్బారావుగా గుర్తించాడు. అంటే సాయంత్రం ఐదు గంటలకు ఆఫీస్ నుండి డైరెక్టుగా బార్‌కి వస్తాడు. సరాసరి మూడోనెంబర్ గదిలోకి వెళతాడు. హాఫ్ బాటిల్, రెండు సోడాలు, ఒక చికెన్ ఫ్రై అనీ అతడి ఆర్డర్. అతడు చెప్పాల్సిన పనిలేదు. అతడు రాగానే బేరర్ అన్నీ సప్లై చేస్తాడు. ఒంటరిగా కూర్చుని, అది పూర్తికాగానే వెళ్ళిపోతాడు. అంతకంటే ఎక్కువా వుండదు. తక్కువా వుండదు! 'అతడే మూడోనెంబర్ సుబ్బారావు. అతడి గురించిన పూర్తి వివరాలు సేకరించాడు జయప్రకాష్.

ఒకరోజు సరాసరి అతడి రూమ్‌లోకి వెళ్ళాడు. మూడోనెంబర్ గదిలోని సుబ్బారావు ఆశ్చర్యంగా ముఖం చిట్లించి, చూసి తిరిగి తన పనిలో మునిగిపోయాడు. ఎవరితోనూ ముందుకొడుతూ మాట్లాడటం అతడికిష్టం వుండదు.

చికెన్ పలావ్ ఆర్డరిచ్చి, సుబ్బారావునే చూస్తూ కూర్చున్నాడు జయప్రకాష్. సిగరెట్ పాకెట్ బయటకు తీసి అతడికి ఆఫర్ చేశాడు.

"నో థాంక్స్..." నిర్మొహమాటంగా చెప్పాడు సుబ్బారావు. "నేను ఒకరి సొమ్ముగాని, వస్తువుగాని తీసుకోను... ఇవ్వను. అది నా సిద్ధాంతం"

"నాకు తెలుసు... అయినా ఎదుటివారిని అడగటం మర్యాదకదా?" నవ్వాడు. సుబ్బారావు నవ్వలేదు. "మీకెలా తెలుసు?" ఆశ్చర్యంగా అడిగాడు.

"ఎందుకంటే- మన మధ్య బంధుత్వం ఉంది కనుక..."

"బంధుత్వమా?"

"అవును... మీ పేరు సుబ్బారావు. మీ భార్యపేరు వరలక్ష్మి. మీకిద్దరు పిల్లలు. మీ పెళ్ళికి వందరూపాయల కట్నం తగ్గితే పీటల మీదనుండి లేచిపోబోయారు. కాని పెళ్ళికొచ్చిన ఒక కుర్రాడు ఆ డబ్బు ఇస్తే మీరు తాళికట్టారు. అతడు మీ భార్యవేపు బంధువు''

"ఇవన్నీ మీకెలా తెలుసు??" అడిగాడు.

"ఎందుకంటే ఆ వంద ఇచ్చిన వాడిని నేనే గనుక..."

"అయినా సరే... ఆ వంద తిరిగి ఇవ్వను. నాకు తీసుకోవటమే కాని ఇవ్వటం తెలియదు. అది నా సిద్ధాంతం"

"అదీ నాకు తెలుసు... మీరు కమర్షియల్ టాక్సెస్‌లో పనిచేస్తారనీ నాకు తెలుసు''

"మీరు నా బంధువు అయినా మా ఆఫీస్‌లో పనివుంటే ముందు డబ్బు ఇవ్వాల్సిందే. లేనిదే ఏ విషయమూ మాట్లాడను...

అది నా సిద్ధాంతం"

"అందుకే మీరు నాకు చాలా బాగానచ్చారు''

నవ్వాడు సుబ్బారావు. "నన్నందరూ పిసినారి అంటారు. వెధవ అంటారు. డబ్బు లేనిదే మాట్లడడంటారు. నేను ఎవరయినా మందుపోయిస్తే త్రాగుతాను గాని, నేను పోయించను. ఏదయినా తీసుకోవటమేగాని ఇవ్వటం నా సిద్ధాంతానికి వ్యతిరేకం... నేను నచ్చానని పొగుడుతున్నారంటే- మీకు నాతో పనేదయినా వుండి వుండాలి. లేదా మందేమయినా పోయిస్తానని ఆశ వుండాలి. చెప్పానుగా నేను వెధవను... తీసుకోటం తప్ప ఇవ్వటం నా సిద్ధాంతానికి వ్యతిరేకం"

"అందుకే మీరు చాలా బాగా నచ్చారు. ఎందుకంటే ఈ దేశంలో వెధవలే ఎక్కువ. కాని ఏ చవట కూడా తాను 'వెధవ'నని ఒప్పుకోడు. కాని మీరు ఒప్పుకున్నారు. ఇది నిజమేకదా? పొగడ్త కాదు... అవునా కాదా?"

"అవును..."

"రైట్... ఇంకోటేమిటంటే నాదీ మీ మనస్తత్వమే. ప్రక్కవాడిప్పిస్తేనే సిగరెట్ త్రాగుతాను. తినిపిస్తేనే చికెన్ తింటాను. నాకూ ఏదయినా తీసుకోవటం తప్ప ఇవ్వటం తెలియదు''

"నేను నమ్మను... ఎందుకంటే నాలాటి వెధవలు ప్రపంచంలో ఎక్కడా వుండరని నా భార్య రోజూ చెబుతుంది. ఆవిడన్నీ నిజాలే చెబుతుంది. ఇపుడు మీ ఖర్చుతో చికెన్ తెప్పించుకుంటున్నారు గనుక మీకు సిద్ధాంతపరంగా నైతికబలం లేదు''

చిరునవ్వు నవ్వాడు జయప్రకాష్.

"మీకూ నాకూ తేడా ఏమిటంటే మీ తిండికి, సిగరెట్లకీ, మందుకీ మీ స్వంత డబ్బు ఖర్చుపెడతారు. కాని నేను వాటికి కూడా నా డబ్బు ఖర్చుపెట్టను. ఎవడయినా స్వంత డబ్బుల్తో తిని తాగాడంటే నా దృష్టిలో వాడు వెధవ. అఫ్‌కోర్స్ మీరు ముందుగానే ఒప్పేసుకున్నారు గనుక ప్రాబ్లంలేదు. నా దృష్టిలో స్వంత డబ్బుల్తో వ్యాపారం చేసేవాడూ వెధవే... అందుకే పెట్టుబడిలేని వ్యాపారం చేస్తున్నాను''

"పెట్టుబడి లేని వ్యాపారమా?" ఆశ్చర్యపోయాడు సుబ్బారావు.

"అవును... పెట్టుబడిలేకుండా స్వంత తెలివి తేటలతో వ్యాపారం చేసేవాడే అసలయిన వ్యాపారస్తుడు. నేనదే చేస్తున్నాను... దీనిలో ఆదాయం తప్ప, నష్టం ఉండదు''

"ఏమిటది?"

"అది మీరడగకూడదు... మీకు చెప్పకూడదు''

మరో పెగ్గు మందు లాగించి అన్నాడు సుబ్బారావు, "మీ వ్యాపారమేమిటో చెప్పండి''

"అది చెప్పాలంటే ఫీజ్ వుంటుంది వంద రూపాయలు. అది మీరివ్వరు కనుక నేను చెప్పను''

కాసేపాలోచించాడు సుబ్బారావు. జేబులోంచి వందకాగితం బయటకు తీసి టేబుల్ పైపెట్టాడు.

"అది మీ సిద్ధాంతానికి వ్యతిరేకం" నవ్వాడు జయప్రకాష్.

"కాదు'' స్థిరంగా అన్నాడు. "ఇది నా ప్రక్కగుమస్తాకిమ్మని ఇందాక కిరాణాకొట్టువాడిచ్చాడు. ఇది వాడి డబ్బు. వాడి డబ్బునీకిస్తున్నాను. రేపు వాడు డబ్బడిగితే మీరు చెప్పిన సలహా వాడికి చెబుతాను''

"సరే..." వంద తీసుకొని జేబులో పెట్టుకున్నాడు జయప్రకాష్.

"నేను చేసేది... డబ్బు లేకుండానో, లేక కొద్దిగా డబ్బున్నవారికో వారూహించిన దానికంటే గొప్పగా ఎలా వ్యాపారాలు చేయాలో చెబుతాను. ఉదాహరణకి మీరు చాలా చిన్న మొత్తంలో లక్షలలో వ్యాపారం ఎలా చేయవచ్చో చెబుతాను... అయితే దానికీ ఫీ




జుంటుంది''

"ఎంత?" సుబ్బారావు హాఫ్ బాటిల్ అయి పోవస్తోంది. "త్వరగా చెప్పండి... ఇది కాగానే నేను వెళ్ళిపోవాలి. క్షణం ఉండకూడదు. అది నా సిద్ధాంతం"

"టెన్ పర్సెంట్, నెలకు పదివేల రూపాయల ఆదాయం వచ్చేదయితే వెయ్యి... లక్ష అయితే''

"నాకు పర్సెంటేజీలు వచ్చు''

"సరే... అలా అయితే మీరు మందు తాగనప్పుడు ఆ వివరాలు చెబుతాను... మీమందు అయిపోయింది. మీ సిద్ధాంతం" గుర్తుచేశాడు.

"అవునవును..." గబగబా లేచి వెళ్ళిపోయాడు సుబ్బారావు. పలావుకి బిల్లుకట్టి, మిగతా డబ్బులు జేబులో వేసుకొని కదిలాడు జయప్రకాష్.

సరిగ్గా సాయంత్రం నాలుగు ముప్పావుకు సుబ్బారావు వాళ్ళ ఆఫీస్‌కి వెళ్ళాడు జయప్రకాష్. ఐదు కొట్టగానే బయటకు వచ్చాడు సుబ్బారావు.

"హలో'' పలకరించాడు జయప్రకాష్.

"మీరెవరు? ఆఫీస్‌పనా? అయితే ఆఫీస్ టైంలోరండి. బయట ఆఫీస్ విషయాలు నేను మాట్లాడను'' అని కదలబోయాడు.

"మీతో మాట్లాడటంకోసం నాకు మీరు వందరూపాయల ఫీజిచ్చారు... నిన్న బార్‌లో'' అన్నాడు జయప్రకాష్.

ఎడమచేత్తో చిటిక వేశాడు సుబ్బారావు. "రైట్... రైట్... గుర్తొచ్చింది. నా ప్రక్క గుమాస్తా డబ్బులు కదా మీకిచ్చాను. అవునూ... ఎందుకిచ్చాను?? మీ పేరేమిటి?"

"నా పేరు చెప్పానుగా... జయప్రకాష్. మీ దూరపు బంధువుని''

"ఎలా బంధువు?"

"బంధుత్వం గుర్తుచేయొద్దు... నాకు బంధువులంటే అసహ్యం... మనం స్నేహితులం. అంతే''

"మనం స్నేహితులం కాదు. పరిచయస్తులమూ కాదు పనేమిటో చెప్పండి... నే త్వరగా వెళ్లాలి. లేకుంటే నా సిద్ధాంతాలకు విరుద్ధమవుతుంది నిర్మొహమాటంగా అన్నాడు''

"అదే చెప్పబోతున్నాను. గూఢచారులు, మామూళ్లు తీసుకునే అధికారులు ఒక ఖచ్చితమైన టైం మెయింటైన్ చేయగూడదు... ఎందుకంటే గూఢచారుల్ని చంపే అవకాశముంటుంది. అధికారుల్ని ఎ.సి.బి వాళ్ళు పట్టుకునే అవకాశం వుంటుంది. ఇపుడు మీ జేబులో వున్న నోట్లలో ఎ.సి.బి.వారు పంపించిన నోట్లు లేవని మీకెలా నమ్మకం"

వెంటనే వేలిని నాలికపై తడిచేశాడు సుబ్బారావు ఎర్రగా మారింది. నిలువెల్లా వణికిపోయాడు.

"ఖంగారుపడకండి... అది ఎర్ర సిరా మీ చేతికి ఇంతకుముందే వుంది. అలాటి ప్రమాదాలు కలగకుండా చేయటమే నా పని. అందుకేగా నిన్న మీవద్ద ఫీజ్ తీసుకున్నాను. పదండి'' దారితీస్తూ అన్నాడు జయప్రకాష్.

ఖంగుతిన్న సుబ్బారావు అతడిని అనుసరించాడు.

ఇద్దరూ ఎర్రవాగుకేసి నడిచారు. దాని వద్దున కూర్చునేంతవరకు ఎవరూ ఏమీ మాట్లాడుకోలేదు.

"అబ్బ ఏం సువాసన" ముక్కుపుటాలు పెద్దవి చేస్తూ సున్నపు బట్టీలనుండి, సెమ్ మిల్లులనుండి వచ్చే పొగను పీలుస్తూ అన్నాడు జయప్రకాష్.

గట్టిగా వాసన పీల్చి ఊపిరాడక దగ్గి, పరీక్షగా అతడికేసి చూశాడు సుబ్బారావు.

"ఆహా'' తన్మయత్వంగా అన్నాడు.

"ఏవిటి? ఆహా ఓహో అంటున్నారు. ఈ వాసనకు ఎలర్జీవచ్చి, దుమ్ముపోయి టి.బి. వచ్చి చస్తారు'' విసుగ్గా అన్నాడు.

"అలా చూడండి... ఆ రోడ్డుమీద బారులు

తీర్చి శిథిలమైన కోటబురుజుల్లా బహుచక్కగా ఈ గ్రామానికే శోభను చేకూర్చే ఆ సున్నపు బట్టీలను చూడండి... ఒకటా? రెండా? వందలు... వాటిని చూస్తుంటే వళ్ళు పులకరించిపోవట్లేదూ?"

"ఏవిటి సున్నం కంపుగొట్టి చస్తుంటే ఆహా ఓహో అట" విసుగ్గా అన్నాడు.

"భలేవారే... దానిలో మీకు నిధి కనిపించటంలేదూ? అయినా చేపల వ్యాపారం చేసేవారు చేపల వాసనని సెంటులాగా భరించాలి... అలానే ఆ బట్టీల్లో ఆ విషవాయువులలో మీకు నిధి కన్పించటంలేదా?"

"ఏం నిధి?" ముఖం చిట్లించి అన్నాడు సుబ్బారావు.

"డబ్బండీ డబ్బు... ఆ విషవాయువుల్లో కోట్లాది రూపాయలు ఉన్నాయని మీకు అనిపించటంలేదా?"

"లేదే''

"మీకు మందులేక పోవటంవలన అర్థంకావటం లేదు'' అంటూ భుజానికున్న సర్వోదయా సంచిలోంచి ఒక హాఫ్ బాటిల్ విస్కీ, రెండు సోడాలు, ఒకగ్లాసు, ఓపెనర్ తీసి బయటపెట్టాడు. "వీటి ఖరీదు ముప్పై రూపాయలు. గ్లాసు అద్దె రూపాయి, సర్వీసింగ్ ఛార్జెస్ ఐదురూపాయలు. మొత్తం ముప్పై ఆరు రూపాయలు. నాకిచ్చి ఇవి తీసుకోండి ముందు'' అన్నాడు.

సుబ్బారావు జేబులోంచి వంద తీసి ఇచ్చాడు. చిల్లర ఇచ్చి, చివరగా ఒక రూపాయి ఎక్కువగా తీసుకున్నాడు "అదేంటి?" అన్నాడు.

"అది బార్‌లో బేరర్‌కి మీరిచ్చే టిప్. నేను అన్నిటిలో చాలా ఖచ్చితంగా వుంటాను''

రెండు పెగ్గులు మందు పడ్డాక అడిగాడు సుబ్బారావు. "ఇప్పుడు చెప్పండి... ఆ విషవాయువుల్లో కోట్లాది రూపాయలు ఎలా వున్నాయి... మీకెలా కన్పిస్తున్నాయి''

"ఈ గ్రామంలో కోట్లాది రూపాయల నల్ల డబ్బు వుందని మీకు తెలియదా?"

"నిజంగా??" ఆశ్చర్యపోయాడు సుబ్బారావు.

"నిజమే... పట్టుమని పదివేలు జనాభా లేని ఈ గ్రామానికి ఇన్ని లక్షల రూపాయలతో కట్టిన కట్టడాలా? ఇన్ని ఫైనాన్స్ కంపెనీలా? ఇన్ని బార్‌లా? ఇవన్నీ ఎక్కడ నుండి వచ్చాయనుకుంటున్నారు? నల్ల బంగారం... తెల్ల బంగారం..."

"అవేమిటో నాకు తెలియదుగాని జబ్బులు మాత్రం పెరిగి తగ్గట్లుగానే హాస్పిటల్స్ పెరిగాయి''

"మీకు నిజంగా తెలీదా?" ఆశ్చర్యంగా అడిగాడు జయప్రకాష్. "నల్లబంగారం అంటే బొగ్గు... తెల్లబంగారం అంటే సున్నం... రెండూ విడివిడిగా నోట్ల వర్షం కురిపిస్తాయి. ఈ ఊళ్ళో రాళ్లనుండి రత్నాలు తీస్తారు''

"ఈ ఊళ్లో రత్నాల గనులున్నాయా? " మరో పెగ్ లాగించి అన్నాడు.

"భలేవారే... రత్నాల్లాంటి రాయివుంది. సున్నపురాయి. ఆ వ్యాపారంలో గనుక దిగితే లక్షలకు లక్షలు సంపాదించవచ్చు''

"అదెలా? నాకు వ్యాపారం తెలియదుగదా?"

"ఈ ఊళ్లో వ్యాపారం తెలిసిన వాళ్ళంతా దివాలా తీశారు. తెలీనివాళ్ళంతా గొప్పవాళ్ళయ్యారు. అంటే మీకు సక్సెస్ అయ్యే లక్షణాలున్నాయన్నమాట"

"సరే అయితే... పెట్టుబడి లేని వ్యాపారమన్నావుగదా? నేను రడీ''

నవ్వాడు జయప్రకాష్. "అది నా సిద్ధాంతం. మీది కాదు. మీ దగ్గర డబ్బుంది. నా దగ్గర తెలివితేటలున్నాయ్. డబ్బు చెట్లు నాటటం నావంతు. పంట మీవంతు''

"అబ్బే... నా దగ్గర డబ్బెక్కడ వుంది? ఉన్నా నేను ఇవ్వననేది నా సిద్ధాంతం గదా?"




"భలేవారే మీకు నెలవారీ మామూళ్లు నెలకు పదిహేనువేలొస్తాయి. అదంతా ఏం చేస్తారు? ఎపుడయినా ఎ.సి.బి.వారు దాడిచేస్తే ఉన్నదంతా ఊడ్చుకుపోతుంది. అందుచేత ఏదో వ్యాపారం మీ భార్య పేర వుంటే అది ఆ ఆదాయంగా చూపించుకోవచ్చు''

"భలేవాడివే... నేను రెండెకరాల చవిడి నేల నాలుగు వేలు పెట్టికొన్నాను. రికార్డుల్లో తమలపాకు తోట అని రాయిస్తున్నాను. రెండు లక్షలు వైట్ అయిపోతుంది. దానికి టాక్స్ కూడా వుండదు. ఇంకా వ్యాపారమెందుకు?"

"భలేవారే మీ గుంటూర్లోని రెండు బిల్డింగ్‌లు, వైజాగ్‌లోని బంగళా, హైదరాబాద్‌లోని ఫ్లాట్ ఎక్కడివని అడిగితే ఏం చెబుతారు. అందుకని మీకు బిజినెస్ ఉండటం అవసరం. అదీగాక బిజినెస్ అంతా మీ పేరునే వుంటుంది. డబ్బు ఖర్చుపెట్టేదీ మీరే. చెక్కులు మీపేరుమీదే వస్తాయి. ఐమీన్ మీ భార్యగారి పేర... ఇక మీరు ఆలోచించాల్సింది ఏముంది?"

"అయితే అంతా నా భార్య పేరుమీదే ఉంటుందా?"

"అవును''

"అయితే ఆలోచిస్తాను. అయినా ఇవన్నీ చేస్తే నీకేం లాభం?"

"మనం ఇద్దరం ఫిఫ్టీ ఫిఫ్టీ పార్టనర్స్... మీ లాభాల్లో నాకు వాటా వుంటుంది. అది నా తెలివికి ఖరీదు''

"నేనేం పిచ్చోడిని కాను... నీ పెట్టుబడి ఎంత?"

"నేను నా సిద్ధాంతం చెప్పాను''

"అసలు ఎంత పెట్టుబడి కావాలి?"

"యాభైవేలు''

"అంతా నా భార్యపేరుమీదే వుంటుందా?"

"ఆc''

"అయినా నేనొప్పుకోను. డబ్బు తీసుకోవటమేగాని ఇవ్వటం నాకు తెలియదు''

"మీరు డబ్బు నా చేతికివ్వరు... మీరే కంపెనీ కింద ఖర్చుచేస్తారు. అందువలన మీ సిద్ధాంతం తప్పదు. అయినా మీకోసం నా సిద్ధాంతాన్ని కొంత సడలించుకుంటాను. ఐదు రూపాయలు పెట్టుబడిగా ఇస్తాను'' జేబులోంచి ఐదు రూపాయలు తీసి ఆయన జేబులో పెట్టాడు.

జేబు తడుముకున్నాడు సుబ్బారావు.

"ఇంతకీ ఏం వ్యాపారం"

"మనం సున్నపుబట్టీ కడదాం?"

"అయ్యబాబోయ్! అది మూడు లక్షలవుతుంది కదా?"

"కడితే ఇక వ్యాపారమెందుకు? ఐదు రూపాయల పెట్టుబడికి సగం వాటా ఎందుకు?" నవ్వాడు జయప్రకాష్ "మీరేం పిచ్చివారా? ఇలా అంగీకరించటానికి''

అంతలో సుబ్బారావు మందు అయిపోయింది. లేచాడు. జయప్రకాష్ కూడా లేచాడు. "మీరు వారం రోజులు ఆలోచించుకోండి. మీ డబ్బు మీ చేతుల్తోనే ఖర్చుపెడతారు. అదీ ఆ ఖర్చు ఎందుకని అవసరమో నేను చెప్పిన మీదట... లాభాలు చూపించే పూచీ నాది... దానిలో ఫిఫ్టీ పర్సెంట్ వాటా నాది... ఆలోచించుకోండి'' కదిలాడు జయప్రకాష్.

అతడు వెళ్ళిపోయాక తాపీగా ఆలోచిస్తూ నడుస్తున్నాడు సుబ్బారావు. మందు కొట్టినా డబ్బు దగ్గర చాలా నిక్కచ్చిగా వుంటాడు. జయప్రకాష్ తననెలా మోసం చేసే అవకాశముందా అని ఆలోచించాడు. ఫర్మ్ తన భార్య పేరనే వుండి, చెక్‌పవర్ తన భార్యకే వుండి, డబ్బు తనే ఖర్చుపెడితే- ఇక జయప్రకాష్ మోసం చేసే అవకాశమెక్కడుంది?

అయినా సరే వివరాలు కనుక్కుందామనుకున్నాడు మనసులోనే. డబ్బు ఉన్న వానికే ఆశ ఎక్కువ. సుబ్బారావు అప్పటికే పది లక్షలపైనే సంపాదించాడు. రిటైరైపోయేలోపు




కోటి రూపాయలు ఈజీగా సంపాదించగలడు. కాని యాంటీ కరప్షన్ వాళ్ళు పట్టుకుంటే- ఆ ఆస్తి ఎలా వచ్చిందో చెప్పలేడు. కనుక ఏదైనా వ్యాపారం ఉండటం అవసరమే. అదీగాక పెట్టుబడి యాభైవేలే గనుక పోయినా ఫరవాలేదు. నాలుగు నెలల పై సంపాదనే కదా!?

అయినా జయప్రకాష్ వలలో పడకుండా జాగ్రత్తపడాలి. వీలయితే అతడిని ముంచేసి అయినా తను పైకిరావాలి. ఆ రహస్యం తెలుసుకునేవరకే జయప్రకాష్ అవసరం తనకు!!



**వెం**కటసుబ్బయ్యగారి వ్యాపారం కొద్దికాలంలోనే బాగా పుంజుకుంది. నిజానికి ఆయనకంటే ఎక్కువ ఆయన భార్య పరమేశ్వరి కష్టపడుతోంది. సాయంత్రం పప్పు నానబెట్టుకోవటం, ఉదయాన్నే రుబ్బించటం ఏవి ఏయే పాళ్లలో కలపాలో నిర్ణయించటం ఆమె చేతిలోనే వుంది. తినే వస్తువులకు దేనికైనా రుచి ప్రధానం. ఆ ప్రతిభ పరమేశ్వరికుండటం అది వెంకటసుబ్బయ్యగారి అదృష్టమే. దానికితోడు ఎనిమిదేళ్ల కొడుకు హరనాథబాబు, ఆరేళ్ల రెండో కొడుకు రామాంజనేయులు వ్యాపారంలో బాగా తోడ్పడతారు. రెండేళ్ల కూతురు కుసుమను ఆడించటం పిల్లల ముఖ్యమైన పని.

ఉదయం ఐదుగంటలకల్లా కావాల్సిన సరుకులన్నీ పెట్టుకుని, కుసుమను కూడా బండిపైనే కూర్చోబెట్టి తోసుకుంటూ సెంటర్‌కి చేరతారు వారు. వెంటనే స్టౌ వెలిగించి ఇడ్లీ పాత్ర ఎక్కిస్తుంది ఆమె. ఈ లోపల మంచినీళ్లు తెచ్చిస్తాడు వెంకటసుబ్బయ్య. పిల్లలు ఆకులు శుభ్రంగా తుడిచి నీట్‌గా సర్దుతారు. ఒకవేపు ఇడ్లీవాయ దిగుతుండగానే నూనె కాగించి పూరీలు కూడా వేస్తుంది ఆమె. మరో పెనంపై పెసరట్, ఉప్మా వేస్తుంటాడు వెంకటసుబ్బయ్య. ఏడు గంటలకు ప్రారంభమయిన రద్దీ పదిగంటలదాకా తగ్గదు. దానికి కారణం శుభ్రంగా, శుచిగా, రుచిగా వుండటం, ఖరీదు తక్కువ ఉండటం కారణం.

హెూటల్‌లో రెండు ఇడ్లీ ముప్పావలా వుంటే, సుబ్బయ్య దగ్గర అర్ధరూపాయే. అలాగే దోశ హెూటల్లో రూపాయి వుంటే ఇక్కడ ముప్పావలానే. హెూటల్‌వారికి పెట్టుబడి ఎక్కువ. సర్వర్ల జీతాలు, వంట మాస్టర్, ఫర్నిచర్ ఖరీదు, ఫాన్లు, హెల్త్ ఇన్స్‌పెక్టర్ మామూళ్ళూ అన్నీ వుంటాయి. వెంకటసుబ్బయ్యకు ఆ ఖర్చులేవీ లేవు. వర్కర్ల జీతాలు లేవు. క్లీనర్ల బెడదలేదు. వర్కర్ల సమ్మె ఉండదు. అందువలన తక్కువ ధరకే ఇవ్వగలుగుతున్నాడు. తినేవారికి కావల్సింది క్వాలిటీ, క్వాంటిటీ అంతే తప్ప హంగులు అక్కరలేదు. అందుచేత వెంకటసుబ్బయ్య బండికి గిరాకీ బాగా పెరిగింది. పదిగంటల తరువాత గారెలు ఒక వాయ, బజ్జీలు రెండు వాయలు వేసి ఇంటికెళుతుంది పరమేశ్వరి. పిల్లలు స్కూళ్లకు వెళతారు. అప్పుడు వెంకటసుబ్బయ్య ఒక్కడే బేరం చూస్తాడు. ఆమె ఇంటికెళ్లి వంట చేసి, తను తిని భర్తకు కారియర్ తీసుకునివస్తుంది. మళ్ళీ సాయంత్రం నాలుగ్గంటల నుండి బార్‌ముందు మిరపకాయబజ్జీలు, గారెలు, వడలు, పకోడీలు విపరీతంగా అమ్ముడవుతాయి.

సరిగ్గా ఆరునెలలు తిరిగేసరికి వెంకటసుబ్బయ్య బండిని స్వయంగా కొనుక్కున్నాడు. ఇక అద్దెకట్టే పనిలేదు. సరుకులు హోల్‌సేల్‌లో వారానికోసారి తీసుకొస్తాడు. అదీ క్యాషే. అప్పులేవీ లేవు అతడికి. పచ్చళ్లని రుబ్బటానికి కూడా మిషన్ కొన్నాడు.

ఇప్పుడు వెంకటసుబ్బయ్యలో నమ్మకం పెరిగింది. కష్టపడేకొద్దీ డబ్బు! కొంచెం శ్రమ ఎక్కువయినా డబ్బు బాగానే మిగుల్తుంది. ఇప్పుడు రోజుకి కనీసం రెండువందలు లాభంగా ఇంటికి తీసుకెళ్లగలుగుతున్నాడు. అందరికీ మంచిబట్టలు, ఇంట్లోకి కుర్చీలు, రేడియో, మంచాలు లాంటివి అమర్చుతున్నాడు. ఏదైనా స్పెషల్ పార్టీలు వుంటే ఇంట్లోనే తయారుచేసి పార్సిల్ పంపుతున్నాడు.

అన్నిటికీ మించి పేపర్ తనే స్వయంగా కొంటున్నాడు. తను చదవటమేగాక, ఆ పేపర్లు బండిమీద ఉపయోగపడుతున్నాయి.

అతడికి జయప్రకాష్ అంటే మంచి గురి ఏర్పడింది. అతడు వచ్చినప్పుడల్లా కాఫీ, టీలు, టిఫిన్‌లు ఫ్రీగానే ఇస్తున్నాడు.

మిగుల్తున్న డబ్బుల్ని పరమేశ్వరి ఖాళీగా వుంచటంలేదు. బట్టల షాపులో హోల్‌సేల్‌లో చీరెలుకొని, కొంచెం రేటు ఎక్కువ తీసుకుని ఇన్‌స్టాల్‌మెంట్‌లో చుట్టుపక్కల అమ్మలక్కలకు అమ్ముతుంది. దానిలో డబ్బుకి వడ్డీ, లాభం- అలా చక్రవడ్డీలా డబ్బు పెరుగుతోంది. వెంకటసుబ్బయ్యా కూడా బాగా తెలిసినవారికి ఐదురూపాయల వడ్డీకి అప్పులిస్తున్నాడు.

ఇస్రాయేల్‌పని మామూలుగానే ఉంది. అతడి సంపాదన తిండికి, బట్టకి లోటు లేకుండా గడుస్తుంది. అతడి దగ్గర డబ్బు చేరే అవకాశమే లేదు.

శేషయ్య పరిస్థితి అంతంత మాత్రంగా వుంది. ఈసారి రాజమ్మకు పాలుపడకపోవటంతో పసిపిల్లాడికి పాలు కొనాల్సిన అవసరం వచ్చింది. పైగా ఈ కాన్పులో ఆమె చాలా బలహీనపడటంతో ఆమె పనికి వెళ్లలేకపోయింది. సున్నపు బట్టీ పనులలో రెండురకాల పనులున్నాయి. దానిని గమనించాడు శేషయ్య.

గనులలో అయితే తూటాలతో బండలను పేల్చాక వాటిని తీసి లారీలకెత్తాలి. అది గనపం, పార అవసరమయినపని. బట్టీ దగ్గర పెద్ద పెద్ద పచ్చి సున్నపురాయిని చిన్న ముక్కలుగా కొట్టాలి. దానికి మలాటు వాడాల్సి వుంటుంది. దానికీ అనుభవం కావాలి.

ఇక బట్టీల పనిలో మెట్లపై నిలబడి బొచ్చెలతో రాళ్లు, బొగ్గు పైకి చేర్చాలి. దానికి బాలెన్స్, చురుకుదనం, నైపుణ్యత అవసరం. అయితే బట్టీపని తొమ్మిదింటికి మొదలై పన్నెండింటికి అయిపోతుంది. మిగతా సమయమంతా ఖాళీనే.

ముందు గనిలో ప్రారంభించి చివరకు బట్టీ పనికి చేరాలని మనసులో అనుకున్నాడు శేషయ్య.

ఇస్రాయేల్ రికమెండేషన్‌తో ముందు గని పనిలో చేరాడు శేషయ్య. కొంచెం శ్రమ అనిపించినా అది కాంట్రాక్టుపని. టన్ను రాయి ఎత్తితే 10 రూపాయలు ఇస్తారు. ఒక్కోముఠాలో ఇరవైమంది వుంటారు. ఆరోజు ఎన్ని టన్నుల రాయి కొట్టారో లెక్క చూసుకొని కూలి సమానంగా పంచుకుంటారు. రోజుకి పాతికనుండి ఏభైవరకు చేసిన పనిని బట్టి కూలి అందుతోంది. కాని అది వడ్డెరలు మాత్రమే చేయగల పని. రైతుకూలీ ఆ పనిచేయటం చాలా కష్టం. అయినా తప్పదుకదా!

★ ★ ★

సరిగ్గా వారం తరువాత సుబ్బారావుని కలిశాడు ప్రకాష్. అన్నీ తన పేరుమీదే ఉండే ఒప్పందంతో అతడికి సగంవాటా ఇవ్వటానికి అంగీకరించాడు సుబ్బారావు.

మరునాడే ఇద్దరూ బయల్దేరి గుంటూరు వెళ్ళారు. 'శ్రీమతి వరలక్ష్మి కనకదుర్గ లలితా చౌడేశ్వరీదేవి లైమ్ ప్రోడక్ట్స్' అని ఫర్మ





రిజిష్టర్ చేయించారు. అదేరోజు వరలక్ష్మీదేవి మేనేజింగ్ పార్టనర్‌గా, జయప్రకాష్ సగం వాటాదారుడుగా ఎగ్రిమెంట్ కూడా రిజిష్టర్ చేయించారు.

ఆరోజు మొదటిసారిగా జయప్రకాష్‌కి తన డబ్బుతో పలావు పెట్టించాడు సుబ్బారావు. ఖర్చులుపోను మిగిలిన డబ్బంతా ఫర్మ్‌పేర బ్యాంకులో డిపాజిట్ చేశారు. చెక్‌పవర్ వరలక్ష్మిదే.

తిరిగి గ్రామానికి రాగానే ఊరిచివర చిన్న గది అద్దెకు తీసుకుని ఫర్మ్‌బోర్డు తగిలించారు. ఆఫీస్ ఫర్నిచర్, ఫోన్ ఏర్పాటుచేశారు. కాని దానిలో పనిచేసేవాళ్లు ఎవరూ లేరు.

"ఇక అసలు పని మిగిలింది. మన సున్నపు బట్టీకి ఏంపేరు పెడదాం?" అన్నాడు జయప్రకాష్ ఆఫీస్‌లో కూర్చుని.

"మామూలే- నా భార్య పేరు'' అన్నాడు సుబ్బారావు.

"వద్దు... దానివలన చిక్కులొస్తాయి. ఎందుకంటే మనం నిజంగా బట్టీ కట్టం కనుక..."

"మరే పేరు పెడదాం?"

"మా ఇంటి దగ్గర చిన్న కుక్కపిల్ల వుంది. గజ్జిదే. అయినా చాలా విశ్వాసం కలది. నేనేనాడూ దానికి ఏదీ పెట్టకపోయినా నా ఇంటి దగ్గరే పడుంటుంది. ఏవీ పెట్టకపోతే ఆ జీవి ఏమైనా అనుకుంటుందేమోనని దానికి 'దిల్‌వాలా' అనిపేరు పెట్టాను. నోరు తిరగక చుట్టుపక్కల పిల్లలు దానిని 'దివాలా'అని పిలిచేవారు. అది నిన్ననే భవబంధాలన్నీ తెంచుకుని వెళ్లిపోయింది''

"దాని ఆత్మశాంతికి రెండు నిముషాలు మౌనంగా నిలబడదామా?" ఆసక్తిగా అడిగాడు సుబ్బారావు దాని మరణానికి చింతిస్తూ.

"అది వద్దు. దాని పేరు మన బట్టీలకు స్మృతిగా పెట్టుకుందాం"

"అంటే?"

"దివాలా సున్నపు బట్టీస్ అని పేరెడదాం"

"సరే..." తన పార్టనర్ మనసు నొప్పించటం ఇష్టంలేక అన్నాడు. "అంతేకాదు దాని ఫొటో వుంటే బోర్డుపై పెయింట్ చేయిద్దాం" సానుభూతిగా అన్నాడు.

"పేరు నిశ్చయమైంది గనుక ఇక అసలు పని ప్రారంభిద్దాం"

"ఏమిటి?"

"రైల్వే స్టేషన్‌కి ఆనుకుని రెండెకరాల బంజరుభూమి వుంది. రెండెకరాలు వెయ్యి రూపాయలకి వస్తాయి. అయితే ఎకరం నలభైవేల రూపాయల వాల్యుయేషన్‌లో ఫరం పేర దానిని రిజిష్టర్ చేయించాలి. పార్టీతో నేను మాట్లాడాను ఆ పని మీరు కానివ్వండి''

నాలుగో రోజుకు రిజిష్టర్ చేసి తెచ్చాడు సుబ్బారావు. ఆరోజే దానికి డి నెంబర్ వేయించి ఆఫీస్‌లో ఇ.సి. కూడా తీసుకొచ్చాడు.

"రేపటినుండి మన బిజినెస్ మొదలవుతుంది. పాతికవేలు కాష్ తీసుకుని రండి'' చెప్పాడు జయప్రకాష్.

సుబ్బారావు నిద్ర లేచేసరికి అద్దెకారులో అతడి ఇంటికి వచ్చాడు జయప్రకాష్. సుబ్బారావు కార్లో ఎక్కగానే కారు కదిలింది.

"గుంటూరుకి కారు ఎందుకు? బస్‌లో పోతే పోదా?" అన్నాడు సుబ్బారావు.

"బిజినెస్‌లో 'షో' అవసరం. మీరు చూస్తుండండి''

గుంటూరులో మూడు నక్షత్రాల హోటల్లో ఏసీ రూం తీసుకున్నాడు జయప్రకాష్. డబ్బులన్నీ సుబ్బారావే కడుతున్నాడు మనసు గిలగిలలాడిపోతున్నా. మళ్ళీ స్నానాలుచేసి, మేకప్ చేసుకొని బయల్దేరారు పార్టనర్స్ ఇద్దరూ.

కారు ఆంధ్రప్రదేశ్ ఖాదీ మరియు గ్రామీణ పరిశ్రమాభివృద్ధి మండలి కార్యాలయంముందు ఆగింది.

సఫారి సూట్ వేసుకున్న జయప్రకాష్, విఐపి బ్రీఫ్ చేతిలో పట్టుకుని హుందాగా

లోనికి నడిచాడు. అనుసరించాడు సుబ్బారావు.

సరాసరి సూపర్నెంట్ దగ్గరకు వెళ్ళి, గ్రామంలో సున్నపు బట్టీ కట్టటం కోసం లోను అప్లికేషన్, బట్టీ బ్లూప్రింట్లూ, ఫర్మ్ రిజిస్ట్రేషన్ కాగితాలు ఇచ్చాడు.

సూపర్నెంట్ అప్లికేషన్ చూడకుండానే "హామీ ఇవ్వగలరా?" అని అడిగాడు.

"ఆ... పది లక్షల రూపాయల హామీ'' రిజిస్ట్రార్ ఆఫీస్నుండి తెచ్చిన ఇ.సి. ఇచ్చాడు. తలవూపి అప్లికేషన్ పక్కన పెట్టాడు సూపర్నెంట్.

"ఎంత లోను కావాలి?"

"మూడు లక్షలు..."

"మరి నాలుగోవంతు డబ్బు కడతారా?"

"ఎనభైవేల రూపాయలకు స్థలం కొనేశాం" దస్తావేజులు తీసి చూపించాడు జయప్రకాష్.

"లోన్ శాంక్షన్ చేయవచ్చు. మీకు ఏభైవేలు సబ్సిడీ కూడా వస్తుంది''

నోరు తెరిచాడు సుబ్బారావు.

"తెలుసు'' అన్నాడు జయప్రకాష్.

"నేనూ, అయ్యగారూ కలిసి వచ్చి సైట్ చూస్తాం. లోన్ తప్పక శాంక్షన్ అవుతుంది. వర్రీ కావద్దు'' విష్ణుమూర్తిలా అభయమిచ్చాడు.

"కాని..." నసిగాడు సూపర్నెంట్.

"చెప్పండి. మీరు శ్రమ తీసుకుని అక్కడ దాకా రావటం ఎందుకు సార్. మీకు కావలసిన కాయితాలన్నీ ప్రొడ్యూస్ చేశాం. ఎంత త్వరగా వీలయితే అంత త్వరగా లోన్ శాంక్షన్ చేయించండి. మీ కష్టాన్ని మేం మర్చిపోం"

"అలానే... అలానే... కాని..."

"చెప్పండి'' తాపీగా కుర్చీలో వెనక్కువాలి అన్నాడు జయప్రకాష్.

"నాకు పదివేలు. అయ్యగారికి పదివేలు. మీకు ఏభైవేల సబ్సిడీ కూడా వచ్చేట్లు చేస్తాం"

"అదేమిటి?" గుసగుసగా అడిగాడు సుబ్బారావు. "వారికి లంచాలు..." మెల్లిగానే చెవికొరికి వెనక్కువాలి, ఒళ్ళు విరుచుకుని, "మరోమాట చెప్పండి సార్. మన సంబంధం ఇంకా చాలాకాలం సాగుతుంది''

"-సరే నాకు పదివేలు. అయ్యవారికి తొమ్మిదివేలు''

"ఊహుఁ"

"నాకు పదివేలు. అయ్యవారికి ఎనిమిది వేలు''

"మరోమాట చెప్పండి''

"నాకు పదివేలు. అయ్యహారికి ఆరువేలు''

"నేను చివరిమాట చెబుతాను. మీకు పదివేలు అయ్యవారికి ఐదువేలు''

"సరే... మీ ఇష్టం. మీకు తెలియందేముంది'' నవ్వాడు సూపర్నెంట్. సుబ్బారావుకి సైగ చేశాడు డబ్బు ఇవ్వమని. అతడు సూట్కేస్ తెరిచి పదిహేనువేలు ఇవ్వబోయాడు.

"ఊఁ" వారించాడు జయప్రకాష్. "ఇది మీ ఆఫీస్ కాదు డైరెక్టుగా తీసుకోటానికి. ఆఫీసర్గారు చాలా స్ట్రిక్ట్. టేబుల్ కిందవున్న చెత్తబుట్టలో వేయండి''

అలానే వేశాడు సుబ్బారావు ఆశ్చర్యపోతూ.

"రెండ్రోజుల్లో మీ ఫైల్ అప్రూవ్చేసి పంపుతాం..." సూపర్నెంట్ అన్నాడు.

"అంతా మీ దయ..." వినయంగా సమస్కరించి లేచాడు జయప్రకాష్ రెండు చేతులూ జోడించి.

బయట కార్లో కూర్చోగానే అడిగాడు సుబ్బారావు. "పదిలక్షల ఆస్తికి సెక్యూరిటీ ఎక్కడిది?" అని.




"చిదంబర రహస్యం" చెవిలో చెప్పాడు. "మనం కొన్న రెండెకరాలు, రైల్వేస్టేషన్ ఒకే డి నెంబర్‌లో వున్నాయి. అందుకని అంత రేటు పడింది. దానికి కరణంగారు, రిజిష్టర్ ఆఫీస్ క్లర్క్కు సాయం చేశారనుకో. దాని ఖర్చు ఐదొందలు ఇటివ్వండి''

సుబ్బారావు డబ్బు తీసి ఇచ్చాడు.

"పనయిందికదా. ఇక ఇంటికి వెళదామా?"

"వద్దు. స్టార్ హెూటల్లో, ఏసీ రూంలో నీలి సినిమాలు చూస్తూ, మందు కొడుతూ, చికెన్ తందూరి తింటే వుండే మజా మీరు నేర్చుకోవాలి. ఎందుకంటే నాలుగైదు నెలల తరువాత మనం ఉండాల్సింది వాటిలోనే. పోతే ఇదంతా ఫర్మ్ ఖర్చులోనే వ్రాయండి''

సుబ్బారావు తలూపాడు.

మందు కొడుతూ అన్నాడు సుబ్బారావు. "తప్పుడు హామీ ఇచ్చాంకదా? బయటపడితే మనలను బొక్కలో తోస్తారేమో ?"

"ఇది సర్వసాధారణం. లోన్ తిరిగి కడుతూవుంటే హామీని గురించి అసలు విచారించరు. మీకు తెలీదేమో చాలామంది బ్యాంక్ మేనేజర్లు డమ్మీ దస్తావేజులతో, లక్షలలో బేనామీ పేర్లతో అప్పులు తీసుకుంటారు. గిల్టునగలు పెట్టి గోల్డులోన్ తీసుకుంటారు. అప్పు తీర్చేసి పాతరైతుల పాత ఫొటో స్టాట్ దస్తావేజులు పెట్టి 'క్రాప్ లోన్' తీసుకుంటారు. ఇవన్నీ అందరికీ తెలిసిన రహస్యాలే'

"ఏమో నాకు భయంగా వుంది''

"భయపడకు. ఇది వ్యాపారసూత్రం. వ్యాపారంలో మోసం తప్పదు. దానికి గుండె కావాలి. అది నాకుంది. చేయించేవాడిని నేను. చేసేవాడివి నీవు'' అర్జునునికి కృష్ణుడు గీతా బోధ చేసినట్లుగా చెప్పాడు జయప్రకాష్.

"ఏమో? అంతా ఆ ఏడుకొండలవాని దయ" చేతులెత్తి నమస్కరించాడు సుబ్బారావు 'శుభమస్తు' ఆశీర్వదించాడు జయప్రకాష్.

సరిగ్గా వారంరోజులలో పునాదులకు బేస్మట్టానికి 75 వేల రూపాయలకు చెక్ వచ్చింది. దానిని పట్టుకుని జయప్రకాష్ దగ్గరకు పరిగెట్టాడు సుబ్బారావు.

దాన్నందుకుని చిద్విలాసంగా నవ్వాడు జయప్రకాష్.

"ఈ మొత్తం డబ్బు ఫర్మ్ పేర బ్యాంక్‌లో ఫిక్స్‌డ్ డిపాజిట్ వేయండి''

"పోనీ- నా డబ్బు నేను తీసుకోనా?"

"వద్దు నేను చెప్పినట్లు వినండి. వినకుండా మీ ఇష్టం వచ్చినట్లు చేశారో మీరే పూర్తిగా కూరుకుపోతారు''

"అలాగే'' తన డబ్బు తన ఫర్మ్ పేరనే ఫిక్స్‌డ్‌లో వుంది కనుక ఇక భయపడటం దేనికి. జయప్రకాష్ చెప్పినట్లే చేశాడు.

మరుసటి నెలలో 'సైట్' చూడటానికి వస్తున్నట్లుగా విలేజ్ ఇండస్ట్రీస్ వారినుండి ఉత్తరం వచ్చింది. సుబ్బారావుకి వణుకు పుట్టింది. ఏం చేయాలో పాలుపోలేదు. మళ్ళీ జయప్రకాష్ దగ్గరకు పరుగెత్తాడు.

జయప్రకాష్ బాగా ఆలోచించాడు. అప్పుడే కడుతున్న ఒక సున్నపు బట్టీని అద్దెకు మాట్లాడాడు. దానిమీద కేవలం 'దివాల సున్నం బట్టీస్' అని బోర్డు పెట్టినందుకు రోజుకు ఐదొందలు అద్దె. పదిరోజులకు తీసుకున్నాడు జయప్రకాష్.

ఆఫీసర్, సూపర్నెంట్ జీప్‌లో వచ్చారు. వారిని ఏ.సీ. వున్న ఇంట్లో దించి, కార్లో సైట్‌కి తీసుకెళ్ళాడు జయప్రకాష్. వారు 'దివాల సున్నపు బట్టీస్' బోర్డు దగ్గర తిరుగుతుండగా ఒక రీలు కలర్ ఫొటోలు తీయించాడు. తిరిగిరాగానే ఒక సూట్‌కేస్‌లో పదివేల రూపాయల డబ్బుతోపాటు నాటుకోడి పలావ్, నల్ల గుర్రాల విస్కీసీసా పంపాడు.

వారంలో మళ్ళీ లక్షరూపాయల చెక్ వచ్చింది. దానిని తీసుకుని జయప్రకాష్

దగ్గరకు పరుగెట్టాడు సుబ్బారావు. దానినీ మూడేళ్లకు ఫిక్సడ్ డిపాజిట్‌లో వేయమని సలహా చెప్పాడు జయప్రకాష్. ఇప్పుడు ఆఫీస్‌లో ఎమ్.డి.సీట్‌లో జయప్రకాష్ కూర్చుంటుంటే, ఎదురుసీట్లో కూర్చుంటున్నాడు సుబ్బారావు.

మళ్ళీ ఆఫీసర్స్ ఫైనల్ విజిట్ వచ్చింది. ఈసారి పూర్తి కాబోతున్న బట్టీని పదిరోజులకు అద్దెకు తీసుకుని బోర్డు పెట్టించాడు. ఈసారి ఆఫీసర్లతో ఏకంగా వీడియోనే తీయించాడు. మళ్ళీ సూట్‌కేస్‌లో పదివేల నగదు, నల్లగుర్రాల విస్కీసీసా పెట్టి ఇచ్చాడు జయప్రకాష్.

నెలరోజుల్లో చివరి లక్షరూపాయల చెక్ వచ్చింది. తీసుకొని జయప్రకాష్ దగ్గరకు వెళ్ళాడు.

"ఇప్పుడు మన ఫర్మ్‌కి ముప్పైవేల లాభం వచ్చింది. నా వాటా పదిహేనువేలు ఇచ్చి నీ వాటా పదిహేను వేలు తీసుకుని, మిగతాది ఫిక్సడ్ డిపాజిట్ చెయ్''

"బాగానే వుందిగాని, నా పెట్టుబడి ఏది?" అనుమానంగా అడిగాడు సుబ్బారావు.

"బ్యాంక్‌లో వున్న ఫిక్సడ్ డిపాజిట్‌పై వడ్డీ అంతా నీదే. మూడేళ్లపాటు వడ్డీ నీవు తీసుకుంటే- నీ అసలు నీకు వచ్చేస్తుంది... మూడేళ్ల తరువాత ఆ డబ్బంతా తిరిగివారికి కట్టేద్దాం"

"బావుంది. మరి వ్యాపారమేమిటి?"

"అదే వ్యాపారం. ఇప్పటివరకు మన డబ్బు పైసా పోకుండా వాళ్ళ డబ్బే మన దగ్గర వుంది. ఇకనుండి నల్లబంగారం వ్యాపారం మొదలవుతుంది. నెలకు కనీసం ఇరవైవేల లాభం ఉంటుంది. అది చెరిసగం..."

"అదెలాగ?"

"అదే ఈ బిజినెస్‌లో అసలు రహస్యం. ఇప్పుడు ఖాదీ బోర్డు ద్వారా బొగ్గు పర్మిట్‌కి అప్లై చేద్దాం. మేనేజ్ చేస్తే నెలలో పర్మిట్ వస్తుంది. అంటే మనకు టన్ను 300 రూ.ల చొప్పున బొగ్గు సింగరేణి కాలరీస్‌నుండి వస్తుంది. మనకు బట్టీ లేదు గనుక బొగ్గుపని లేదు. బొగ్గు బ్లాక్‌రేటు 700 రూ.లు వుంది. లారీకి 10 టన్నుల బొగ్గు వస్తుంది. అంటే నాలుగువేలు మిగులు. ఖర్చులు పోను కనీసం మూడువేలు మిగుల్తాయి. నెలకు కనీసం పది లారీలు బొగ్గు మనకు సప్లై వస్తుంది. అంటే ఎంత లాభమో అర్థమయిందిగా. అవన్నీ నేను చూసుకుంటాను. ఇక బిజినెస్‌లో చివరిపార్టు మిగిలింది''

"ఏమిటది?"

"పార్టనర్‌ని మోసం చేయటం"

"నన్ను మోసం చేస్తావా?"

"ఊహుం... నీవే నన్ను మోసం చేస్తావు. ఎందుకంటే ఇక జరిగేదంతా జీరో బిజినెస్. దీనికి బిల్లులు, చెక్కులు వుండవు. కనుక నీవు డబ్బివ్వకపోతే నేనేం చేయలేను''

"అయితే ఇవ్వను'' హుషారుగా అన్నాడు సుబ్బారావు.

"చెప్పానుగా ఇది బిజినెస్‌లో ఫైనల్ విషయమని. మనం చేసిన పనిలో చాలా లొసుగులు వున్నాయ్. అధికారులు సడన్‌గా చెక్ చేసి మోసం జరిగింది అని గ్రహిస్తే డబ్బు తీసుకోవటమేగాక మీ శ్రీమతిని జైలుకు పంపుతారు. కనీసం ఆరేళ్లు. ఎందుకంటే ఫర్మ్ అంతా ఆమె పేరుమీదే ఉంది గనుక. కనుక నీవు నాకు ప్రతినెలా లాభంలో సగం ఇచ్చినంతకాలం ఈ రహస్యం బయటకు పొక్కదు. పైపెచ్చు ఎవరికీ ఏ హానీ లేకుండా వచ్చినంత డబ్బు రాబట్టుకుని, లోన్ డబ్బులు కట్టేసి, ఫర్మ్ మూసేద్దాం. లేదా నాకు చేయి ఇచ్చావో... మరుసటిరోజే టెలిగ్రాం ద్వారా అన్ని వివరాలతో కంప్లైంట్ పోతుంది''

"బ్లాక్‌మెయిలా?" నవ్వాడు సుబ్బారావు.

"కాదు ముందు జాగ్రత్త... అది లేకుంటే నేను పెట్టుబడి లేకుండా వ్యాపారం ఎలా




చేస్తాను?" నవ్వాడు జయప్రకాష్. "నేనింకోటి కూడా చెప్పాను. పెట్టుబడి పెట్టి వ్యాపారం చేసేవాడు వెధవ అని''

"అవును అది నేను. నేను వెధవనని ఎప్పుడూ ఒప్పుకుంటాను. పక్కనున్న ఫ్రిజ్ లోంచి హాఫ్‌బాటిల్ తీస్తూ అన్నాడు సుబ్బారావు.

జయప్రకాష్ కాగితాలు తీసుకొని వ్రాయటం ప్రారంభించాడు.

* * *

'మహాత్మాగాంధీ బార్ అండ్ రెస్టారెంట్ ఆరోజు చాలా రద్దీగా వుంది. రాత్రి ఎనిమిది గంటల సమయం, బార్‌లో డిమ్‌లైట్లలో పురుగులు కనిపించని సమయం. భుజానికి ఒక జిప్ బ్యాగ్ తగిలించుకొని వచ్చిన ఒక యువకుడు ఆ బార్‌ముందు ఆగి పైకి చూశాడు. చామనఛాయ రంగు శరీరం, ఎర్రని కళ్లు, నల్లని పొట్టి జుట్టు, కొద్దిగా పెరిగిన గడ్డం, కండలు తిరిగిన శరీరం, పైకి మడిచిన స్లాక్ నల్ల పాంట్‌లో టక్ చేశాడు. నీలిరంగు కార్డ్రాయ్ పాంట్ ముడతలతో వింతగావుంది. వెడల్పాటి బెల్టు దాని చివర మెటల్‌తో చేసిన పదునైన ఆయుధం ఉన్నాయి. సరిగ్గా పాలిష్ చేయని బ్రౌన్ కలర్ షూస్ వేసుకొని వున్నాడతను.

బార్‌పైనే మహాత్మాగాంధీ లాడ్జింగ్ అని బోర్డు వుంది. కింద కొంచెం చిన్న అక్షరాలలో 'ఇచ్చట మడత మంచములు, గదులు అద్దెకు లభించును. ఎటాచ్డ్ బాత్‌రూం వున్న రూంలు కూడా కలవు' అని రాసివుంది.

"లాడ్జీ మీదేనా?" బార్ కౌంటర్ దగ్గరకు వెళ్లి అడిగాడతడు. అతని గొంతు కంచు గంటలా మోగుతోంది.

"మాదేసార్' బార్ అతను చెప్పాడు. అక్కడ విస్కీ వాసన గుప్పించి కొడుతోంది. అతడి వెనకే అందంగా అలంకరించిన గాజు అరలలో అందమైన, రంగురంగుల బాటిల్స్ వున్నాయి. కింద ఒకపక్కగా ఎక్సైజ్ సుంకం కట్టని బాటిల్స్ వున్నాయి.

"నాకో రూం కావాలి'' అన్నాడతను.

"ఎందుకు సార్?" వినయంగా అడిగాడు బార్ అతను. "బార్ తీసేవుందిగదు సార్'

"అంటే?"

నవ్వాడు బార్ అతను. "ఇది మామూలు లాడ్జింగ్‌గా ఉపయోగపడదు సార్. ఇది మా కష్టమర్స్‌కే... బాగా ఎక్కువ తాగినవాళ్లు డబ్బుల్లేకుంటే మడతమంచాలమీద, డబ్బుంటే గదిలోనూ పడుకుంటారు సార్. పైన కక్కుకోవటానికి ప్రత్యేకమైన అరేంజ్‌మెంట్ వుంది. వెంటనే క్లీన్ చేయటానికి బాయ్ వుంటాడు. తాగాక ఫామిలీని తెచ్చుకోవాలనిపిస్తే పిలుచుకురావటానికి మా కుర్రాడుంటాడు. బార్ టయిమ్ అయిపోయింతరువాత ఇక్కడ మూసేస్తాం సార్ పోలీసులతో పేచీ ఎందుకని. తరువాత లాడ్జీలో మందు సరఫరా వుంటుంది. మందు తీసుకునేవారికి రూమ్ ఫ్రీ. తరువాత బార్‌కి సెలవులున్న రోజుల్లో కూడా కష్టమర్లకోసం లాడ్జిలోనే మందు సరఫరా చేస్తాం. కష్టమర్స్ తృప్తే మా ధ్యేయం సార్... మీరీ ఊరికి కొత్తగా వచ్చారనుకుంటా'' వివరంగా చెప్పాడు.

"అయితే మందు తీసుకోనివాళ్లకు లాడ్జీ ఇవ్వనంటావ్?"

"అవును సార్... మందు తీసుకోకపోతే ఊళ్లో ఇంకా మంచి లాడ్జీలు వున్నాయి సార్' సవివరంగా చెప్పాడు.

"అయితే హాఫ్ బాటిల్ రమ్ ఇవ్వు'' హిప్ పోకెట్లోంచి వందల కట్ట తీసి ఒక నోటు కౌంటర్‌లో పడేస్తూ అన్నాడు. "లోపల కూర్చోండి సార్... బార్‌లో రూమ్‌లు వున్నాయి''

"అక్కర్లేదు... ఇక్కడే తాగేస్తాను. పైన రూం అరేంజ్‌చేయి'' అన్నాడతడు. అతడికి షుమారుగా ఇరవై, ఇరవై రెండేళ్ల వయసుంటుంది.

బాటిల్ తీసి కౌంటర్లో ఉంచాడు బార్

అతను. కదిలి చిల్లర తీయబోయాడు. "వద్దు... రూం రెంట్‌కి ఉంచుకో' అనేసి బాటిల్ అందుకుని ఎదురుగ్గా వున్న సోఫాలో కూర్చున్నాడు. అక్కడ కూర్చుంటే మెయిన్ రోడ్డు మీద వచ్చే పోయేవాళ్లు కనిపిస్తుంటారు.

బాటిల్ రెండు చేతుల్తో అందుకుని, ముద్దాడి, బాటిల్ తలకిందులు చేసి మూతపై అరచేత్తో కొట్టి, మళ్లీ బాటిల్ తిప్పి ఒక్కసారిగా మూత తీశాడు. బార్‌అతను ఓరగా అతడినే గమనిస్తున్నాడు.

ఒక్కక్షణం కళ్లు మూసుకున్నాడతను.

"తల్లీ నిన్ను దలంచి బాటిల్ చేతన్ బూనితిన్... నీవు నా ఉదరంబందున జొచ్చి, హాయిగా కిక్కిచ్చి, మత్తిచ్చి మమ్మానందింప చేయవే... నిన్నే నమ్మితిన్... నిన్నే వేడితిన్... శరణు... శరణు..." అని ఒక్కసారిగా బాటిల్ పైకెత్తాడు అతడు.

సరిగ్గా రెండు నిముషాల తరువాత ఖాళీ బాటిల్ టీపాయ్‌పైన వుంచాడు. జేబులోంచి ఫిల్టర్ సిగరెట్ తీసి వెలిగించి, "ఇంకో బాటిల్ ఇవ్వు'' అన్నాడు. బాటిల్ తీసుకొని కౌంటర్ లోంచి వచ్చి ఆయనముందు బాటిల్ పెట్టాడు. బెల్ కొట్టి కుర్రాణ్ణి పిలిచి, 'సార్ సామాను లు పైన స్పెషల్ రూంలో వుంచు' అని చెప్పాడు. కుర్రాడు సామాన్లు తీసుకుపోయాడు.

సిగరెట్ తాగాక మళ్లీ బాటిల్ ఖాళీ చేశాడతను. తాపీగా సోఫాలో వెనక్కు వాలి, "ఈ ఊరి పేరేంటి?" అడిగాడు. చెప్పాడతను.

"ఈ ఊళ్లో పని బాగా దొరుకుతుందా?" అడిగాడు.

"ఏ పని సార్?" వినయంగా అడిగాడతను.

"కొట్లాటలు... మర్డర్లు... కాళ్లూ చేతులూ విరిచేయటాలు... అలాటివి''

"జరుగుతాయిగాని సార్... అంత తరచుగా జరగవ్''

"అయితే నాకు పని వుండదన్నమాట... సరే రెండ్రోజులుండి మరో ఊరికి వెళతాను. ఎవరికయినా పని కావాల్సివుంటే నాదగ్గరకు పంపండి'' నెమ్మదిగా స్థిరంగా అన్నాడు.

తరువాత లేచి, నెమ్మదిగా కదుల్తూ చుట్టూ చూస్తూ పై గదిలోనికి వెళ్లిపోయాడతను.

ఒక అరగంట గడిచింది.

ఆరోజు బార్‌లో వెనుక గార్డెన్‌లో రెండు టేబుల్స్‌నిండా దాదాపు పదిమంది కష్టమర్స్ పార్టీ చేసుకుంటున్నారు. తాగే సీసాలకు, చికెన్ ఆర్డర్లకు అంతులేకుండాపోయింది. బిల్ కూడా అంతులేకుండా పెరిగింది. మధ్యమధ్యలో బార్ ఓనర్ వచ్చి వారిని గమనించి వెళుతున్నాడు. జేవురుగడ్డాలు, పద్దెనిమిది ఇరవై మధ్య వయస్కులు, ప్రవర్తనలో బాధ్యతారాహిత్యం గ్రహించాడతను. రోజూ ఎందరో తాగుబోతుల్ని చూసే అతను ఏ తాగుబోతు ఎటువంటివాడో, ఎవరు ఏ టైపో చూస్తేనే చెప్పగలడు.

బిల్లు జాగ్రత్తగా వేసి వాళ్లు కదిలేముందు తనకు చెప్పమని బేరర్‌కి రహస్యంగా చెప్పాడు అతను. ఎందుకంటే వాళ్లు బిల్ పేచేసేవాళ్లలా అనిపించలేదు. బిల్ అంతా జాగ్రత్తగా పరిశీలించి రూపాయో రెండు రూపాయలో తేడా వచ్చిందని పేచీ పెట్టుకుని డబ్బు ఎగగొట్టి పోతారు కొందరు. అలా నాలుగైదు సార్లు జరిగింది కూడా. పోనీ పోలీసుల్ని పిలిపిద్దామంటే వారొస్తే ఆ బిల్ అంతా ఖర్చవుతుంది.

కౌంటర్‌నుండి బిల్ తీసుకున్నాడు రెండు వేల మూడొందలు అయింది. వోనర్‌కి గుర్తు చేసి, బిల్ ట్రేలో పెట్టుకుని తీసుకెళ్లాడు అతను.

"రేపిస్తానని మీ ఓనర్‌తో చెప్పు'' ఒకడు హుందాగా, మహారాజు సేవకునికి ఆజ్ఞాపించినట్లుగా అన్నాడు.

"ఒప్పుకోడు సార్!" వినయంగా అన్నాడు బేరర్.




"ఒప్పుకోక ఏం చేస్తాడు? మాదగ్గర డబ్బు లు లేవు'' వెకిలిగా నవ్వాడు మరో కుర్రాడు. బేరర్ వెళ్లి ఓనర్‌కి చెప్పాడు. అతడికీ కంగారు గానేవుంది.

"సార్! ఇప్పుడే ఒక కష్టమర్ మన లాడ్జిలో దిగాడు సార్. చూస్తుంటే రౌడీలా అగుపడుతున్నాడు. అతన్ని పిలిపిస్తే బిల్ వసూలు చేస్తాడేమో... కాకపోతే వందా రెండొందలు ఇద్దాం" సలహా చెప్పాడు కౌంటర్‌లో కుర్రాడు.

వెంటనే అతడికోసం కుర్రాడిని పంపాడు ఓనర్.

మెల్లగా కిందకు దిగివచ్చాడు ఆ ఆగంతకుడు. పరిస్థితి అంతా వినయంగా వివరించాడు ఓనర్. కావాలంటే రెండొందలు డబ్బిస్తాను అని చెప్పాడు.

నవ్వాడతను. "ఇలాటి చిన్నా చితకా పనులు నేను చేయను. ఆ డబ్బులూ తీసుకోను. నాకీ వూర్లో తెలిసినవాళ్లెవరూ లేరు. మంచి పార్టీని, పనిని చూపెట్టండి చాలు''

గబగబా లోపలకు నడిచాడతను. బేరర్ దూరంనుండి ఆ పార్టీని చూపించి, వణుకుతూ మూలన నిలబడ్డాడు.

'సందట్లో సడేమియా అని బిల్ చెల్లించకుండా కొందరు వెళ్లిపోతారు... వాళ్లను జాగ్రత్తగా గమనించండి...' అని లోనికి నడిచాడతను. సరాసరి వారి టేబుల్ దగ్గరకు వెళ్లాడు.

"ఏరా? తాగి డబ్బుల్లేవనే వెధవ నాయాళ్లు మీరేనా?" గట్టిగా అరిచాడు.

ఆ హఠాత్సంఘటనకు ఉలిక్కిపడ్డారు వాళ్లు. దగ్గరగా వున్న ఒక కుర్రాడి మెడ పట్టుకున్నాడతను ఎడమ చేతితో. అతడి కీళ్లు స్వరపేటిక నొక్కుతున్నాయి. ఊపిరాడక కిందామీదా అయిపోతున్నాడతను. వాళ్లు కోపంతో లేవబోయారు. "ఆగండిరా బచ్చా నాయాళల్లారా... మీరెవరు కదిలినా వీడు చస్తాడు. వీడి చావుకు వున్న సమయం ఒక్క నిముషమే'' ఫట్‌మని ఎడమచేత్తో తలపై కొట్టాడు. ఆ కుర్రాడు టేబుల్‌పై ఆగిపోయాడు. బేరర్‌కేసి తిరిగి 'ఒక ఫుల్ బాటిల్ తీసుకురా'' అన్నాడు. కంగారుగా తెచ్చాడతను. వారేదో చెప్పబోయేంతలోనే టేబుల్‌కేసి మూత పగలగొట్టాడు. విసురుగా విదిలిస్తే ఆ ఆల్కహాల్ అంతా వారందరిమీదా పడింది. పడిపోయిన తమ మిత్రుణ్ణి చూస్తూ ఆగుతున్నారు వారు. నిజానికి వారు బలవంతులూ కాదు, డబ్బున్నవారూ కాదు. కాకుంటే తాగుడువల్ల కలిగే నిర్భయం, తాము ఉన్నతులమనే భావం వారిలో కలిగింది. షాక్ ఇస్తే క్షణాలలో పిరికివాళ్లవుతారు. జేబులోంచి లైటర్ తీశాడు అతడు. సిగరెట్ వెలిగించుకున్నాడు. వాళ్లకేసి చూస్తూ, "మీలో ఇద్దరు వెళ్లి డబ్బు తెండి. గంటలోగా తేకపోతే వీళ్లందరి కాళ్లు చేతులు విరిచేస్తాను. పోలీసు దెబ్బల్లాగా బయటకు కనిపించవవి. కానీ నెలరోజులు మంచం దిగలేరు. దిగినా నడవలేరు. బయటికెళ్లినవాళ్లు ఎవరన్నా మనుషుల్ని తోడు తెచ్చుకున్నారో... వీళ్లందరినీ తగలబెట్టేస్తాను'' గద్దించాడు.

వాళ్లలో వాళ్లు నెమ్మదిగా మాట్లాడుకున్నారు. ఇద్దరు లేచి బయటకు వెళ్లారు. ఆ ఆగంతకుడు తన బెల్ట్ తీసి ఎడమచేతికి చుట్టుకుని ఒక కుర్చీలో కూలబడ్డాడు. బేరర్‌ని పిలిచి "మరో ఫుల్ బాటిల్ తీసుకురా ఈ రెండు బాటిల్స్ కూడా ఈ వెధవల బిల్లులో రాయి''

ఆ కుర్రాళ్లు ముఖాముఖాలు చూసుకున్నారు. ముందు దెబ్బతిన్న వాళ్ల ఫ్రెండ్ టేబుల్ పై తల వాల్చి వున్నాడు. స్పృహ తప్పాడో, చచ్చాడో అర్థం కావటంలేదు. వాళ్ల కాళ్లు గజగజా వణుకుతున్నాయి. నిషా క్షణాలలో దిగిపోయింది.

అతడు ఫుల్ బాటిల్ ఓపెన్ చేసి, ప్రార్థనా గీతం పాడి, సీసా పైకెత్తి తాగుతుంటే వింతగా చూశారతడివేపు. అయితే ఈసారి గటగటా తాగలేదు అతడు. తాపీగా తాగుతున్నాడు.

సరిగ్గా అరగంటలో డబ్బు తీసుకుని వచ్చారు వెళ్లిన కుర్రవాళ్లు.

టేబుల్‌మీద పడున్నతని మెడమీద ఒకటి చరిచాడతడు. ఉలిక్కిపడి లేచి కూర్చున్నాడతను.

"ఇక వెళ్లండి... ఎప్పుడూ గొడవ చేయబాకండి. దొంగలకి, తాగుబోతులకి, వ్యభిచారులకీ నిజాయితీ వుండాలి... అంతేకాదు... నేను మీకు విరోధినేం కాను. మీకేమయినా అవసరమయితే పెద్ద పనులయితే ఇలాంటివి.... నన్ను కలవండి... నేను పైనే లాడ్జిలో వుంటాను'' చెప్పాడు.

బిక్కుబిక్కుమంటూ వెళ్లిపోయారు వారు.

తరువాత ఓనర్ దగ్గరగా వచ్చాడు. "చాలా సాయంచేశారు సార్. మీరు మా లాడ్జీలోనే ఉండండి. డబ్బేమీ కట్టనవసరంలేదు. మందు కూడా ఫ్రీగానే ఇస్తాం. భోజనం కూడా బార్‌లోనే చేయండి సార్' అతడి చేతులు పట్టుకుంటూ అన్నాడు.

మాట్లాడకుండా తన గదికి వెళ్లిపోయాడతడు. తరువాత అరగంటకు ఆ బార్‌లోని ఫోన్ ఎడతెరపి లేకుండా మోగసాగింది. ఫోన్ చేస్తున్నది మిగతా వైన్‌షాపుల ఓనర్లు. అవి పేరుకు వైన్ షాపులే అయినా బార్‌లలాగే రన్ అవుతాయి అధికారులకు మామూళ్లతో.

జరిగిన విషయం అడిగి ఆ ఆగంతకుడి ధైర్యాన్ని మెచ్చుకున్నారు వారు. అతడిని అక్కడే వుంచమనీ షాపుకు నెలకు ఐదు వందల చొప్పున ఇస్తామనీ, ఇలాటి గొడవలొస్తే చూసుకొంటే చాలనీ అడిగారు వారు. తరువాత అసోసియేషన్‌వారు కూడా. అలాగే మాట్లాడతానన్నట్లు చెప్పాడు బార్ ఓనర్. వైన్ మర్చంట్స్ అసోసియేషన్‌వలన వాళ్ల వ్యాపారపరమైన రక్షణకన్నా వేరే లాభం మరొకటి వుంది. ఆంధ్రరాష్ట్రంలో ఎక్కడయినా పదిరూపాయలకే వచ్చే ఆల్కహాల్ రేటు పధ్నాలుగు రూపాయలుంటుంది. అది ఏ షాపులోనయినా ఆ వూరి మొత్తంలో అదేరేటు ఉంటుంది. అదీ దానివలన వారికి కలిగే ప్రత్యేక సదుపాయం!

ఏది ఏమైనా మరునాటికి అతడి విషయం ఊరంతా తెలిసిపోయింది. అప్పటినుండీ అతడికోసం ఫోన్స్ రాసాగాయి.

మరునాడు రాత్రి అతడి గదికి వెంకటేశ్వరరావు వచ్చాడు. అతడు ఊరిలో బాగా డబ్బున్నవాళ్లలో ఒకడు. అతడికి రెండు ఆటో ఫైనాన్స్ కంపెనీలు, ఒక ఎంప్లాయిస్ ఫైనాన్స్, మరో జనరల్ ఫైనాన్స్ కంపెనీ వున్నాయి. అతడికి చివరి రెండిటివల్ల పెద్ద గొడవలుండవుగాని మొదటివాటివలననే గొడవలు ఉన్నాయి.

సెకండ్‌హాండ్ కార్లు కొనుక్కోవటానికి బ్యాంక్‌లు తదితర ఆర్థిక సంస్థలు ఆర్థిక సాయం చేయవు. అందుచేత ప్రైవేట్‌వారి మీద పడతారు వారు. చిన్న డొక్కు వాన్ కొనుక్కుని, అది గూడ్స్‌వాన్ అయినా ప్యాసింజర్లను ఎక్కించుకుని తిప్పుతుంటారు. అలాటివారికి ఈ ఆటో ఫైనాన్స్ డబ్బు ఇస్తుంది.

అద్దెకు తిప్పుకునేందుకు ఒక పోలీస్ కారుకి అప్పు తీసుకున్నాడు. పాసింజర్లను తోలే బండ్లయితే రోజువారి కిస్తీ మూడు రూపాయల వడ్డీతో కట్టాలి. చిన్నకార్లకుమాత్రం నెలకోసారి కట్టాలి. కష్టమర్లకు అర్థంకానిదేమంటే, వారు మూడు రూపాయల వడ్డీ కడుతున్నట్లే వుంటుంది కాని నెలకు వందకు పదిహేను రూపాయల వడ్డీ పడుతుంది!

కారుకోసం అప్పు తీసుకున్న పోలీసు నెలవారీ కిస్తీలు కట్టటం మానేశాడు. అదే మామూలు కష్టమర్ అయితే కారు తెచ్చి ఫైనాన్స్ కంపెనీముందు పెట్టుకుని, అతడిని పోలీస్ లాకప్‌లో వేయించి చావగొట్టిస్తారు. డబ్బు కట్టటమో, వారే కారునమ్ముకుని వచ్చిన డబ్బుకాక, ఇతర ఆస్తిగాని వుంటే దానినీ అమ్మించి డబ్బు వసూలు చేస్తారు! దానిలో పోలీసుల మామూలు కూడా

వుంటుంది.

కానీ ఇక్కడ కష్టమర్ పోలీస్ అయ్యాడు. ఇతని కేసులో ఆ పద్ధతి పనిచేయదు. ఇతర త్రా పనిచేయిస్తే అతడు కేసుపెట్టి, రైడ్ చేయించి, ఖాళీ ప్రోనోట్లు వందలాదిగా స్వాధీనం చేసుకోగలడు! అందుకనే సహజంగా పోలీసువారికి లోన్స్ ఇవ్వరు వారు. మామూళ్లు ఇస్తారు అంతే!

డిపార్ట్‌మెంట్ అండ వుంటుందికదా అని తొందరపడి లోన్ ఇచ్చాడతను. ఇపుడు వసూలు చేసుకోవటం కష్టంగా వుంది.

అంతా ఆ ఆగంతకుడితో వివరంగా చెప్పాడు వెంకటేశ్వరరావు. ఆ లోన్ కనుక కట్టిస్తే పదిహేను వేలు ఇస్తానని చెప్పాడు.

"ఇది పోలీసులతో వ్యవహారం కదా? ఇరవై వేలవుతుంది. పదివేలు ఎడ్వాన్స్ ఇవ్వండి. ఎలా ఇస్తానో ఏం చేసుకుంటానో మీకు చెప్పను. మీకు నాలుగు రోజుల్లో మీ అప్పు వడ్డీ ఎనభైవేలిస్తాను..."

"సరే"నని తల వూపి డబ్బు ఎడ్వాన్స్ ఇచ్చి వెళ్లిపోయాడు అన్ని వివరాలూ ఇచ్చి. మరునాడుదయం జీన్స్ వేసుకుని, బాగ్ తగిలించుకుని లాడ్జీనుండి బయటకు వచ్చాడు అతడు.

మెయిన్‌రోడ్‌లో చుట్టూ చూసుకుంటూ నడుస్తున్నాడు. ఓ ధనవంతుని, విలాసవంతమైన కొడుకులా కన్పిస్తున్నాడతడు. ఏడు కొట్ల సెంటర్‌లో వరుసగా వున్న అద్దెకార్లు వాటి నెంబర్లు గమనిస్తూ అడుగులేస్తున్నాడు.

"సార్ టాక్సీ కావాలా?" అడుగుతున్నారు డ్రైవర్లు. తను గుర్తుపెట్టుకున్న నెంబర్ కారు కనిపించగానే ఆగాడు. "సార్ కారు కావాలా?" డ్రైవర్ ముందుకు వచ్చి అడిగాడు.

"ఊc... గుంటూరు వెళ్లి సాయంత్రానికి తిరిగి రావాలి. ఏమిమ్మంటావ్?"

"నూట ఇరవై, పెట్రోలు, డ్రైవర్ బేటా సార్"

"వంద ఇస్తాను... ప్లస్ మిగతావి..." ముందుకు కదులుతూ అన్నాడతను.

"రండి సార్... వినయంగా డోర్ తెరుస్తూ అన్నాడు డ్రైవర్.

వెనుక సీట్లో కూర్చున్నాడు అతను. కారు కదిలింది. పెట్రోల్‌బంక్‌లో పెట్రోలు పోయించుకొని, ఓనరయిన కానిస్టేబుల్‌కి ఫోన్‌చేసి బాడుగ గురించి చెప్పి వచ్చాడు డ్రైవర్.

కారు బయల్దేరింది. వెనుకసీట్లో నిద్రపోతున్నాడు అతడు. స్టీరియో ఆన్‌చేసి హుషారుగా పోనిస్తున్నాడు డ్రైవర్.

కారు గుంటూర్లో ఒక హోటల్ లాబీలో ఆగింది. రూం తీసుకున్నాడు అతడు. రిజిస్టర్‌లో ఏదో పేరు రాసి సంతకం చేశాడు. డ్రైవర్ బ్యాగ్ తీసుకుని వెనుకనే రూంలోకి వచ్చాడు.

'కూర్చోమని' చెప్పి గబగబా రెండు మూడు ఫోన్స్ చేశాడు అతడు. డ్రైవర్ వినయంగా నిలబడ్డాడు.

"మనం ఈ రాత్రికి ఉండాల్సి వస్తుందేమో..." రిసెప్షన్‌కి ఫోన్‌చేసి బేరర్‌ని పంపమని చెబుతూ అన్నాడు. "డబ్బు పే చేస్తాను..."

సరేనని తలూపాడు డ్రైవర్. "ఒకవేళ పనయిపోతే సాయంత్రానికి వెళ్లిపోదాం. నా కోసం ఒక మనిషి రావాలి'' చెప్పాడు.

రూం సర్వీస్‌బాయ్ రాగానే రెండు ఫుల్ బాటిల్స్, ఖరీదయిన ఫుడ్ ఐటమ్స్ ఆర్డరిచ్చాడు.

"నేను కింద కార్లో కూర్చుంటాను సార్..." చెప్పాడు డ్రైవర్.

"కాసేపు కూర్చో... వెళుదువుగాని... నాకూ కాలక్షేపం..."

సోఫాలో చివరగా వినయంగా కూర్చున్నాడు.

బేరర్ రెండు ఫుల్ బాటిల్స్, సోడాలు, ఐస్, చికెన్ ఫ్రై పట్టుకొని వచ్చాడు. ఈలోగా

రెండు ఫోన్లు చేశాడు అతడు.

"మందు తీసుకుంటావా?"

"డ్యూటీలో తీసుకోను సార్' వినయంగా చెప్పాడు డ్రైవర్.

"రైట్... ఐ లైకిట్' అన్నాడతను.

బాటిల్ ఓపెన్ చేసి ఒక లార్జ్ పెగ్ తీసుకుని, సోడా కలుపుకుని తాగాడు.

"ఇపుడే వస్తాను'' లేచి బాత్‌రూంలోకి వెళ్లాడతడు. డ్రైవర్ మందుకేసి చూడటం, నోరు తడుపుకోవటం గమనించాడతను.

లోపల షవర్ తిప్పిన శబ్దం వినిపించగానే టెంప్ట్ అయ్యాడు డ్రైవర్. గబగబా గ్లాసునిండా మందు నింపి, సీసాలో నీళ్లు పోసి, ఒకే గుక్కలో తాగేశాడు అతను.

ఇంకా లోపలనుండి షవర్ శబ్దం వినిపిస్తోంది.

కొంచెం వేడి లోపలికెళ్లాక ఇక ఆగలేకపోయాడు డ్రైవర్. మరో గ్లాసు పోసుకొని తాగేసి, మళ్లీ సీసాలో నీళ్లు నింపేశాడు.

తిరిగి ఏమీ ఎరగనట్లు కూర్చున్నాడు.

స్నానం చేసి బయటకు వచ్చాడు అతడు.

"నేను కిందకు వెళ్లి కారులో కూర్చుంటాను సార్' అన్నాడు డ్రైవర్.

సరేనన్నట్లు తలూపాడు అతడు.

డ్రైవర్ కొద్దిగా తూలుతూ, నడకను తొక్కిపడుతూ కిందకి వెళ్లాడు. ఓపెన్ చేసిన బాటిల్‌ని పరీక్షగా చూశాడు అతడు. డ్రైవర్ ఎంతమందు తాగాడో అంచనావేశాడు.

తాపీగా కూర్చుని చికెన్ తింటూ మందు తాగాడు అతడు. అరగంట తరువాత గది లోంచి బయటకు వచ్చాడు. ఇప్పుడతడు తెల్ల పాంట్, తెల్ల షర్ట్ వేసుకొని వున్నాడు. మధ్య పాపిట తీసి ప్లెయిన్‌గ్లాసెస్ కళ్లజోడు పెట్టుకుని వున్నాడు. గబగబా నడిచి ఎవరూ చూడటంలేదని గమనించాక హెూటల్ వెనుక వేపునుండి బయటకు వెళ్లి తిరిగి మెయిన్‌రోడ్డుమీదకు వచ్చాడు.

తన కార్లో కూర్చుని గురకపెట్టి నిద్రపోతున్నాడు డ్రైవర్. చుట్టూ చూశాడతడు. ఎవరూ కనిపించలేదు. ఠక్కున జేబులోంచి క్లోరోఫాం వున్న జేబుగుడ్డ డ్రైవర్‌ముఖంవైపు వుంచాడు. అరనిముషంలో తల వాల్చేశాడు అతడు.

అతడి జేబులోంచి తాళంచేతులు తీసుకుని, కారు స్టార్ట్‌చేశాడు. కారు వేగంగా కదిలింది. కారు డొంకరోడ్లోకి వెళ్లాక కారాపాడు. ఎవరూ గమనించటంలేదని చూసి డోర్ అన్‌లాక్ చేసి డ్రైవర్ని కిందకు నెట్టాడు. వెంటనే డోర్ వేసుకొని కారు ముందుకి దూకించాడు.

కారు మాయాబజార్‌లోని గేరేజ్‌లోకి వెళ్లింది. లోపలకు వెళ్లగానే గారేజ్ తలుపులు వేయబడ్డాయి.

బైటకు వచ్చి అక్కడున్న ఒకతనితో మాట్లాడాడు అతడు. కారు అరవైవేలకు కొని, నలభైవేలు ఖర్చుపెట్టి అందంగా తీర్చిదిద్దబడింది. ఆ విషయమే చెప్పాడు. స్టాండర్డ్ క్రాంక్‌సైజ్ ఉన్న ఇంజన్. గట్టి బాడీ. అరగంటలో డెబ్భైవేలకు బేరం సెటిల్ అయింది.

అతడు అక్కడే కూర్చుని, బ్యాంక్‌నుండి డబ్బు రావటంకోసం ఎదురుచూస్తున్నాడు. అతడక్కడ కూర్చుని వుండగానే నాలుగు టైర్లు బయటకు వెళ్లిపోయాయి. ఇంజన్ దించేసి ట్రాక్‌మీద వెళ్లిపోయింది. సీట్లు, నెంబర్ ప్లేటు అన్నీ వెళ్లిపోయాయి గంటలో

కాష్ తీసుకుని బయటకు వచ్చాడతడు. ఆటో ఎక్కి ఒక సినిమా థియేటర్ దగ్గర దిగాడు. కాసేపాగి మళ్లీ ఆటో ఎక్కి, హెూటల్ వెనుకకు వెళ్లి ఆ దారిగుండా తన రూంకి వెళ్లిపోయి, మేకప్ మార్చుకొని, తాపీగా మందుకొట్టి పడుకున్నాడు తలుపులు దగ్గరగా వేసి.

సరిగ్గా సాయంత్రం ఆరుగంటలకు వణుకుతూ, మట్టికొట్టుకున్న దుస్తులతో ఆ రూం తలుపు నెట్టాడు డ్రైవర్.




తనని మోసం చేసి అతడే కారు దొంగి లించుకుపోయాడేమోనని అప్పటిదాకా అను మానం ఉంది డ్రైవర్‌కి. అతడు మందుకొట్టి నిద్రపోతుండటం, ఎదురుగ్గా ఖాళీ విస్కీసీసా లు కనిపించేసరికి అతడికి చెమటలు పట్టాయి.

"సార్!" లేపాడు డ్రైవర్.

లేచి బద్ధకంగా వళ్లు విరుచుకున్నాడు అతడు. డ్రైవర్ని చూసి "ఓc నువ్వా... నా పని కాలేదు. మనిషీ రాలేదు. ఒక అర గంటలో ఊరికెళదాం... కారు రెడీచెయ్''

"కారెవరో ఎత్తుకుపోయారు సార్' ఏడుపు ముఖంతో అన్నాడు.

"ఏవిటీ? నువ్వు కార్లో ఉండగానే... కారొ దిలి నువ్వెక్కడికి వెళ్లావ్? వెంటనే పోలీస్ రిపోర్టు ఇవ్వు... అయినా మందు కొట్టిన వాసనొస్తోంది నీ దగ్గర. మందు కొట్టి కారెక్క డయినా వదిలేశావా? నేను పోలీసులకు ఫోన్ చేయనా."

రెండు కాళ్లూ పట్టుకున్నాడు డ్రైవర్.

"సార్... బుద్ధి తక్కువై రెండు పెగ్గులు తాగాను సార్. నిద్ర పట్టింది. లేచి చూసేసరికి డొంకరోడ్లో నేలపై పడున్నాను సార్. మెళు కువ రాగానే పరిగెత్తుకొచ్చాను..."

"ఇదిగో, ఈ కథలు ఎవరికీ చెప్పకు... నమ్మరు... పోలీసులు అసలే నమ్మరు. నీవే కారు ఎక్కడో దాచేసి అబద్ధం చెబుతున్నా వని వాయించేస్తారు... నీవు చెప్పేదాంట్లో నమ్మదగ్గదేమయినా వుందా?"

"మా ఓనరే పోలీసు సార్.. నా చర్మం వలిచేస్తారు..." ఏడుస్తూ అన్నాడు.

"మీ ఓనర్ పోలీసా?? అయితే నీపని అయిపోయినట్లే... నీకు జైలు తప్పదు''

"మీరే కాపాడాల సార్' కాళ్లు పట్టుకుని ఏడుస్తూ అన్నాడు.

"నేనా? నేనేం చేయగలను? నీకు గనుక ఎవరూ లేకుండా వుంటే, ఇంటి దగ్గర ఖరీదయిన వస్తువులు లేకుండా వుంటే పారిపో... మరేదైనా రాష్ట్రం పోయి బతుకు. అంతకుమించి చేయగల్గిందేమీ లేదు''

తలూపాడు డ్రైవర్.

వెంటనే జేబులోంచి ఓ వెయ్యి రూపాయ లు తీసి అతడికిచ్చాడు. నమస్కారం చేసి వడివడిగా వెళ్లిపోయాడతడు.

తాపీగా పడుకుని ఆలోచించాడు అతడు.

ఒక గంట తరువాత కారు ఓనర్‌కి ఫోన్ చేశాడతడు.

"ఏవయ్యా ఏంటిది? నేను సాయంత్రందా కా కారు మాట్లాడుకొని వస్తే మధ్యలో ఎటో వెళ్లిపోయాడు డ్రైవర్'

"లేదుసార్! డ్రైవర్ చాలా మంచివాడు... ఎక్కడికయినా పనుండి వెళ్లాడేమో... కా సేపు చూడండిసార్' వినయంగా చెప్పాడు కానిస్టేబుల్.

"సరే ఒక గంట దాకా చూస్తాను. లేకుంటే వేరే కారులో ఊరికి వస్తున్నాను. ఆ బాడుగ మీరే ఇవ్వాల్సి వుంటుంది'' అనేసి ఫోన్ పెట్టేశాడు.

తరువాత హోటల్ ఖాళీ చేసి, మరో కారు తెప్పించుకుని తిరిగి వూరు చేరాడతడు. రాగానే వెంకటేశ్వరరావుకి ఫోన్ చేశాడు. హడావిడిగా వచ్చాడు అతడు. అరవై వేల రూపాయల కాష్ తీసి చేతిలో పెట్టాడు.

"కానిస్టేబుల్ కారు అమ్మేశాను. అయితే ఎవరికీ తెలియదు. డ్రైవర్ పారిపోయాడు. రెండురోజుల్లో కేస్‌బుక్ అవుతుంది. మీ అస లు మీకు వచ్చింది. పోతే వడ్డీయే కదా? అదీ కావాలంటే ప్రామిసరీ నోట్లను పెట్టుకుని కోర్టులో సివిల్ దావావేయండి. ఏడెనిమిదే ళ్లకు కేసు తేలినా మళ్లీ అసలు వస్తుంది. రూపాయి పావలా వడ్డీతో..." చెప్పాడతడు.

ఆలోచించుకుంటూ వెళ్లిపోయాడు వెంక టేశ్వరరావు. వెంటనే కానిస్టేబుల్‌కి ఫోన్ చేసి తన బాడుగ డబ్బులు పంపమని, డ్రైవర్ రాలేదనీ చెప్పాడు.

హడావిడిగా వచ్చాడు కానిస్టేబుల్. "నేను కారు తీసుకుని గుంటూరు వెళ్లి హొటల్లో దిగాను. సాయంత్రం వరకు అక్కడేవున్నాను. కాని డ్రైవర్ కనిపించలేదు'' వినేసి వెళ్లిపోయాడు కానిస్టేబుల్. అతడు దిగిన హొటల్‌కి ఫోన్ చేసి కనుక్కున్నాడు. రాత్రికి రాత్రే బయల్దేరి గుంటూరు వెళ్లాడు. డ్రైవర్ ఆచూకీ లేదు. అతడు హొటల్ నుండి బయటకు వెళ్లలేదని, రిసెప్షనిస్ట్, సర్వీస్ బాయ్‌లు చెప్పారు. అనఫీషియల్‌గా కారు వెతకమని, డ్రైవర్ని పట్టుకోమని తోటి పోలీసులకు చెప్పి వెనుకకు వచ్చేశాడు కానిస్టేబుల్.

మరునాడు మిగతా ఫైనాన్స్ కంపెనీల వారంతా అతడికి నెలకింతని ఇచ్చేట్లుగా అవసరమైనపుడు వారికి సాయపడాల్సింది గా అభ్యర్థించారు. సరే నన్నాడతడు.

అతడిపేరు, ఊరూ ఎవరికీ తెలియదు.



అందరూ పిలుచుకునే పేరు దాదా. అతడు ఆ వూరికి కాబోయే డాన్.



శ్రీమతి వరలక్ష్మి కనకదుర్గా లలితా చౌడేశ్వరీదేవి లైమ్ ప్రొడక్ట్స్' అనే బోర్డును జేబుగుడ్డతో శుభ్రంగా తుడిచి, ఆఫీస్ తాళం తీసి, టేబుల్ శుభ్రంగా తుడిచి ఎదురు కుర్చీలో కూర్చున్నాడు సుబ్బారావు.

అతడికిదంతా కలా? వైష్ణవమాయా? అనిపిస్తోంది. అసలేమీ చేయకుండానే తన వాటాకు నెలకు పదివేల రూపాయలు రావటం అంటే మాటలా?

జయప్రకాష్ ఎంత తెలివిగలవాడు! అనుకున్నాడు. జయ ప్రకాష్ బుర్ర పాదరసం. తన దగ్గర డబ్బుంది. ఇప్పుడతని దగ్గరా డబ్బుంది. కలిపి ఇంకా పెద్ద వ్యాపారమే చేయవచ్చు. కాని జయప్రకాష్‌తో వచ్చిన చిక్కేమిటంటే అతడు పెట్టుబడి పెట్టడు.

పది నిముషాలలో బుల్లెట్ మోటార్ సైకిల్ వచ్చి అక్కడ ఆగింది. హుందాగా దానిమీద నుండి దిగి స్టాండ్ వేశాడు జయప్రకాష్. ఆ కొత్త బండి నెంబర్ ప్లేట్ మీద శ్రీమతి వరలక్ష్మి అని మెరిసే అక్షరాలతో రాసివుంది. అది ఫర్మ్ తరపునే కొన్నారు. అయితే సుబ్బారావుకి మోటార్ సైకిలంటే భయం గనుక, అది జయప్రకాష్ వాడుతున్నాడు.

“రా గురూ!” గౌరవంగా ఆహ్వానించాడు సుబ్బారావు. హుందాగా లోనికొచ్చి, కూలింగ్ గ్లాసెస్ టేబుల్ మీదపెట్టి, కుర్చీలో కూర్చున్నాడు జయప్రకాష్.

“ఏదో గురూ నీ చలవ వలన రోజూ కడుపునిండామందు, కంటినిండా నిద్ర జరిగిపోతోంది. ఏదో నల్ల బంగారం పుణ్యమా అని ఏదో చీమలాగా కూడబెట్టుకోగలుగుతున్నాను''

చిద్విలాసంగా నవ్వి శిష్యుడి వేపు చూశాడు జయప్రకాష్.

“గురూ పెట్టుబడి లేకుండా నల్లబంగారం నుండి డబ్బు పిండే ఉపాయం చెప్పావ్... ఇక తెల్లబంగారం విషయం చెప్పు గురూ! వీలయితే ఆ వ్యాపారం చేద్దాం”

“నేను పెట్టుబడి పెట్టనుగదా?” అన్నాడు జయప్రకాష్.

“ఎంత అవసరమైనా నేనే పెడతాను గురూ! చెరిసగం వాటాదారులం...”

నవ్వాడు జయప్రకాష్. సిగరెట్ వెలిగించి చెప్పటం ప్రారంభించాడు.

“తెల్లబంగారం అంటే రైతులు అది పత్తే అనుకుంటారు. కాని అది వారికి కొద్దికాలమే బంగారం. తరువాత వారికి అదే ఉరితాడవుతుంది. వ్యాపారంలో తెల్లబంగారం అంటే సున్నం. అది నిజంగా బంగారమే... దీనిలో నష్టపోవటం ఉండదు''

“దాని గురించి వివరంగా చెప్పు'' అడిగాడు సుబ్బారావు.

“సున్నం సున్నపురాయి పచ్చిరాయిని కాల్చగా వస్తుంది. ఈ పచ్చి రాయి గనులలో దొరుకుతుంది. గనులనగానే బొగ్గుగనులో, మరే ఖనిజాల గనులో అనుకోవద్దు. ఇవి ఓపెన్‌మైన్స్. పైనుండి రాయి తవ్వుకుంటూ పోవటమే. దేశం మొత్తం మీద ఉన్న సున్నపురాయిలో మూడోవంతు మన రాష్ట్రంలోనే వుంది. దీనిలో ఎనభై శాతం రాయలసీమలోనే వున్నాయి. కర్నూలు, డోన్ దీనికి బాగా ప్రసిద్ధి. మనవూరి విషయానికొస్తే దగ్గరేవున్న




సీతారాం పురం మైన్స్ చాలా ఏళ్ళక్రిందటే తవ్వకం సాగించాయి. పల్నాడులో సున్న పురాయి, నాప రాయి ఎక్కువ. అందుచేతే మాచర్ల చుట్టుపక్కల నాపరాయి, ఇంటికి పరుచుకునే రాయి వుంది. అక్కడ గనులు అవి. అవేగాక సున్నపురాయి కూడా దొరుకుతుంది. అందుకే మాచర్లలో సిమెంట్ ఫాక్టరీ కట్టారు. పల్నాడులో రెండుమూడు సిమెంట్ ఫాక్టరీలు కట్టే ప్రయత్నాలు జరుగుతున్నాయి.

గనులు అని చెప్పబడే బంజరుపొలాలు వ్యవసాయానికి పనికిరావు. వాటిని 99 ఏళ్ల పాటు తవ్వుకోవటానికి ప్రభుత్వం లీజ్‌కి ఇస్తుంది. ముఖ్యమైన లీజ్‌లు అన్నీ పెద్ద కంపెనీల వారే తీసేసుకున్నారు. కొంచెం నాసిరకం రాయి దొరికే గనులు చిన్నచిన్న వ్యాపారస్తులు లీజ్‌కి తీసుకున్నారు. అయితే ఆరాయి సిమెంట్‌కి, మిగతా కెమికల్ ఫ్యాక్టరీస్‌కి పనికిరాదు గనుక దానిలో రాయి తవ్వరు.

ఇక్కడ చుట్టుపక్కల వుండే గ్రామాల్లో రైతుల పొలాల్లో మంచి రాయివుంది. చిన్నచిన్న వ్యాపారస్తులు ఆ పొలాలని తక్కువ రేట్లకు కొని రాయి తవ్విస్తుంటారు. సిమెంట్ ఫాక్టరీలకు వెళ్లే రాయికి (ముడిరాయి)కి మైనింగ్ డిపార్ట్‌మెంట్‌వారికి సీనరేజి కట్టాల్సి వుంటుంది. అయితే తమది గవర్నమెంట్ గుర్తించిన గని కాదు గనుక, దానిని 'గని లీజ్ ఉన్న వ్యాపారస్తుని గనిలో తవ్వినట్లుగా రాయించి అతడికి టన్నుకు రెండు నుండి పది రూపాయలు ఇచ్చి, 20 రూపాయలు సీనరేజి గవర్నమెంట్‌కి కట్టి, లేబిల్ తయారు చేయించి పంపుతారు. చెక్‌పోస్ట్ వాళ్లను మేనేజ్ చేసుకుంటే ఒక లేబిల్ మీద వంద లారీలు కూడా పంపవచ్చు. అలా సీనరేజ్, గవర్నమెంట్ లీజ్ ఎగగొట్టి డబ్బు సంపాదించవచ్చు.

ఇక గని అదే పొలాల్లో కొట్టేరాయికి కూలీలను నియమించరు. కాంట్రాక్టు ఇస్తారు. పదిపదిహేను మంది ముఠాగా ఏర్పడి రాయి తవ్వుతారు. అలా తవ్వినందుకు వారికి టన్నుకు పది రూపాయల కూలి ఇస్తారు. అలా ఆ కూలీలు రోజుకి ఒక్కొక్కరు కనీసం యాభై రూపాయల వరకు సంపాదించగలరు. పెద్దరాయిని పగల గొట్టటానికి కంప్రెషర్ ఉన్న ట్రాక్టర్స్ ఉంటాయి. వారికి ఎక్స్‌ప్లోజివ్స్ లైసెన్స్ వుంటుంది. కంప్రెషర్‌ద్వారా బెజ్జాలు వేసి మందు పెట్టి పేలుస్తారు. తరువాత రాయిని లారీల కెత్తటమే పని.

ఇక సున్నపు బట్టీల విషయానికి వస్తే బట్టీ ఎత్తు దాదాపు 36 అడుగులు వుంటుంది. దానికి క్రింద వేపు పొయ్యి, రెండు వేపులా తొమ్మిది మెట్లు ఉంటాయి. ఒక్కొక్కటి ఐదు రూపాయలుండే ప్రత్యేకమైన ఇటుకతోబట్టీని కడతారు. దాని ఖరీదు షుమారు 3 లక్షలు అవుతుంది.

ఇక్కడయితే మెట్లున్నాయి కాని, కర్నూలు జిల్లాలో, డోన్‌లో బట్టీలకు మెట్లు వుండవు. స్లోప్‌గా వుండేలా కడతారు వాటిని. అందుకనే అక్కడ బాల కార్మికులు ఎక్కువగా వుంటారు. ఇక్కడ బాల కార్మికులు తక్కువ.

ఇక బట్టీ దగ్గరకు పచ్చిరాయి చేరుతుంది. అక్కడ కొందరు కూలీలు దానిని చిన్నచిన్న రాళ్లుగా పగలగొడతారు. అదీ కాంట్రాక్టు కూలీలే! ఇక బట్టీలో మెట్టుకొకరు చొప్పున నిలబడి క్రిందనుండి పైకి రాయి, బొగ్గు చేరవేస్తుంటారు. పైన నలుగురు నిలబడి బట్టీలో సమపాళ్లలో రాయి, బొగ్గు కలిసేలా లోపలకు వేస్తారు. బట్టీపైన పది అడుగుల వ్యాసార్థం వుండి, మనుషులు నిలబడేందుకు వీలుగా వుంటుంది.

ఒక బట్టీలో ముందుగా రాయి, దానిపై బొగ్గు, దానిపై రాయి ఇలా పాళ్లలో పరుచుకుంటూ వస్తారు. దీనిని పాళ్లలో కలిపేందుకు, సరిగా కాలిందో లేదో తెలుసుకునేందుకు మేస్త్రీ వుంటాడు. అతడికి రోజుకు వంద రూపాయల కూలీ ఇస్తారు. అతడు

నాలుగైదు బట్టీలకు ప్రతిరోజూ పనిచేస్తుంటాడు.

బట్టీలో షుమారుగా 16 టన్నుల పచ్చిరాయి పడుతుంది. దీనికి ఝరియా బొగ్గుగాని, రామ్‌నగర్ బొగ్గుగాని అయితే రెండు టన్నులు సరిపోతుంది. అదే సింగరేణి బొగ్గయితే 5 టన్నులు వేయాలి. అందుకని సింగరేణి బొగ్గు బ్లాకులో అమ్మేసుకుని ఝరియా బొగ్గువాడతారు. బట్టీ అంటించాక క్రిందనుండి కాలుకుంటూ వస్తుంది. మేస్త్రీ చూసి సరిగా కాలిందని నిర్ధారించాక, దంతెలతో సున్నం క్రిందనుండి బయటకు లాగుతారు. పైన మళ్లీ రాయి, బొగ్గు నింపుతారు. అందుకనే బట్టీలలో పని చేసేవారు ఉదయం 7 గంటలనుండి 12 గంటల దాకానే అయినా ఎక్కువ మొత్తంలో కూలి గిడుతుంది. ఇదీ కాంట్రాక్ట్. దీనిలో కూడా ప్రతి కూలీకి ఏభైకి తగ్గకుండా కూలిగిడుతుంది.

ఒక బట్టీకి షుమారుగా పది టన్నుల సున్నపురాయి తయారవుతుంది ప్రతిరోజూ.

ఈ సున్నాన్ని పరిశీలించి గ్రేడ్‌లుగా విభజిస్తారు. ఈ సున్నాన్ని పేపర్ మిల్లులకు, పంచదార ఫ్యాక్టరీలకు, జింక్ ఫ్యాక్టరీలకు, స్టీల్‌ప్లాంట్‌కి ఇతర కెమికల్ ఫాక్టరీలకు అమ్ముతారు. తమకు పడే రేటుకంటే కనీసం నాలుగురెట్లు రేటు వస్తుంది వారికి.

ఇక్కడ కూడా బట్టీల వారి దగ్గర సున్నంకొని, ఫ్యాక్టరీలకు సరఫరా చేసేవాళ్లు అదనంగా వ్యాపారం చేస్తుంటారు.

ఇదికాక, సున్నపురాయిని పొడి చేసే మిల్లులుఉంటాయి. అక్కడ ఆ పొడికి బ్లూ, గమ్ మిక్చర్ కలిపి సెమ్ తయారు చేస్తారు. ఇది ఇళ్లకు పెయింట్ చేసుకోటానికి పనికివస్తుంది.

అలా కాకుండా ఆ పొడికే గమ్, జిప్సం కలిపితే కట్టుబడి సున్నం తయారవుతుంది. దీనిని సిమెంట్‌కి ప్రత్యామ్నాయంగా ఇళ్లు కట్టుకోటానికి వాడవచ్చు. ఇదొక వ్యాపారం.

ఇక బట్టీలో కాల్చుడు బట్టి సున్నం గ్రేడ్ వస్తుంది. బొగ్గు ఎక్కువపడితే చిట్టెం (పాకం) లాగా వస్తుంది. అది బట్టీకి కరుచుకుంటుంది. బొగ్గు తక్కువయితే పచ్చిరాయి మిగులుతుంది. అందుచేత కాల్చుడు విషయంలో జాగ్రత్తగా వుండాలి. ఇక బట్టీలలో వచ్చిన సున్నపుపొడి కూడా వృధాగా పోదు. అది చేపల చెరువులవాళ్లు టన్నుకి మూడొందల చొప్పున కొనుక్కుంటారు. ఇదీ ఇక్కడ జరిగే సున్నపు వ్యాపారం. దీనిలో ఎవరూ ఎక్కడా నష్టపోవటం అంటూ వుండదు. పెట్టుబడికి నాలుగింతల లాభాలు మొదటి సంవత్సరంలోనే వచ్చేస్తాయి. దీనిలో కాయకష్టం చేసి బతకవచ్చు. చేయకుండా బతకవచ్చు. కమీషన్ వ్యాపారం చేసి బతకవచ్చు. కంపెనీలకు తిరిగి ఆర్డర్స్ సంపాదించి వాటినమ్ముకుని బతకవచ్చు. డైరెక్టుగా నిజమైన వ్యాపారం చేసి బతకవచ్చు. లేక మనలాగా అసలు బట్టీలే లేకుండా కూడా డబ్బు సంపాదించవచ్చు. చాలామంది బట్టీలవారు, తమ బట్టీని అద్దెలకు ఇచ్చేసి మనలాగే బతుకుతున్నారు. అంటే ఏమీ చేయకుండానే డబ్బన్నమాట! ఇప్పుడు చెప్పు... ఏ వ్యాపారం చేద్దామంటావు?" అడిగాడు జయప్రకాష్.

"అనధికారపు గని అనధికారికంగా లీజ్‌కి తీసుకుని పచ్చిరాయి అమ్ముకుందామా? లేక బట్టీ అద్దెకు తీసుకుని సున్నపురాయి అమ్ముకుందామా? లేక ఆర్డర్లు సంపాదించి సున్నంకొని అమ్ముకుందామా? లేక ఏదో ఒక బంజరు గని లీజ్‌కి తీసుకుని, రాయి కొట్టినట్లుగా చీటీ రాసిచ్చి డబ్బు చేసుకుందామా? లేదా ఝరియా వెళ్లి మాఫియా గాంగ్‌నుండి దళారీలు కొన్న వేస్ట్ బొగ్గుని మూడొందలకు కొని, లారీ బాడుగ కాక ఏడొందలకు అమ్ముకుందామా?

లేక రాయి మిల్లులో వేసి సెమ్‌గాగాని, కట్టుబడి సున్నంగాగాని అమ్ముకుందామా?

లేక ప్రతి బట్టీకి రెండు ట్రక్కులున్న




ట్రాక్టర్లు, మొత్తంమీద రోజుకు వందలారీలు అవసరమవుతాయి. లేదా అవి కొని వ్యాపారం చేద్దామా? లేక రెండు ఫోన్లు పెట్టుకొని లారీ బ్రోకర్ ఆఫీస్ పెడదామా?

లేక ముప్పై లక్షలలోపైతే స్టేట్ ఫైనాన్షియల్ కార్పొరేషన్నుండిగాని, ఎక్కువయితే ఇండస్ట్రియల్ డెవలప్మెంట్ బ్యాంక్నుండి గాని అప్పు తీసుకొని మిని, మీడియం సైజు సిమెంట్ ఫాక్టరీలు కట్టి. ఉద్యోగాలు అమ్ముకుని తరువాత ఫ్యాక్టరీ సిక్చేసి ఆదాయం పొందుదామా?

చెప్పండి... దీనిలో అసలు పెట్టుబడి లేకుండాగాని లక్షలలో పెట్టుబడి పెట్టిగాని లక్షలకు లక్షలు సంపాదించవచ్చు. టాక్సలు ఎగ్గొట్టి. సీనరేజి ఎగగొట్టి ఇంకా లాభాలు గడించవచ్చు. ఇపుడు చెప్పు సుబ్బారావు! నువ్వు దీనిలో ఎక్కడ ఇముడుతావు? ఏ వ్యాపారం చేస్తావు?" అడిగాడు జయప్రకాష్.

ఫ్రిజ్నుండి బాటిల్ అందుకుని గటగటా తాగేశాడు సుబ్బారావు.

"అబ్బో... ఇన్ని వ్యాపారాలా? ఏం చేయాలబ్బా? అన్నీ చేస్తే ఎలా వుంటుంది? కోట్లు కోట్లు..." గుటకలు మింగసాగాడు. జయప్రకాష్ చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు.

★ ★ ★

1982 శేషయ్య పొద్దునే నిద్రలేచి పందుం పుల్లతో ముఖం కడుక్కుంటున్నాడు. రాజమ్మ వంటచేస్తున్నది. ఇద్దరూ ఏడుగంటలకల్లా తయారై పిల్లలను మరియమ్మ వాళ్ళింట్లో దించి, రైలుగేటు దగ్గర వుండాలి. అక్కడికి వచ్చే ట్రాక్టర్ ఎక్కి 'గని'కి వెళ్లాలి.

పొద్దుటే గేటు బయట నిలబడి పేపర్ బాయ్ కోసం ఎదురు చూస్తున్నాడు వెంకట సుబ్బయ్య. ఇప్పుడాయన దేవసహాయం వాళ్ళింట్లో అద్దెకు ఉండటం లేదు. ఎదురు ఇల్లు కొనుక్కొని వుంటున్నాడు. అది గవర్నమెంట్ కట్టించిన కాలనీ గనుక దానిని ఎవరూ కొనగూడదు. అమ్మకూడదు. రిజిష్టర్ కాదు. దానిని తాకట్టు పెట్టుకోటానికీ వీలులేదు. అందుచేత 99 సంవత్సరాలకు అద్దెకు ఇచ్చినట్లుగా రాయించుకున్నాడు. అదీ చట్టపరంగా చెల్లదుగాని, ఆధారంకోసం దానిని వ్రాయించుకున్నాడు.

వాకిట్లో నిలబడి పేపర్బాయ్ రాగానే పేపరందుకుని అలవాటు ప్రకారం తనకు కావాల్సిన పేజీతిప్పి పెద్దగా చదవసాగాడు. "... బియ్యం మూడు రూపాయలు... నూనె పదకొండు రూపాయలు, పంచదార మూడున్నర. కందిపప్పు పన్నెండు రూపాయలు, టమోట అరవైపైసలు... బంగాళదుంప రెండు రూపాయలు. మటన్ పదిరూపాయలు... ఊ... ఆc... గుడ్డు అరవైపైసలు. పచ్చిమిర్చి రూపాయి..."

"అబ్బబ్బ గట్టిగా చదవబాకండి... ఇంట్లో పచ్చి మిర్చి రూపాయపావలా కమ్ముతున్నాం, పరమేశ్వరి బయటకివచ్చి పేపర్ లాక్కుంది. ఇప్పుడు పరమేశ్వరి భర్తవెంట బండి తోసుకుంటూ బజారుకు వెళ్ళటం లేదు. ఇంటి దగ్గరే చిన్న చిల్లర దుకాణం పెట్టింది. ఊళ్లోని హెూల్సేల్ దుకాణంలో సరుకులు తెచ్చి కిలోకు పావలా ఎక్కువేసుకుని, అరువైతే అర్ధరూపాయి ఎక్కువ వేసుకుని అమ్ముతుంది. దానికితోడు పెద్ద మార్కెట్కి వెళ్ళి కూరగాయలు కూడా తీసుకొచ్చి అమ్ముతున్నది. ఇప్పుడు బండి వెంట వెంకటసుబ్బయ్య వెళ్ళినా పనిచేయటంలేదు. సరుకు చేయటానికి వంటమాష్టర్ని పెట్టుకున్నాడు. బండి తోసుకుపోవటానికి ఒక కుర్రవాడిని పెట్టుకున్నాడు. పిల్లలను స్కూలులో చేర్పించాడు. గల్లాపెట్టి దగ్గర కూర్చుని డబ్బులు మాత్రం వసూలు చేస్తున్నాడు.

అసలు బండి మానేసి, ఒక హెూటల్ పెట్టాలనే ఉద్దేశం అతడికి ఎప్పుడో వచ్చేసింది. వీలయినప్పుడల్లా సెంటర్లో చిన్న ఇల్లు కోసం ప్రయత్నం చేస్తూనేవున్నాడు.

హోటల్ పెట్టినా ఆ బండిని వదులుకోవటం అతడికి ఇష్టంలేదు. తమ చుట్టాలబ్బాయే ఒకతను తమ ఊళ్లో వున్నాడు. కొద్దిగా చదువుకున్నాడు కూడాను. అతడిని తీసుకొచ్చి బండిమీద వ్యాపారం నేర్పాలని మనసులో అనుకుంటున్నాడు. ఆ కుర్రాడికి తల్లీ దండ్రీ లేరు. తన దగ్గర నమ్మకంగా పడి వుంటాడని అతడి ఆశ.

పాడిగోవులాంటిది ఈ వ్యాపారం. రెండేళ్ల లోనే ఇల్లు కొనగలిగాడంటే- సంపాదన ఊహించవచ్చు. అయినా వ్యాపారాన్ని పెంపొందించుకునేందుకు జయప్రకాష్‌ని సలహా అడుగుదామని అతడి ఆలోచన. కాని జయప్రకాష్ ఇప్పుడిక్కడ ఉండటంలేదు. ఊళ్లో రెండొందలు అద్దె ఇచ్చి మంచి ఇంట్లో ఉంటున్నాడు. కలర్ టి.వి., ఫ్రిజ్, డబుల్‌కాట్ తదితర ఫర్నిచర్ అంతా కొన్నాడు. ఎప్పుడూ ఫిల్టర్ సిగరెట్ నోట్లోవుంచుకుని, మోటార్ సైకిల్‌పై తిరుగుతున్నాడు. ఇంటికిగాని, ఆఫీస్‌కిగాని ఫోన్ చేసినా దొరకటంలేదు.

మెయిన్‌రోడ్‌మీద హోటల్‌కి సరిపడే ఇల్లు చూడమని ఇళ్లబ్రోకర్‌కి చెప్పాడు. అదీ- బస్సులు ఆగేచోటునయితే హోటల్‌కి గిరాకీ బాగా వుంటుంది. డ్రైవర్‌కి, కండక్టర్‌కి ఉచితంగా టిఫిన్, భోజనం ఇస్తే బస్సులన్నీ అదే హోటల్‌ముందు ఆగుతాయి. బిజినెస్ ఒక్కసారిగా పెరుగుతుంది. అదీ అతడి ఆలోచన.

"ఊరేమో రోజురోజుకూ పెరుగుతోంది, స్థలాలరేట్లూ ఇబ్బడి ముబ్బడిగా పెరుగుతున్నాయి. మెయిన్‌రోడ్లలో ఇల్లు అద్దెకు దొరకటం కష్టం" అని బ్రోకర్ చెప్పాడు. "తక్కువలో వస్తే కొంచెం దూరంలోనైనా మెయిన్ రోడ్‌మీద ఇల్లుగాని, స్థలంకాని కొనేద్దాం" అని చెప్పాడు అతడు బ్రోకర్‌తో.

ఏదిఏమయినా జయప్రకాష్ షలహా తీసుకోవాలి అనుకున్నాడు.

★ ★ ★

'శ్రీమతి వరలక్ష్మి కనకదుర్గా లలితా చౌడేశ్వరీదేవి లైమ్ ప్రోడక్ట్స్' ఆఫీస్‌ముందుకు ఒక్కొక్కరూ రాసాగారు. బోర్డు తుడుస్తున్న సుబ్బారావు ఆశ్చర్యపోయాడు. సంఖ్య ఒకటినుండి వందకు పెరిగింది. అందరూ జయప్రకాష్‌కోసమే చూస్తున్నారు. ఏమిటి విషయం? అంటే - ఎవరూ చెప్పటంలేదు. ఆ ఆఫీస్ దగ్గర పట్టక బయట చెట్టుకింద నిలబడ్డారు జనం.

బుల్లెట్ బండిపై చిద్విలాసంగా నవ్వుతూ వచ్చాడు జయప్రకాష్. "అందరూ కూర్చోండి!" కొంచెం బిగ్గరగా చెప్పాడు జయప్రకాష్ బండి స్టాండ్ వేసి, సిగరెట్ వెలిగించి దమ్ము పీలుస్తూ.

కొంచెం సద్దుమణిగాక తాను ఆఫీస్‌లోకి పోకుండా చెట్టుకిందకు వచ్చాడు. "మిత్రులారా! మీరు ఆత్మీయతతో నన్ను నమ్మి అందరూ ఇక్కడకు వచ్చినందుకు కృతజ్ఞతలు. మీరంతా గని కార్మికులు. కొందరు వ్యవసాయ కూలీలు, కొందరు గనిలో పనిచేసే కార్మికులు. మీ సంపాదనతో స్వంత ఇల్లంటూ ఏర్పరచుకోలేమనే నిస్సహాయత మిమ్మల్నందర్నీ బాధపెడుతూనేవుంది. ఉద్యోగుల ఇంక్రిమెంట్లులాగా ప్రతి సంవత్సరం పెరిగే అద్దెలను మనబోటి కార్మికులకు భరించడం కష్టం. అందుకని మనమే స్వంత ఇళ్లు నిర్మించుకుందామని చెప్పాను.

అయితే ఎక్కడ?

అది అందరినీ ఆతృతతో ఉంచే విషయం. నేను కరణంగారిని పట్టుకుని పదివేలు లంచం ఇచ్చి మనకు తగిన భూమి ఎక్కడ వుందో కనుక్కున్నాను. దానిని అందరికీ సమానంగా వచ్చేట్లుగా పంచాను. రోడ్లు ఇళ్ల నెంబర్లు గుర్తు పెట్టి ప్లాన్ కూడా గీయించాను'' వెనక్కు వెళ్లి మోటార్‌సైకిల్ బాక్స్‌లో వున్న బ్లూప్రింట్ డబ్బా తెచ్చి అందరికీ చూపించాడు. అందరూ హర్షధ్వానాలు చేశారు.

"దీనికి నాకు చాలా ఖర్చయింది. అయినప్పటికీ మీరు నాతోటి కార్మికులు కనుక




అయిన ఖర్చువరకు మాత్రమే తీసుకుంటాను.

ఇల్లు కావాల్సినవాళ్లు మనిషికి రెండు వందల రూపాయల చొప్పున ఇపుడు ఇవ్వాల్సివుంటుంది. మీ పేర్లు రాసి వారికి సీరియల్ నెంబర్ ఇస్తాను. ఇక్కడ డబ్బాలో ప్లాట్ల నంబర్లు వేసివుంచాను. ఎవరికి వారు వచ్చి లాటరీ పద్ధతిలో తీసుకుని, వారికే ప్లాట్ అలాట్ అయిందో అక్కడ ఇల్లు రేపే వేసుకోవాల్సి వుంటుంది. అందరూ దానికి తగిన వాసాలుగాని, బొంగులుకాని, తాటాకులు తెచ్చుకోవాలి. రేపు ఉదయం తెల్లవారేసరికి మీరు వాటితో ఇక్కడకు వస్తే మీ ప్లాట్ చూపిస్తాను. అయితే సైట్ ఎక్కడ? అనేది ఇపుడు చెప్పను. రేపు ఉదయమే చెబుతాను.

ఎందుకంటే మనం స్థలం కొనటంలేదు. నేను చెప్పేచోటు సెంటు పదిహేను వేల రూపాయల విలువ వుంది. ప్రతి ప్లాట్ సెంటున్నర పెట్టి ప్లాన్‌లు గీయించాం. ఆ స్థలాన్ని మనం ఆక్రమించుకుని ఇళ్లు వేసుకోబోతున్నాం. ఇది మీకు తప్ప ఎవరికీ తెలియగూడని విషయం. అంతేకాక రేపు మీరు తప్ప మరెవర్నీ ఈ స్థలాన్ని ఆక్రమించనీయకూడదు. దీనిలో కొట్లాటలు ఉండకూడదు. ఏమాత్రం గొడవ జరిగినా మనమంతా నష్టపోతాం. మీరు డబ్బుకట్టాక, ఇపుడే నా ప్లాన్ వివరిస్తాను'' అన్నాడు.

తరువాత ఒక్కొక్కరే క్యూలో వచ్చి రెండొందలు ఇచ్చి ఒక నెంబర్ లాటరీలో తీస్తున్నారు. ఏ నెంబరయితే వచ్చిందో ఆ ప్లాట్‌ని ఆ వ్యక్తిపేర రాస్తున్నాడు. అందరూ పేర్లు రాయించుకోవటం, తమకు అలాట్ అయిన ప్లాట్ నెంబర్ గుర్తుంచుకోవటం జరిగింది. తరువాత మళ్లీ మాట్లాడటం ప్రారంభించాడు జయప్రకాష్.

"ఉండటానికి చోటు చూపటం ప్రభుత్వ బాధ్యత. అయితే మనం బంజరులోనైనాసరే గుడిసె వేసుకుంటే ప్రభుత్వంవారు పీకేస్తారు. బుల్‌డోజర్లతో తొక్కిస్తారు. అందుకని సమయంకోసం వేచివున్నాను. ఇపుడా సమయం వచ్చింది గనుక నా ఆలోచనను బయటపెట్టాను.

ఇపుడు ఎలక్షన్స్ జరగబోతున్నాయి: కొద్ది నెలల్లో. ఎన్.టి.రామారావు ప్రభంజనంలా తెలుగుదేశం జెండా కింద రాష్ట్రమంతటా పర్యటిస్తున్నాడు. కాంగ్రెస్ ప్రభుత్వం భయపడుతోంది గెలుస్తుందో గెలవదో అని. ఏది ఏమయినా మనం గెలిచిన పార్టీ తరపువాళ్లమే. ఇపుడు అధికార్లు ఎలక్షన్లలోపడి హడావిడిగా వున్నారు. వారు మన విషయం ఇపుడు పట్టించుకోరు. ఇపుడిక్కడ కాలనీలాగా కట్టామంటే రెండు పార్టీల తరపున పోటీచేసే అభ్యర్థులు ఓట్లకోసం మనదగ్గరకు వస్తారు. కాంగ్రెస్ ఆయన వస్తే 'ఇందిరాగాంధీ నగర్' అనే బోర్డు చూపెడదాం. మా ఇళ్లకు గనుక పట్టాలిస్తే ముందుగా వెంటనే ఎలక్ట్రిసిటీ సప్లై ఇప్పించగలిగితే మీకే మా ఓట్లు అని చెబుదాం.

అలాగాక తెలుగుదేశం అభ్యర్థి వస్తే 'గాంధీనగర్' అనే బోర్డు చూపెడదాం. ఆయననూ పట్టాలు ఇప్పించాలనీ, కరెంట్ వేయించాలనీ కోరదాం... చివరకు ఎవరు గెలిస్తే వారికే మన ఓట్లన్నీ వేశామని చెబుదాం. మన మిగతా పనులు పూర్తిచేయించుకుందాం. ప్రతి ఇంట్లోనూ రెండు జండాలుండాలి. ఎవరు మన కాలనీకి వస్తున్నారని తెలిస్తే వారి జండాలు ఇళ్లపై కట్టాలి''

అంతా ఉద్వేగంగా వింటున్నారు. తెల్లవారితే తమదంటూ ఒక ఇల్లుంటుందనే ఊహ వారిని ఉద్రిక్తులను చేస్తున్నది.

"మనలోమాట... మీరు మీ ఇష్టమైన పార్టీకి ఓట్లు వేసుకోవచ్చు. ఎవరు డబ్బు ఇచ్చినా సంతోషంగా తీసుకుని మీకు నచ్చిన వారికి ఓటేయండి''

అందరూ సంతోషంతో చప్పట్లు చరిచారు.

"శబ్దం చేయవద్దు. రేపు తెల్లవారేసరికి మీ

ఇంటికి కావాల్సిన సామానులు తీసుకొని ఇక్కడికి రండి. మరో విషయం ఏమిటంటే ప్రతి ఒక్కరూ, రెండు బొంగులు, నాలుగు తాటాకులు ఇక్కడ వదిలి వెళ్లాలి. అదెందుకో రేపు చెబుతాను. ఇక మీరు నిశ్శబ్దంగా వెళ్లిపోండి. ఈ విషయం ఎవరికీ తెలియనీయకండి''

అందరూ నిశ్శబ్దంగా వెళ్లిపోయారు. ఎన్నెన్నో కలలతో అందరూ వెళ్లిపోయాక డబ్బుతో ఆఫీస్‌రూంలోకి వచ్చాడు జయప్రకాష్.

"ఏమిటిది? రేప్పొద్దున వాళ్లందరూ వస్తే ఏం చెబుతావ్?" కొంచెం కోపంగా అడిగాడు సుబ్బారావు. అతడింటి స్థలం చూపకపోతే తన ఆఫీసు పగలగొడతారేమోనని అతడి భయం.

"ఇది పెట్టుబడి లేకుండా చేసే వ్యాపారాలలో ఒకటి'' డబ్బు లెక్కపెట్టుకుని లోపల పెట్టుకుంటూ అన్నాడు జయప్రకాష్. కొంచెం మిర్రిమిర్రి చూశాడు సుబ్బారావు.

"ఏం నీకూ ఒక ప్లాట్ కావాలా?" చిరునవ్వుతో అడిగాడు.

"ఒకటి కాదు... ఊరక వచ్చేవి కదా... రెండు కావాలి'' నవ్వాడు సుబ్బారావు.

"అలాగే ఇస్తాను. కాని నీకుమాత్రం ప్లాట్ వెయ్యి రూపాయలు. రెండు ప్లాట్‌లు రెండు వేలు. ఎందుకంటే నీవు కార్మికుడివి కాదు, కర్షకుడివి కాదు''

సుబ్బారావు మాట్లాడకుండా డబ్బాలో చేయుంచి రెండు నెంబర్లు తీశాడు. నెంబర్లు నోట్‌చేసుకుని రెండువేలు ఇచ్చాడు. ఇంకా డబ్బాలో ఆరు చీట్లు వున్నాయి!!

★ ★ ★

తెల్లవారు ఝామునే లేచిన జయప్రకాష్ ఇంటిముందు ఆగిన ట్రాక్టర్‌ని చూసి తృప్తిగా తలాడించాడు. దానిముందు మైక్ పెట్టబడి వుంది. లోపల పదిమంది కూలీలు కూర్చుని వున్నారు. అందరి వదనాల్లోనూ ఉద్వేగం ఉంది. వెనుకగా ఎడ్లబండ్లపై బొంగులు, తాటాకులు వేసుకుని జనం వున్నారు. బారులు తీర్చివున్నాయి ఎడ్లబండ్లు.

జయప్రకాష్ లోనికెళ్లి స్నానంచేసి, లాల్చీ పంచె కట్టుకుని ఒక చేతిలోని పళ్లెంలో కొబ్బరికాయ, కర్పూరం, తాంబూలం పట్టుకుని వచ్చాడు. దానిని ట్రాక్టర్‌లోనివారికిచ్చి, బుల్లెట్ స్టార్ట్‌చేశాడు. వెంటనే మైక్ ఆన్ అయింది 'నమో వెంకటేశా...! అంటూ. ఊరేగింపు కదిలింది.

రైల్వేస్టేషన్‌కి ఊరికి మధ్యగా వున్న ప్రదేశంలో అతడు బుల్లెట్ ఆపినపుడు అందరూ ఉలిక్కిపడ్డారు.

అది ఊళ్లోని దేవస్థానం వారిపొలం!! ఎకరం రెండు లక్షలుంటుంది. ఆగి భూమి పూజ చేసి టెంకాయ కొట్టి, ఊదికడ్డీలు వెలిగించి, కర్పూరహారతి ఇచ్చి మౌనంగా రెండు చేతులూ ఎత్తి నమస్కరించి అన్నాడు. "'ఇది దేవుడి సొమ్ముగదా!' అని మీరేం భయపడనవసరంలేదు. దీనికి ఎకరానికి పదిహేను రూపాయల కౌలు, కౌలుదారుడు దేవస్థానానికి చెల్లిస్తున్నాడు. మనం ఈరోజే వంద సంవత్సరాలకు సరిపడా కౌలు చెల్లిద్దాం. అంటే తలా పదిహేను రూపాయలు దేవస్థానంవారిపేర చలానా కట్టాలి. కనుక అది పాపం కాదు. నేను మీకు వరుసనే ప్లాట్ నంబర్ చదువుతూ హద్దులు చూపిస్తూ వెళతాను. ఆ ప్రకారమే మీమీ ఇళ్లు వేసుకోండి''

చెప్పి, మరో ఇద్దరిని సాయం తీసుకొని, ప్లాట్ నెంబర్లు చదువుతూ వెళ్లసాగాడు. ఆ నెంబర్ గల వ్యక్తి వెంటనే తను తెచ్చిన ఇంటి సామాన్లు అక్కడ వేసి, గుంజలు పాతటంలో మునిగిపోయాడు.

మధ్యాహ్నం మూడు గంటలయ్యేసరికి అందరికీ ప్లాట్స్ చూపించటం అయిపోయింది. జయప్రకాష్ తన ఆరుప్లాట్లలో కూడా గుడిసెలు వేయించేశాడు.

అందరినీ తిరిగి సమావేశపరిచి చెప్పాడు




జయప్రకాష్. "ఒక వారంరోజులలోగా అందరూ నాలుగేసి వందల చొప్పున ఇవ్వండి. ఇళ్లకు కరెంట్ వేయించే విషయం, పంచాయితీ ఇళ్లకు నెంబర్లు ఇచ్చే విషయం, రెవిన్యూవాళ్లు ఇళ్లకు పట్టా ఇచ్చే విషయంలో పని మొదలుపెడతాను''

ఎవరూ ఒక్క గంట కూడా ఆలస్యం చేయలేదు. గంటలోపలే అందరూ డబ్బు తెచ్చి ఇచ్చారు.

జయప్రకాష్ ఊహించినట్లుగానే ఆ ఊరిలో ఒక్కసారిగా గుప్పుమన్నా ఎవరూ వారిని ప్రశ్నించేవారు లేకపోయారు.

తరువాత జయప్రకాష్ వారి డబ్బుతోనే వారి ఇళ్లముందు కాలువలు తీయించాడు. వారి కష్టంతోనే రోడ్లు వేయించాడు. సర్పంచ్ వాటికి బిల్లులు పెట్టుకున్నాడు.

ముందుగా కాంగ్రెస్ కాండిడేట్‌ని పిలిచి 'ఇందిరాగాంధీ నగర్'లో సభ ఊరివాళ్ల ఖర్చుతో ఏర్పాటుచేశాడు. ఆయనకు దండలు వేసి తమ సమస్యలు చెప్పాడు. ఆయన అవన్నీ చేస్తానని వారికి హామీ ఇచ్చాడు.

తరువాత కాంగ్రెస్ జండాలు పీకేసి తెలుగుదేశం జండాలు కట్టించి, 'గాంధీనగర్' అనే బోర్డు పెట్టి, తెలుగుదేశం అభ్యర్థిని పిలిపించి, ఉపన్యాసమిప్పించి, తమ కాలనీలో సమస్యలన్నీ చెప్పాడు. ఆయనా వారి కష్టాలన్నీ తీరుస్తానని సభాపూర్వకంగా హామీ ఇచ్చాడు.

అక్కడ ఒక ఎలక్షన్ బూత్ కూడా ఉండే ఏర్పాట్లు చేశాడు జయప్రకాష్. ఎలక్షన్స్ జరిగిపోయాయి. ఈలోపలే ఆ కాలనీకి కరెంటు రావటం జరిగింది. తరువాత మళ్లీ తలా నాలుగు వందలు పట్టాలకోసం వసూలు చేశాడు జయప్రకాష్.

ఆ ఎలక్షన్లలో తెలుగుదేశం పార్టీ గెలిచి 1983 జనవరి తొమ్మిదిన ఎన్.టి.రామారావు ముఖ్యమంత్రిగా బహిరంగ ప్రమాణస్వీకారం చేశాడు. వెంటనే ఆ కాలనీకి 'గాంధీనగర్' అనే బోర్డు శాశ్వతంగా ఉంచేశాడు జయప్రకాష్. ఎందుకంటే ఆ నియోజకవర్గంలో 'గెలిచింది కూడా తెలుగుదేశం ఎమ్మెల్యేనే! ఆయనతో వీలయినంత ఎక్కువగా కలిసి తిరుగుతూ, గాంధీనగర్‌లో సన్మానం కూడా ఏర్పాటుచేశాడు జయప్రకాష్ ఆ కాలనీవాసుల డబ్బులతో.'

ఎవరు చేస్తేనేం... ఎలా అయితేనేం... రెండు నెలల్లోపు వాళ్లందరికీ పట్టాలు వచ్చాయి.



దాదా పూజగదిలో వున్నాడు. ఆ గదికి ముందు ఇద్దరు, మెయిన్‌గేటువద్ద ఇద్దరు కుర్రవాళ్లు కాపలా వున్నారు. ఆరు నూరైనా పూజ ముగించి కాని బయటకు రాడు దాదా. మెయిన్ రోడ్డుకి ఆనుకొని వున్న ఒక చిన్న బంగళాలో వుంటున్నాడు దాదా ఇప్పుడు.

దాదాకిపుడు చాలా మంచిపేరుంది. గిట్టనివాళ్లు ఆయనో రౌడీ అంటారుగాని రౌడీయిజం ఎప్పుడూ చలాయించలేదు. ఎలక్షన్ల సమయంలో ఇరుపార్టీల కాండిడేట్సు వచ్చి దాదా ఆశీస్సులు తీసుకుపోయారు.

దాదాలో ప్రత్యేకత ఏమిటంటే ధనవంతులకు డబ్బు తీసుకుని పనిజరిగేలా చేస్తాడు. బలహీనులకు ఉచితంగా సేవలు అందిస్తాడు. ఫ్యూడల్ వ్యవస్థలోని రాబిన్‌హుడ్‌లాగా అన్నమాట.

ఒక షాపుముందు మెయిన్‌రోడ్డులో కిళ్లీకొట్టు పెట్టాడనుకోండి. అతడిని తీయించటం పోలీసులవలన కాదు. అందుచేత దాదాని ఆశ్రయించేవారు వారు. ఆ కిళ్లీకొట్టతనికి కొంత డబ్బిప్పించి తీసేయించి మరోచోట పెట్టించేవాడు దాదా.

ఇంటిముందు కారాగింది.

డాక్టర్ కృష్ణ కారుదిగి గేటువరకు వచ్చాడు. "దాదా సార్! ఉన్నారా?" అని అడిగాడు. తల వూపి లోనికి పరిగెత్తుకెళ్లాడు ఒక కుర్రాడు. డాక్టర్ కృష్ణ వూరులో పేరెన్నికగన్న డాక్టర్. మంచి సర్జన్ కూడాను. ఫీజు కూడా చాలా తక్కువ తీసుకుంటాడు. కమీషన్ల కోసం ఇంత పొడుగున లాబరేటరీ టెస్ట్‌లు రాయడు. మెడికల్ కంపెనీలిచ్చిన గిఫ్ట్‌ని తలుచుకుని ఆ కంపెనీ మందులతోనే ప్రిస్కిప్షన్ రాయడు. మొదట్లో ఒక సాయిబు డాక్టరుగారు ఉండేవారు. తరువాత తరువాత డాక్టర్లు పెరిగారు. మొదట్లో ఒకరి ప్రోత్సాహంతో మరొకరు నర్సింగ్‌హోమ్‌లు ప్రారంభించుకున్నారుగాని ఇపుడు కులాలవారిగా విడిపోయారు. కమ్మ డాక్టర్లందరూ ఒక గ్రూపు, రెడ్డి డాక్టర్లందరూ ఒకగ్రూపు. నాయుడు డాక్టర్లంతా ఒకగ్రూపు. ఇక మిగతా కులాల డాక్టర్స్‌కి పేషెంట్స్ వుండరు. వారే గ్రూపులోనూ చేరరు.

పేషెంట్స్ కూడా తమ కులం డాక్టర్ దగ్గరకే పోతారు. పల్నాటి సీమలో వేరందుకున్న ఫ్యాక్షనిజమ్ క్రమంగా చిగురు తొడుగుతోంది.

ఒక డాక్టర్ ఆపరేషన్ చేశాడు. చేయటంలో ఫోర్‌సెప్స్ పొట్టలోనే పెట్టి కుట్టేశాడు. ఆ పేషెంట్‌కి కడుపునొప్పి తగ్గక డాక్టర్ కృష్ణదగ్గరకు కేసు వచ్చింది. ఆయన ఎక్స్‌రే తీసి కడుపులో ఫోర్‌సెప్స్ వుందని చెప్పాడు.

అప్పటితో గొడవ మొదలయింది. కృష్ణ ఏ వర్గానికి చెందని డాక్టర్. అయితే ఆపరేషన్ చేసిన డాక్టర్‌వర్గానికి వ్యతిరేకవర్గం ఆ డాక్టర్ చేతగానితనాన్ని నిర్లక్ష్యాన్ని తమ కనుకూలంగా మార్చుకోవాలనుకుంది. వారే పేపర్లవారికి క్లూ ఇచ్చారు. అది గొడవ అయింది. పేషెంట్ తరపు మనుషులు వెళ్ళి ఆ డాక్టర్‌ని గొడవ గొడవ చేశారు. నర్సింగ్‌హోమ్ అద్దాలు పగలగొట్టి ఫర్నిచర్ ధ్వంసం చేశారు. పైపెచ్చు కంపన్సేషన్‌కింద డబ్బు ఇమ్మని బలప్రయోగం చేశారు. డాక్టర్ కృష్ణ ఆపరేషన్ చేసి ఆ ఫోర్‌సెప్స్ తీసేశాడు. అతడికి సంతోషంగా ఫీజ్ చెల్లించి వెళ్లిపోయారు వారు. కాని మొదట ఆపరేషన్ చేసిన డాక్టర్‌కి, ఇది తన వ్యతిరేక వర్గాలు చేసిన కుట్రలా కాక, డాక్టర్ కృష్ణే తన వ్యాపారం పెంచుకోవటంకోసం ఆడిన జిమ్మిక్కుగా భావించాడు. అందుచేత తన కులంవాళ్లను అతడిపై రెచ్చగొట్టాడు.

వారు ఏదో జబ్బున్నట్లుగా చూపించుకోవటానికి హాస్పటల్‌కి వస్తారు. కావాలని ఏదో ఒక గొడవ సృష్టించుకుని అల్లరి చేస్తారు. మిగతా పేషెంట్స్ భయభ్రాంతులయ్యేలా చేస్తారు. ఇదేకాక ఆయనమీద తప్పుడు ప్రచారం మొదలయింది. ఏం చేయాలో పాలుబోలేదు ఆ డాక్టర్‌కి. ఆయనకు కులబలం లేదు. డబ్బయితే వుందిగాని దానితో పలుకుబడి ఎలా పెంచుకోవాలో తెలియదు. పోనీ పోలీస్ రిపోర్ట్ ఇద్దామన్నా ఏ కేసులోనూ ఆధారాలు దొరకనీయరు. అందుకే ఎటూ దిక్కుతోచక బాగా ఆలోచించి దాదా దగ్గర కొచ్చాడు.

పూజ ముగించుకొని పట్టువస్త్రం ధరించి డ్రాయింగ్‌రూంలోకి రాగానే లేచి నమస్కరించాడు డాక్టర్ కృష్ణ.

"భలేవారే! మీరు పెద్దవారు. నాకు నమస్కారం చేయకూడదు..." ఆప్యాయంగా చేతులు పట్టుకుని కూర్చోబెడుతూ అన్నాడు.

"దాదాసర్...!" ప్రారంభించాడు డాక్టర్ కృష్ణ.

"దయచేసి నన్ను సర్ అనకండి!" వినయంగా చెప్పాడు దాదా. అతడికా పిలుపు




లోపల సంతోషంగానే వున్నా బయటకు వినయం, వినమ్రతతో తిరస్కరించటం అతని పాచిక. దానివలన అతని ఇమేజ్ పెరుగుతుందని అతడికీ తెలుసు.

డాక్టర్ కృష్ణ తన బాధలు చెప్పుకొచ్చాడు. తాపీగా విన్నాడు దాదా. తరువాత లేచి ఫోన్ దగ్గరకు లాక్కున్నాడు. ఒక నెంబర్ డయల్ చేశాడు.

"హల్లో... డాక్టర్ హియర్..." గరగరా వినిపించింది.

"నేను... దాదాను మాట్లాడుతున్నాను''

"మీరా సర్... ఏమిటీ విషయం?" వినయంగా అడిగాడా డాక్టర్.

"ఏమీ లేదు... మీ కుర్రోళ్లు డాక్టర్ కృష్ణ గారి హాస్పిటల్లో గొడవ చేస్తున్నారట. ఆయన నాకు బాగా కావాల్సినవారు''

"అలాగా సర్... నాకు తెలీదు. ఇకనుండీ అలా జరగకుండా చూస్తాను''

"అది మనిద్దరికీ చాలా మంచిది'' అని ఫోన్ పెట్టేశాడు దాదా. డాక్టర్ కృష్ణవేపు తిరిగాడు. "ఇక మీరు నిశ్చింతగా వుండండి డాక్టర్‌గారూ. ఇక గొడవ లేమీ జరగవు. జరిగితే నాకు ఫోన్ చేయండి చాలు... మీరు స్వయంగా రానవసరంలేదు''

"చాలా థాంక్స్... మీ రుణం ఎలా తీర్చుకోవాలో నాకు తెలియటంలేదు''

"ఫరవాలేదు... బీదవాళ్ల దగ్గర తక్కువ ఫీజ్ తీసుకోండి. మావాళ్లెవరయినా వస్తే కాస్త కనిపెట్టి వుండండి... చాలు..." లేచి డాక్టర్‌గార్ని సాగనంపుతూ అన్నాడు దాదా.

కాని అది అతనికి చాలా అవుతుందని ఆ డాక్టర్‌కి తెలియదు.

డాక్టర్ కృష్ణ బయటకు వెళుతుండగా, ఒక చిరుద్యోగి లోనికి వచ్చాడు.

"దాదాసర్... మా అమ్మాయిని ఓ పోకిరీ పిల్లవాడు అల్లరి పెడుతున్నాడు''

"ఊc..." తల పంకించాడు దాదా.

అది ప్రారంభం.

★ ★ ★

సుబ్బారావుకి నెలనెలా పెట్టుబడి లేకుండా డబ్బు రావటం బాగానేవుందిగాని, దానిలో జయప్రకాష్‌కి వాటా ఇవ్వటం అతనికి ఏమాత్రం ఇష్టంలేదు. అతడిద్వారా వ్యాపార రహస్యాలన్నీ తెలుసుకున్నాడు గనుక, ఇక అతడిని పార్టనర్‌షిప్‌నుండి తప్పిస్తేనే బెటరని అనుకున్నాడు. అపుడు డబ్బంతా తనదేకదా!

అందుకని ఒకనెలలో బొగ్గు బ్లాకులో అమ్మిన సొమ్ము పనివుండి వాడుకున్నానని జయప్రకాష్‌తో చెప్పాడు. మరోనెల లాభం తగ్గిందని, ఆఫీస్ ఖర్చులు ఎక్కువయ్యాయని చెప్పాడు. ఆ నెలా డబ్బు ఇవ్వలేదు. జయప్రకాష్ అతడికే కోపం వచ్చి తనతో తగాదా పెట్టుకోవాలని, తద్వారా పార్టనర్‌షిప్ కట్ చేసుకోవాలనీ సుబ్బారావు ఊహ.

దానిని గమనించాడు జయప్రకాష్. అయితే ఏమీ మాట్లాడలేదు. మామూలుగా ఆఫీస్‌కి వచ్చి వెళ్లిపోతున్నాడు. బాగా ఆలోచించాడు.

అవి తెలుగుదేశం పార్టీ అధికారంలోకి వచ్చిన కొత్తరోజులు. ప్రభుత్వాధికారులు లంచాలు తీసుకోవాలంటే భయపడుతున్నారు. చాలాచోట్ల ఏ.సి.బీ దాడులు జరిగి ఎందరో ఆఫీసర్లు పట్టుబడ్డారు. అందుచేత ఉద్యోగస్తులు ఒకరకమ్మైన అదిరింపులతో పని చేస్తున్నారు. వ్యాపార వర్గాలు భయంభయంగానే వున్నాయి. పరిస్థితిని చక్కగా ఆకళింపు చేసుకున్నాడు.

. ఒకరోజు సుబ్బారావు ఆఫీస్ బోర్డు తుడుస్తుండగా టెలిగ్రాం మెసింజర్ వచ్చి టెలిగ్రాం ఇచ్చి వెళ్లాడు. ఆతృతగా చింపి చదివాడు.

'దివాల సున్నపు బట్టీస్ అసలు లేనేలేవని, దొంగ సర్టిఫికెట్లతో లోను పొంది దొంగ వ్యాపారం జరుగుతోందని తమకు తెలియవచ్చిందని, కనుక తామారోజే బయల్దేరి ఎంక్వయిరీ చేయటానికి వస్తున్నామ[illegible] [illegible] సారాంశం. సుబ్బారావుకి చమటలు

పోశాయి. అతడి గుండెల్లో డ్రైవర్ లేని రైళ్లు, గూడ్సుబండ్లు పరుగెత్తాయి. ఏం చేయాలో వెంటనే పాలుపోలేదు. బోర్డు తుడవటం ఆపి, ఆఫీస్‌కి తాళంవేసి జయప్రకాష్ ఇంటికి బయ ల్దేరాడు.

జయప్రకాష్ పడక్కుర్చీలో విలాసంగా కూర్చుని సిగరెట్ త్రాగుతూ టి.వి. చూస్తు న్నాడు.

"గురూ! కొంపమునిగింది..." దగ్గరగా వెళ్ళి కూర్చుని అన్నాడు. ఒక సారి చుట్టూ చూసి "నా కొంప కాదు కదా? అయితే ఫర్లేదు. మీకొంపేగా మునగనియ్''

"అది కాదు... మన సున్నపుబట్టీల గు రించి ఎంక్వయిరీ చేయటానికి ఆఫీసర్లు వచ్చారు''

"మన సున్నపుబట్టీలా? నీవు నాకు మూ డునెలల నుండి వాటా డబ్బు ఇవ్వటం లేదు. ఇక 'మన' ఎక్కడ? అంతానీదే. ఏడుచువ్వ లు లెక్కబెట్టాల్సింది కూడా నీవే?"

"అదేంటి గురూ అలా అంటావ్? కష్టసమ యంలో సలహా చెప్పకుంటే ఎలా?"

"నేను ఊరికే సలహాలు చెప్పను. ముందు మూడు నెలలుగా నాకు రావాల్సిన వాటా డబ్బు, నా ఫీజు పది వేలు పట్టుకురా... తరువాత మాట్లాడతాను''

"తప్పదా?"

"తప్పదు''

నిస్సహాయంగా లేచి బ్యాంక్‌కి వెళ్ళి డబ్బు డ్రా చేసుకొని వచ్చి జయప్రకాష్‌కి ఇచ్చాడు. "ఇపుడుచెప్పు... ఏం చేయ మంటావో'' అని అడిగాడు సుబ్బారావు.

"ఏమీ చేయొద్దు మందుకొట్టి ఆ గదిలో పడుకో'

"ఆఫీసర్లు వూళ్లోకి వచ్చారట"

"వచ్చినా సరే నేను చెప్పినట్లు చెయ్'' టి.వి.చూస్తూ అన్నాడు జయప్రకాష్. సు బ్బారావు లోనికెళ్ళిపోయాడు.

ఊళ్లోకొచ్చిన ఆఫీసరుగారు, సూ పర్నెంటూ టి.బి.లో ఖాళీదొరక్క నల్లుల హోటల్లో స్వంత ఖర్చుతో దిగారు. వారు ఉద్యోగంలో చేరాక ఏనాడూ స్వంత డబ్బులు ఖర్చుపెట్టి ఎరుగరు. అన్నీ మందిమీద, పార్టీలమీద పోవాల్సిందే. దివాల సున్నపుబ ట్టీస్ వారు రాకపోవటం, కనీసం ఫోనయినా ఎత్తకపోవటంతో వారిగుండెలు గుభేలు మన్నాయి. తమది 'హార్డ్ ఎరన్డ్ మనీ... చెమటోడ్చి మరీ సంపాదించింది. అది ఖర్చు చేయటానికి, వారికళ్ళనుండి నీరు కాదు, రక్తం వస్తోంది. స్వంత డబ్బుతో కోడికూర తెప్పించుకు తిన్నారు. జీప్ లేకపోవటంవ లన స్వంత డబ్బుతో అన్ని బట్టీలు కలియది రిగారు. కాని దివాల సున్నపుబట్టీస్ కనిపించ లేదు.

వారి గుండెలు మోకాళ్ళలోనికి దిగిపో యాయి. ఆ రాత్రి స్వంత ఖర్చుతో ఎక్కువ డబ్బు నల్లగుర్రాలపై ఖర్చుపెట్టటం ఇష్టంలేక, 'వారుణీవాహిని' తెప్పించుకొని, 'ప్రభుత్వ ఉద్యోగస్తులంగనుక ప్రభుత్వ సారా నే తాగాలి' అని ఛీర్స్ చెప్పుకుని తాగి పడుండిపోయారు.

ప్రొద్దుటే సుబ్బారావు, జయప్రకాష్ మోటార్ సైకిల్ వెనకాల కూర్చుని హోటల్ కి చేరాడు. జయప్రకాష్ ముందు నడుస్తుంటే, వెనుక విశ్వాసంతో నడుస్తున్నాడు సు బ్బారావు.

వారిని చూడగానే సింహంలా ముఖంపె ట్టి గర్జించాడు ఆఫీసర్. 'పద సైట్‌కి వెళ దాం... ఆయ్... నేనంటే ఎవరనుకున్నారు?"

'ష్... ష్...' అని కుక్కను తోలినట్లు తోలి, రప్పున దోమను చంపేసి, కుర్చీ లాక్కుని కూర్చుని, సిగరెట్ వెలిగించి- 'ఏమిటి? నిన్న టెలిగ్రాం పంపించారు?" నెమ్మదిగా, తాపీగా అన్నాడు జయప్రకాష్. సుబ్బారావు నిలువెల్లా వణికిపోతున్నాడు.

"నువ్వు బట్టీ అసలు కట్టలేదట... రైల్వేస్టే షన్ తాకట్టుపెట్టావట ఆయ్'' గర్జించాడు.




ఆఫీసర్.

"భలేవారే" నవ్వాడు జయప్రకాష్. "మీరు లోను సైట్ కొంటానికి, పునాదులకీ, కట్టుబడికీ... ఇలా ఒక్కో పనీ పూర్తయిన తరువాతే 'రిలీజ్' చేశారు. అసలు మీరూల్సు కూడా అవే. కావాలంటే ఫొటోలు చూడండి" ఫొటోలు బెడ్‌పైకి విసిరేశాడు జయప్రకాష్. "ఇక నేను బట్టీ కట్టలేదని ఎవరనగలరు?"

ఆఫీసర్ సింహం ముఖం, పిల్లిలా అయి పోయింది. సూపర్నెంటు జుట్టు పీక్కుని గుండెలు బాదుకుంటున్నాడు. ఆ ఫొటోల్లో తామిద్దరూ పళ్లికిలిస్తూ నిలబడ్డారు. ఆఫీసరు తన ఐదువేళ్ళ ఉంగరాలూ ఫొటోలో పడేటట్లు చూసుకున్నాడు. "ఇదికాక వీడియో కూడా వుంది... చూపమంటారా?" తాపీగా అడిగాడు జయప్రకాష్.

కాట్‌పై గెంతుతున్న ఆఫీసర్ ఒక్కసారిగా క్రిందకు దూకి అతడి రెండు కాళ్ళూ పట్టుకున్నాడు. "నా కళ్లలో కావేరి నీళ్ళు కాదు జయప్రకాష్ గారూ! రక్తం. ఇపుడు నా ఉద్యోగం పోతే నా పదకొండుమంది ఆడపిల్లలకు పెళ్లెలా చేయను?" బెడ్‌పై దుప్పటి లాక్కుని కళ్ళు తుడుచుకుంటూ అన్నాడు.

"అసలందరు పిల్లల్నెందుకు కన్నారు?"

"ఏం చేయను? పైనొచ్చే సంపాదన నా పిల్లల మీదే ఖర్చుపెడదాం అనుకున్నాను. అందుకోసం ప్రభుత్వం వారిచ్చే ఫామిలీప్లానింగ్ ఇన్‌సెంటివ్ ఇంక్రిమెంట్ గూడా వదులుకొని, త్యాగంచేసి నా కొలీగ్స్ నాకన్నా ఎక్కువ పేస్కేల్‌లో వున్నా అసూయపడకుండా ఓర్చుకుంటూ బతుకుతున్నాను. ఇలా హఠాత్తుగా ఉద్యోగంపోతే... మా బతుకులన్నీ బజార్న పడతాయి.

ఆఫీసర్ జయప్రకాష్ కాళ్ళు పట్టుకోగానే, తనూ పట్టుకోవటం తన విద్యుక్తధర్మమని భావించి, ఖాళీలేక సుబ్బారావు కాళ్ళు పట్టుకున్నాడు సూపర్నెంట్. ఆ అదుటుకు కిందపడిపోయాడు సుబ్బారావు. ఆయన్ని లేవనీయకుండా నొక్కిపెట్టి ఏడుస్తూ అలానే వుండిపోయాడు. సుబ్బారావు కంగారు పడి, తన చొక్కాతో ఆయన కన్నీళ్ళు తుడవబోయి తన కన్నీళ్ళు తుడుచుకున్నాడు.

"మీ ఉద్యోగాలకేం భయం లేదు... నాది హామీ" అన్నాడు జయప్రకాష్.

"దయచేసి ఆ ఉపాయమేదో చెప్పండి... రేపు విజిలెన్స్ వాళ్లొస్తున్నారు. వారొస్తే మా ఉద్యోగాలు పోవటమేగాక, మేం జైలు పాలవాల్సొస్తుంది"

"మరేం ఫర్వాలేదు మీకు తోడు మా సుబ్బారావు కూడా వుంటాడు" తాపీగా అన్నాడు జయప్రకాష్. సుబ్బారావు నిలువెల్లా వణికిపోతున్నాడు.

ఆఫీసరూ సూపర్నెంటూ ఎంత బతిమిలాడినా జయప్రకాష్ మాట్లాడటం లేదు.

అప్పుడు స్ఫురించింది సుబ్బారావుకి. "మా గురువుగారు ఫీజులేకుండా ఏ సలహా చెప్పరు" నెమ్మదిగా అన్నాడు.

వెంటనే ఆఫీసర్ జేబులోంచి రూపాయినోటు తీసి కళ్ళకద్దుకొని, జయప్రకాష్‌కి ఇవ్వబోయాడు. సూపర్నెంట్ జేబులోని చిల్లరంతా వెతికి పావలాబిళ్ళ అతడికి ఇవ్వబోయాడు.

చిద్విలాసంగా నవ్వి, సిగరెట్ పొగ గట్టిగా గుండెలలోకి పీల్చి అన్నాడు జయప్రకాష్. "మీరు నా దగ్గర లంచంగా తీసుకున్న సొమ్మంతా వడ్డీతో సహా ఇచ్చి, మరో పదివేలు ఇస్తేగాని నోరు విప్పను..."

వారిద్దరూ సుబ్బారావుని బతిమిలాడారు. కాని గురువుగారు రెండో మాట వినరని చెప్పాడు సుబ్బారావు. కాసేపు వారిద్దరూ చెవులు కొరుక్కుని, సూపర్నెంట్ ముందుకొచ్చాడు. "అయ్యా! నేనిచ్చేది పదివేలు... మిగతాది అయ్యవారు" సవినయంగా అన్నాడు సూపర్నెంట్. 'గయ్'మన్నారు అయ్యవారు.

"నేనిచ్చేది తొమ్మిదివేలు... మిగతాది అయ్యవారు"



"కాదు ఇంకోమాట" అన్నాడు ఆఫీసర్.

"నేనిచ్చేది ఎనిమిదివేలు... మిగతాది అయ్యవారు''

ఆఫీసర్‌గారికి చెంగు దొరక్కపోవటంతో జేబు గుడ్డనెత్తిన వేసుకున్నారు. ఈ లోగా డబ్బంతా ఎంతయిందో లెక్కగట్టి చెప్పాడు జయప్రకాష్. చివరకు వారిద్దరూ మాట్లాడుకుని, చెవులు కొరుక్కుని, జయప్రకాష్ పేరు మీద ఆ ఎమౌంట్‌కి 'చెక్' రాసి ఇచ్చాడు ఆఫీసర్.

"ఇపుడు చెప్పండి మమ్మల్నెలా రక్షిస్తారో..." కోరస్‌గా అన్నారు.

"సుబ్బారావు! బ్యాంక్‌కి వెళ్ళి ఫిక్స్‌డ్ డిపాజిట్లన్నీ విత్‌డ్రా చేసి, వారికి కట్టేయాల్సిన డబ్బంతటికీ చెక్ తీసుకొని వచ్చి ఇవ్వు''

సుబ్బారావు కదల్లేదు. డబ్బును బ్యాంక్ నుండి డ్రా చేసి ఇవ్వటమంటే ఎంత బాధాకరమైన విషయం? అదే జయప్రకాష్ చెవిలో చెప్పాడు.

"కాని తప్పదు... ఎందుకంటే ఫర్మ్ మీ భార్యపేరున ఉంది గనుక ఆవిడను అరెస్ట్ చేసి జైల్లో పెడతారు''

"వద్దువద్దు... పోలీసులు అసలే మంచివాళ్ళుకారు'' కంగారుగా అన్నాడు.

సూపర్నెంటు అప్పటికప్పుడు వారి తాలూకు బాకీని లెక్కకట్టి ఇచ్చాడు. ఆ కాగితం తీసుకొని బయటకు వెళ్ళిపోయాడు.

వెంటనే బాయ్‌ని పిలిచి మూడు గుర్రాల విస్కీ ఫుల్‌బాటిల్ ఆర్డరిచ్చి, రెండు చికెన్‌పలావ్, ఒక తందూరి అని ఆర్డరిచ్చాడు. దాదాపు పది గంటల విరామం తరువాత మంది సొమ్ము ఊరకే దొరకబోతుందని లొట్టవేయటం ప్రారంభించారు ఆఫీసర్, సూపర్నెంటు.

విస్కీ తాగుతూ, చికెన్ తింటూ ఉండగా సుబ్బారావు పరిగెత్తుకు వచ్చాడు చెక్ తీసుకొని.

"దీనితో మా ఫర్మ్ తరుపున మీకు కట్టాల్సిన డబ్బంతా కట్టేశాం" తాపీగా అన్నాడు జయప్రకాష్. "ఇక మీరు వెళ్ళి ఈ కేస్ ఫైల్ మూసేసుకోవచ్చు''

"కాని... అసలు నిజంగా బట్టీలు లేవుగా?" సూపర్నెంట్ అన్నాడు.

"ఊరి బయట ఒక కూలిపోయిన బట్టీ వుంది. దాని ముందు దివాల సున్నపుబట్టీస్ బోర్డుపెట్టి, మీరు ముందు నిలబడి ఫోటో తీయించుకోండి. డిపార్ట్‌మెంట్‌కి డబ్బంతా కట్టేశావ్, విజిట్‌కి వెళ్ళేసరికి ప్రమాదవశాత్తు బట్టీ కూలిపోయిందని... రాసుకోండి... ఇక... ఈ బిల్లంతా పే చేసి వెంటనే వెళ్ళిపోండి''

"ఆc బిల్లు మేం పే చేయాలా? మా డబ్బులయితే ఇంత ఖరీదయిన విస్కీ తాగం. వారుణీవాహినియే తాగుతాం... ఇది అన్యాయం"

"అయితే తాగకండి బిల్ మాత్రం పే చేయండి. లేకపోతే లాడ్జీ వాడు ఊరుకోడు... ఇదుగో ఈ మిగిలిన విస్కీ మా సుబ్బారావు తాగుతాడు... విషాదానికి చిహ్నంగా'' బాటిల్ సుబ్బారావుకి ఇచ్చి కదిలాడు జయప్రకాష్.

ఇద్దరూ మోటర్‌బైక్‌పై ఆఫీస్‌కి చేరుకున్నారు.

"ఇపుడు మన పార్టనర్‌షిప్‌లో చివరి అంకం కూడా పూర్తయింది... ఎపుడయినా ఒక పార్టనర్ మరో పార్టనర్‌ని మోసం చేస్తాడు. సహజంగా తెలివితక్కువ వాడు తెలివిగలవాడిని చేస్తాడు. ఆ ఫర్మ్ నెత్తిన వేసుకుని ఆరిపోతాడు. ఇపుడు నీ విషయంలోనూ జరిగిందదే... నీవు నన్ను మోసం చేయాలని చూశావ్... నీవే మోసపోయావ్'

"అదెలా?"

"అవును... నీ పెట్టుబడికంటే చాలారెట్లు లాభాల్ని నీవు తిన్నావు. కానీ మొదటి పెట్టుబడి ఇపుడు విత్‌డ్రా చేసి డిపార్ట్‌మెంట్‌కి





కట్టేశావు. నీకు మిగిలింది వడ్డీయే. పెట్టుబడికి వడ్డీ కూడా లెక్కవేసుకుంటేగాని బిజినెస్‌లో లాభం తెలియదు... అంటే నీవు నలభై తొమ్మిదివేల తొమ్మిది వందల తొంభై ఐదు రూపాయలు నష్టపోయావన్నమాట!"

గుడ్లనీరు కుక్కుకున్నాడు సుబ్బారావు.

"బాధపడకు సుబ్బారావ్! బిజినెస్ అన్నాక లాభనష్టాలు తప్పవు... నాకు నీకంటే చాలా ఎక్కువ డబ్బే వచ్చినా నా పెట్టుబడి అయిదు రూపాయలు. నీతోపాటు నేనూ నష్టపోయాను కదా!?"

బాధగా, జాలిగా సుబ్బారావు జయప్రకాష్ వేపు చూశాడు. విషాదంగా నవ్వాడు జయప్రకాష్. "ఫరవాలేదు. నేను ఢక్కామొక్కీలు తిని ఉన్నవాడిని గనుక ఈ నష్టాన్ని భరించగలను. కాని నీకు ప్రతి నెలా వచ్చే ఆదాయం పోయింది కదా? ఇక నీకు నిద్రెలా పడుతుంది. చికెన్ ఎలా తినగలవు? అదీ నా బాధ"

"అదేంటి ఈ రోజుతో మన పార్టనర్‌షిప్ రద్దయిపోతే- ఇకనుండీ లాభాలన్నీ నావేనని నేను ఆనందపడుతున్నాను''

"ఐయామ్ సారీ... విజిలెన్స్ వారు వచ్చారు. ప్రతి బట్టీని చెక్ చేసి, వారు బొగ్గుని నిజంగా వుపయోగిస్తుంటేనే వదిలేస్తున్నారు... ఇక మిగతా బొగ్గు పర్మిట్లన్నీ ఈ రోజే కాన్సిల్ చేసేస్తున్నారు. కావాలంటే ఫోన్ చేసి కనుక్కో... ఇక నీకీ ఆదాయమూ రాకపోగా విజిలెన్స్ వారొస్తే నీవే వారికి లంచం ఇవ్వాల్సివుంటుంది. ఐ పిటీయు''

"అసలు ఇది వారికెవరు తెలిపారు?" ఆందోళనగా అడిగాడు సుబ్బారావు.

"నేనే... పార్టనర్‌ని మోసగిస్తే- మోసగించినవాడిని తిరిగి లేవకుండా దెబ్బకొట్టటం వ్యాపార సూత్రాల్లో ఒకటి" నవ్వాడు జయప్రకాష్.



1993

ఒకప్పటి మోతుబరి రైతు, పెదకాపు రైతు కూలి, శేషయ్య, ఇపుడు పూర్తి కార్మికుడు అయ్యాడు. భార్య రాజమ్మ, తను ఇద్దరూ గనిలో పనికి వెళతారు. పదేళ్ల అనుభవం తరువాత శేషయ్యకు తక్కువ పని చేసి ఎట్లా ఎక్కువ సంపాదించాలో అర్థమయింది. డబ్బు అవసరం మనిషిని ఎలా క్రుంగదీస్తుందో అర్థమయింది. డబ్బుకోసం ఎక్కువ కష్టపడసాగాడు. అందుచేత మనిషి క్రుంగిపోవటం తప్ప మరేమీ కాలేదు. మామూలుగానే అందరు తండ్రులలాగానే తన పిల్లలను చదివించటానికి ఎంతో ప్రయత్నించాడు. కాని సాధ్యపడలేదు. తనతోపాటే వచ్చిన వెంకటసుబ్బయ్య జయప్రకాష్‌లు స్వంత ఇంటివారయ్యారు. వెంకటసుబ్బయ్య తన కొడుకులను చదివిస్తున్నాడు కూడా. ఇస్రాయేల్ కొడుకు కూడా చదువుకుంటున్నాడు. ఈ సంవత్సరం పదోతరగతి. దేవసహాయం మేష్టారి కొడుకు పట్నంలో కాన్వెంట్‌లో చదివి డిగ్రీ పూర్తిచేసి వచ్చాడు. బి.ఎడ్ చేసి ఉద్యోగం కోసం ఎదురుచూస్తున్నాడు.

తను ఎంత కష్టపడ్డా డబ్బు ఎందుకు మిగలటం లేదో శేషయ్యకు అర్థం కావటంలేదు. కొద్దో గొప్పో సొమ్ము కూడబెట్టినా ఎవరో ఒకరు జబ్బు పడటం ఆ డబ్బు ఖర్చవటం జరిగేది. అందుకే పిల్లలు చదువుకుంటామన్నా మానిపించేయాల్సి వచ్చింది. చిన్నపిల్లాడు శ్రీను ఆరోతరగతి చదువుతూ మానేశాడు. పెద్ద కొడుకు వెంకటేశం పదో తరగతి చదువుతూ మానేశాడు.

ఏం చేస్తాడు? రెండేళ్ళక్రితం రాజమ్మ ఆరోగ్యం బాగా దెబ్బతిన్నది. పది మందికి వండిపెట్టి, పదిమందిని పోషించిన తమ కుటుంబం ఇలా కావటం ఆమెను మానసికంగా కృంగదీసింది.

అందుకుతగ్గట్టు గుండెలమీదకుంపటిలా పిల్ల తిరుపతమ్మ గత సంవత్సరమే పెద్దపిల్ల అయింది. దానిని మూల కూర్చోబెట్టి, ఓణీలు

కొనటానికి సరిగా డబ్బులేదు. వయసుతోపాటు బాగా పెరిగింది. పిల్ల వయసు పదిహేనేళ్ళయినా పదహారు పదిహేడేళ్ళ అమ్మాయిలా వుంటుంది. రెండు నెలలకోసారి ఆ పిల్ల జాకెట్లు సరిపోక అవి తల్లికి ఇచ్చి, తాను కొత్తవి కుట్టించుకోవాల్సి వస్తోంది.

రాజమ్మ బాగా నీరసపడిపోవటంతో కూతుర్ని తనతోపాటు గనికి పనికి తీసుకెళుతున్నాడు శేషయ్య. అతడికి తెలుసు. గని పనిలో శ్రమ ఎక్కువ ఫలితం తక్కువ. అదే బట్టీపనిలో అయితే ఉదయం ఏడు గంటల నుండి పన్నెండు గంటలవరకు మాత్రమే పని వుంటుంది. అదీగాక ఆ పని ముందు నుండీ నేర్చుకుంటే కొద్ది కాలంలోనే మేస్త్రీ కావచ్చు. అపుడు రెండు మూడు బట్టీలలో పనికుదుర్చుకొని, ఏ పనీ చేయకుండా రోజుకు నాలుగొందలు సంపాదించుకోవచ్చు. అలా సంపాదిస్తేగాని తన గుండెలమీద బరువు దింపుకోలేడు! అందుకనే మగపిల్లిద్దర్ని బట్టీల పనిలో చేర్చాడు. అందులో ఈ మధ్య రాయలసీమలో వుండేలాంటి బట్టీ ఒకటి కట్టారు. అంటే దానికి మెట్లుండవు. స్లోపుగా వుంటుంది. ఎవరయినా బొచ్చె తీసుకుని సులభంగా బట్టీపైకి చేరి బొగ్గుగాని పచ్చిరాయిగాని విసిరివేయవచ్చు.

పిల్లలిద్దరూ మంచి తెలివితేటలు గలవారు కనుక పనిని త్వరలోనే అర్థంచేసుకున్నారు. మొదట్లో బట్టీలో బొగ్గు వేయటం ప్రారంభించిన వెంకటేశం నాలుగు రోజుల్లోనే దానిలోని మెళుకువ తెలుసుకున్నాడు. బొచ్చె విసిరేటప్పుడు ఎడమనుండి కుడికి విసురుగా తిప్పితే రాయి కాని, బొగ్గుగాని బట్టీ అడుగున సక్రమంగా ఒక పొరలా పరుచుకుంటుంది.

రెండో సంవత్సరానికి వచ్చే సరికి, మేస్త్రీ దగ్గర అసిస్టెంట్‌గా పనిచేస్తున్నాడు వెంకటేశం. కొద్దిగా చదువుకున్నవాడు, లెక్కలు బాగా కడతాడు కాబట్టి, మేస్త్రీనే అతడిని కావాలని అసిస్టెంట్‌గా తీసుకున్నాడు.

ఇపుడు వెంకటేశం పని పొయ్యి దగ్గరే. కాకపోతే అపుడపుడూ పైకి వెళ్ళి, పచ్చిరాయి, బొగ్గూ సరియైన పాళ్ళలో పడుతోందో లేదో పరిశీలించటం కూడా చేస్తుంటాడు. కింద పొయ్యి దగ్గర పొయ్యి తెరచి, దంతెతో కాలిన రాయిని బయటకు లాగి అది ఎంతవరకు కాలిందో చూస్తూనే చెప్పగలడు. ఎప్పుడు రాళ్ళు బయటకు లాగాలో కూడా బాగా తెలుసునతడికి. అతడికి రోజుకి నూట యాభై దాకా కూలి వస్తోంది. అందుకే తమ్ముడిని కూడా ఆ పనిలోనే వుంచాడు అతడు.

శీను ఇపుడిపుడే చేతులను ఏంటిక్లాక్ వైజ్‌లో త్రిప్పి, రాయిగాని, బొగ్గుగాని, బట్టీలో బాగా పరుచుకునేట్లుగా వేయగలుగుతున్నాడు. అతడికి ఎనభై రూపాయలు రోజు కూలీ వస్తోంది.

గనిలో శేషయ్య తిరుపతమ్మ పని చేస్తున్నారు. వారికీ చెరో వంద రూపాయల కూలి వస్తోంది. అంటే నలుగురిమీదా రోజుకి నాలుగొందల ముప్ఫై రూపాయల కూలి వస్తోంది. అంటే నెలకు దాదాపు పన్నెండు వేల రూపాయల ఆదాయం అన్నమాట!!

అదే రాజమ్మ కూడా పనికి వెళితే మరో మూడు వేల రూపాయలు దానికి కలుస్తాయి. శేషయ్యకి ఈ జీవితం ఫరవాలేదనిపించింది. ఒక్క రెండు సంవత్సరాలు అలా గనుక కష్టపడితే తిరుపతమ్మకు ఒక మోస్తరు సంబంధం చూసి చేయగలడు! అదీ అతడి ధైర్యం. అందుకోసమని డబ్బు కొంచెం కొంచెం కూడబెట్టసాగాడు.

అయితే, గత రెండేళ్ళుగా శేషయ్యలో ఒక మహమ్మారి ప్రవేశించింది. అది సారా. సాయంత్రం అయ్యేసరికి పొద్దుటినుండి పని చేసివుండటం వలన వళ్ళంతా నొప్పులుగా వుంటున్నది. అది మర్చిపోవటానికి కొంచెం సారా పడితే బావుంటుందని, తోటి పనివాళ్ళు చెప్పారు. మొదట్లో వారితోపాటు నెలకోసారి తీసుకునే శేషయ్య, ఇపుడు వారానికోసారి తీసుకుంటున్నాడు. వారం కాగానే అది తీసు




కోకపోతే నరాలు సలుపుతాయి. అయినా తగినంత సంపాదన ఉంది గనుక, ఎవరూ ఆ విషయాన్ని పట్టించుకోవటంలేదు.

నిజానికి అలా కార్మికులుగా పనిచేసేవా రందరికీ వచ్చే సంపాదన, వారు సుఖంగా బతకటానికి, ఇల్లు కట్టుకోవటానికి సరిపో తుంటి. కాని ఎక్కువమంది కార్మికులు మంచి స్థితిలో లేరు. కారణం సారానే!! సాయంత్రానికి వెళ్ళి కూర్చుంటే ఎంత తాగు తారో వాళ్ళకే తెలియదు. అంతే కాదు...

వయసులో వున్న వారికి సంపాదించటం ఖర్చుపెట్టటం పెద్ద లెక్కకాదు. కాని వయ సు మళ్ళినవారు?

వారు పనిచేయలేరు. కుక్కిమంచంలో పడుకుని వేరే ఆధారం లేక 'అన్నమోరామ చంద్రా' అని అలమటించాల్సిందే!!

ఇప్పటికే ఒకతరం ఆ వృద్ధకార్మికులు, రోడ్లపై అడుక్కుంటూ, నిరాశ, నిస్పృహలతో చావుకోసం ఎదురుచూస్తూ చావలేక బతుకు తున్నారు.

ఈ కార్మికులకు ఒక కర్మాగారంలో పనిచే సేవారిలా పెన్షన్‌గాని, ప్రావిడెంట్ ఫండ్‌గాని వుండదు. ఏదయినా ప్రమాదం జరిగితే ఓన ర్లు దయతలిచి ఇచ్చేది తప్ప వేరే సాయం ఉండదు. కాలో చెయ్యోపోగొట్టుకుంటే వారి చ్చిన నాలుగైదువేలు కాంపన్సేషన్ తీసుకొని, అది హాస్పిటల్‌కి పోగా, ఇక అడుక్కోవటమే వారికి మిగిలింది! అలాటి అభాగ్య జీవులు ఎందరో!

వీరు ఒక పనిని కాంట్రాక్టు తీసుకొని చేస్తారు. వెంటనే డబ్బు తీసుకుంటారు. దా నితో యజమానికీ, కార్మికునికీ బంధం తెగి పోతుంది. అంతే.

ఉదాహరణకి ఒక గనిలో ఒకరోజు పది టన్నుల రాయి తవ్వి లారీలకెత్తుతారు. అంటే ఆ రోజుతో ఆ డబ్బు తీసుకుని వెళ్ళిపోతారు. రేపు అదే గనిలో పనికి రావా లని వారికేం లేదు. ఇష్టమయితే వస్తారు. లేకపోతే వేరే గనికి పోతారు. అందులో స్వేచ్ఛవుంది. ఇగో శాటిస్‌ఫాక్షన్ వుంది. కాకుంటే లేనిది భద్రత! అది వారికి అర్థంకా దు.

చుట్టుపక్కల గ్రామాల సన్నకారురైతులు కూడా వ్యవసాయపు పనులు లేని రోజుల్లో అక్కడికి వచ్చి పనిచేసి ఎంతో కొంత సంపా దించుకుని వెళుతుంటారు. అందుచేత ఒక్కో సారి మనుషులు ఎక్కువ అవుతారు. అయి నా కావాల్సినంత పని వుంది గనుక సమస్య లేదు.

అయితే ఎవరూ రేపటి గురించి ఆలో చించరు.

గనులలో, బట్టీలలో పనిచేసే కార్మికులు సుమారు రెండువేలమంది ఉంటారు. రెండు వందల బట్టీలున్నాయి. బట్టీకి రెండు ట్రా క్టర్స్ అవసరమవుతాయి. డ్రైవర్లు, క్లీనర్లు , మెకానిక్‌లు, లారీ బ్రోకర్ ఆఫీసువారు, లా రీల ఓనర్లు సుమారుగా పదివేలమంది దీనిలో బతుకుతున్నారు.

అయితే దీనిలో ఆ భద్రత లేనిది కార్మికుల కే!

గవర్నమెంట్‌వారు ప్రతి బట్టీకి, గనికి కార్మికులకు ప్రావిడెంట్‌ఫండ్ సౌకర్యం కలు గజేయాలని చట్టాలు చేసింది.

కాని, ఏ బట్టీలోను ఎవరూ శాశ్వత ఉద్యోగులు కారు. కార్మికులు కారు. నిజానికి ఒక్కో కార్మికునినుండి నెలకు వందరూపా యలు ప్రావిడెంట్‌ఫండ్ కింద, ఇన్స్యూరెన్స్ కింద తీసి అంతే మొత్తం యాజమాన్యం కూడా జమచేసి గవర్నమెంట్ దగ్గర వుంచాలి. యాజమాన్యంవారు వారి బంధు వుల పేర్లు వ్రాసి అలా కడుతుంటారు. కార్మికులకు విషయం తెలియదు గనుక కట్టాలనీ వారు అనుకోరు.

ఇంకో ముఖ్యమైన విషయం ఏమిటంటే- కార్మికులకు ప్రత్యేకంగా హాస్పటల్ వుండాలి.

అది అసలు లేదు. బట్టీలనుండి వచ్చే విషవాయువులకు, పొగకు, ధూళికి పదేళ్లనుండి ఇరవైఏళ్లవరకు పనిచేసిన కార్మికులలో ఊపిరితిత్తులకు సంబంధించిన వ్యాధులు, టి.బి. వస్తుంటాయి. వారు జాగ్రత్తగా మందులు వాడరు. అదీగాక ఖరీదయిన మందులవి. కార్మికులు ఆ వ్యాధులతో మరణించినా, దానికి బట్టీ యాజమాన్యం ఏ బాధ్యతా వహించాల్సిన పనిలేదు అనే వింతధోరణి, తెలియనితనం కార్మికులలో వుంది.

ఉండటానికి మూడు నాల్గు కార్మిక సంఘాలున్నాయి. అవి కాంగ్రెస్, తెలుగుదేశం, కమ్యూనిస్ట్ పార్టీలకు సంబంధించినవి. కాని వాటి ఉనికి ఎప్పుడూ కనిపించదు. కేవలం బోర్డులు, పేర్లు వుంటాయి అంతే! కార్మికులలో తాము ఎలా దోచుకోబడుతున్నాము అనే చైతన్యం రాలేదు.

ఎందుకంటే వారు మూడు నాలుగేళ్లకొకసారి కూలీరేట్లు పెంచాలంటారు. వారు పెంచుతారు. టన్నుకు అంతకుముందు 30 రూపాయలు ఇచ్చేవారల్లా వీరడిగేసరికి ఏభై రూపాయలు చేశారు. వీరికి రేటు పెంచినా వారు నష్టపోయేదేం వుండదు. పచ్చిరాయి రేటు పెరుగుతుంది, సున్నపురాయి రేటు పెరుగుతుంది, సున్నంరేటు పెరుగుతుంది. యజమానికి నష్టం ఏమీ వుండదు. నష్టపోయేది వినియోగదారుడే! దీనికి నియంత్రణ లేదు.

గనులశాఖవారు కూడా అంతకుముందు పచ్చిరాయిపై సీనరేజి వసూలు చేసేవారు. అయితే ఏ గనిలో తవ్వకం జరుగుతుందో వారికి అర్థం అయ్యేదికాదు. అందుకుని వారు పద్ధతి మార్చారు.

వచ్చే ప్రతి సున్నపులారీవారూ వారే ఎన్ని టన్నుల రాయిని కొట్టింది దానికి సీనరేజి కట్టినట్లు చలానా చూపించి 'లేబిల్' తీసుకోవాలి. దీనితో ప్రభుత్వ ఆదాయం పెరిగింది. కాని అక్రమగనుల తవ్వకం ఎక్కువయింది. ఒక లీజ్ వున్న గని యజమానినుండి టన్నుకు రెండు రూపాయలు అధికంగా చెల్లించి సీనరేజి సృష్టిస్తారు వ్యాపారులు. నిజానికి లీజ్‌వున్న ఆ గనిలో అసలు తవ్వకమే ఉండకపోవచ్చు. ఎందుకంటే అది నాసిరకపు రాయి. అలా కొందరు గని యజమానులు బాగుపడ్డారు.

గనిని లీజ్‌కి సంపాదించటం చాలా కష్టం. అందుకని గని పడ్డ పట్టాదారు రహస్యంగా వ్యాపారస్తునికి సరుకును అమ్ముకుంటాడు. అది అతడికి లాభం. ఏదయినా ప్రభుత్వానికి ఆదాయం వస్తున్నది గనుక ఎవరూ పట్టించుకోరు. ఇదికాక ప్రతిస్థాయిలోనూ మామూళ్లున్నాయి.

ఆరోజు బట్టీ దగ్గర వెంకటేశం హుషారుగా వున్నాడు. ఆరోజు మేస్త్రీ రాలేదు. తనే రాయి ఎంత కాలిందీ చూసి సున్నపురాయిని దింపించాలి. అక్కడే నిపుణత అవసరం. దానిని గనుక బట్టీ యజమాని గుర్తిస్తే అతడే మేస్త్రీ అవుతాడు. తనకింద కూలీలను ఏర్పాటు చేసుకొని మూడు నాలుగు బట్టీలకు మేస్త్రీగా పనిచేయవచ్చు.

దాదాపు పదకొండు గంటలయింది. రాయి సరిగ్గా కాలటంతో, వెంకటేశం దగ్గరుండి కూలీలతో సున్నాన్ని రాయిని బయటకు లాగిస్తున్నాడు రోజుకు దాదాపు పది టన్నుల సున్నం దిగుతుంది. కింద ఎంత సున్నం తీస్తారో పైన అంత పచ్చిరాయి బొగ్గుపోయాల్సి వుంది. తమ టైం అయిపోవటంతో కార్మికులంతా త్వరత్వరగా సున్నం, రాళ్లు బయటకు లాగుతున్నారు దంతెలతో. దానిని తీసుకెళ్లి కొంచెం దూరంగా ఆరబోస్తున్నారు కొందరు.

పైన రాయి, బొగ్గు నింపే కార్మికులు కూడా హుషారుగా పనిచేస్తున్నారు. సున్నం వడిగా లాగటంతో పైన ఆరడుగుల గ్యాప్ వచ్చింది. హుషారుగా దానిని నింపుతున్నారు వారు. ఒక గంటలో అది నిండకపోతే ఇంకా ఎక్కువసేపు పనిచేయాల్సివస్తుంది.




కింద సున్నం ఆరబోస్తునవారు కూడా గబగబా ఆ పని అందుకున్నారు. ఎందుకంటే-వాళ్ళది కాంట్రాక్టుపని. అందరూ సమానమైన గంటలు పనిచేయాల్సిందే. ఒక కార్మికుడెవరయినా పనిదొంగ అయితే మిగతా కార్మికులు ఊరుకోరు. మాట వినకపోతే మేస్త్రీ అతడిని పనినుండి తొలగించి మరొకడిని తీసుకుంటాడు. అందుకుని అందరూ తెలిసిన మురాలోనే వుంటుంటారు.

పల్లెగీతాల హోరులో, హుషారుగా వడివడిగా బట్టీపైకి వెళుతున్నారు. అది 'డోన్' వైపు బట్టీకావటంతో, బొచ్చె నెత్తిన పెట్టుకుని హుషారుగా పైకి సాగుతున్నారు వారు. చకచకా బట్టీ నిండిపోతోంది. ఒక కార్మికుడు హుషారుగా బొచ్చెను నిపుణతతో తిప్పబోయి, ఆ విసురుకు బొచ్చెనే లోపలపడేశాడు. "అరెరె..." అన్నారు తోటికార్మికులు.

ఎందుకంటే బొచ్చెలు సలకపారలు వారి స్వంతమే. అవి పోతే వారే కొనుక్కోవాల్సి వుంటుంది.

"అరేయ్ ఎవరయినా లోనికి దిగి బొచ్చెను తీయండిరా..." అరిచాడు అతను. బట్టీ ఏమో ఐదడుగుల లోతున వుంది. అతడికి నలభై సంవత్సరాల వయసుంటుంది. దిగి వెంటనేపైకి ఎక్కలేడు.

అంతలో శ్రీను అక్కడకు వచ్చాడు బొచ్చెతో.

"ఒరేయ్ శ్రీనూ త్వరగా దిగి నా బొచ్చెపైకి విసిరేయిరా..." బ్రతిమిలాడాడతను. అది సర్వసాధారణంగా జరుగుతుండేదే. ఒక్కోసారి చెప్పులుపడి, లేక కాలు జారి లోపలకు పడుతుంటారు కార్మికులు. అయితే బట్టీ అడుగునుండి కాలుకుంటూ వస్తుంటుంది. అందుచేత అడుగున ఎంత ఉష్ణోగ్రత ఉన్నా పైన వేడి వుండదు. కేవలం చెప్పులు వేసుకుంటే సరిపోతుంది. "సరే"నని పక్కనున్న కొక్కేనికి తాడుకట్టి దాని సాయంతో లోనికి దిగాడు శ్రీను. బొచ్చెను విసురుగా పైకి విసిరేశాడు. అయితే అది పైన పడక తిరిగి బట్టీలోనే పడింది. మళ్ళీ విసిరాడు శ్రీను. ఈసారి పైకి పోలేదు. అది శ్రీనుకు ఆయాసంగా వుంది. ఎగశ్వాస మొదలైంది.

బట్టీ పది అడుగుల వ్యాసార్థంతో వుంటుంది. అడుగున కాల్పుడునుండి కార్బన్ మోనాక్సైడ్ వాయువు వస్తుంటుంది. అది మనిషికి చాలా ప్రమాదం. శ్రీను కొంచెం లోపలకు దిగటంవలన పైనుండే ఆక్సిజన్ అతడికి అందటం లేదు. అందుకే ఉక్కిరిబిక్కిరి అయిపోయాడు. ఊపిరాడక రొప్పుతున్నాడు. "అరెరె... శ్రీనుకి ఊపిరాడటంలేదు. త్వరగా బయటకు తీయండి" అంటూ గబగబా తనూ లోపలకు దిగాడు బొచ్చె పారేసుకున్నతను. అతనికి లోపలికి దిగేసరికే ఆయాసం వచ్చింది. శ్రీను దగ్గరకు వెళ్లేసరికే గసపెట్టాడు. క్షణాలలో ఆ విషవాయువుకు స్పృహ తప్పి అడ్డంగా పడిపోయాడు. అది మరీ ప్రమాదం. అక్కడ విషవాయువు ఎక్కువుంటుందని వారికి తెలుసు. అందుకని అతడిని లేవదీయటానికి ఇద్దరు యువకులు ఎగిరిదూకారు.

అంతే... స్...స్. అని శబ్దం వచ్చింది. మామూలుగా దిగకుండా వారు దూకటంతో ఆ వూపుకు కిందవున్నరాయి, బొగ్గుకుంగింది. అదీగాక అడుగున సున్నం లాగేకొద్దీ పైనున్న రాయి బొగ్గు కిందకు జారుతూవుంటుంది. అందుచేత అది కుంగటం జరగదు.

కాని అంతకుముందురోజు బొగ్గు ఎక్కువకావటంతో సున్నం చిల్లెం కట్టింది. అది పాకంలా చుట్టూగోడలకు కరుచుకుంటుంది. అందుచేత రాయి బొగ్గూ పూర్తిగా కిందకు దిగలేదు. రెండడుగుల ఖాళీ వుంది.

వీరు దూకటంతో చుట్టూ గోడవేపు గట్టిగా వుండటంవల్లన మధ్యలో గోయిలా ఏర్పడి దానిలో కూరుకుపోయారు వారు. శ్రీను, మరో అతను వారిపై దొర్లారు కాలు బెసికి. వారిమీద చుట్టూ వున్నరాయి బొగ్గు ఒక్కసారిగా పొర్లింది. క్షణాలలో నలుగురూ ఆ

రాయీ బొగ్గు కింద సమాధి అయిపోయారు. పైన వున్నవారు భయంతో ఆక్రందనలు చేశారు.

వెంకటేశం పరిగెత్తుకుంటూ పైకి వెళ్ళాడు. కాని ప్రయోజనం ఏమిటి? అడుగున పడుకొని ఒక్క నిమిషం వుంటేనే మనిషి మరణిస్తాడు. ఇక కిందకు జారితే ఆ వేడికి క్షణాలలో బొగ్గుగా మారిపోతారు. మరునటిరోజు వారి బూడిద కిందకు దిగుతుంది అంతే.

బట్టీని మధ్యలో ఆర్పేసే వీలులేదు. అవకాశమూ లేదు.

"శ్రీనూ!" రక్తనాళాలు పగిలేలా కేకపెట్టాడు వెంకటేశం. ఉరికి లోపలికి దిగబోతున్నాడు. పక్కనున్నవారు అతడిని పట్టుకుంటున్నారు.

క్షణాలలో ఆ ప్రదేశమంతా ఆక్రందనలతో నిండిపోయింది. చుట్టుపక్కల బట్టీలవారు పనిమానేసి అక్కడకి పరుగెత్తుకువచ్చారు. అందరిముఖాల్లో విషాదం. తమ తోటి కార్మికులు చనిపోయారే అని. కాని ఏం చేయగలరు? అలాటి అవకాశం కోసమే కనిపెట్టుకుని వున్న మూడు కార్మికసంఘాల నాయకులూ పరిగెత్తుకొచ్చారు. ఒక ట్రాక్టర్ శేషయ్యను, తిరుపతమ్మను తీసుకురావటానికి వెళ్ళింది.

గుమాస్తా ఫోన్ చేయటంతో, యజమాని వెంటనే మోటార్‌సైకిల్ వేసుకుని అక్కడకు వచ్చాడు. జరగబోయేది అతడికి తెలుసు. తను చనిపోయినవారికి కాంపన్సేషన్ ఇవ్వాలి. అది వీలయినంత తక్కువ తక్కువగా వుండేట్లుగా చూడాలి. అందుకోసం తన తోటి బట్టీ యజమానులను కూడా ఫోన్ చేసి పిలిపించుకున్నాడు. వారంతా అతడి ఆఫీస్‌లో కూర్చున్నారు. వారి ఎదురుగా యూనియన్ లీడర్లు కూర్చున్నారు. చర్చలు ప్రారంభమయ్యాయి.





శేషయ్య తిరుపతమ్మ రాజమ్మ వెంకటేశం గుండెలు పగిలేలా రోదిస్తున్నారు. ఏ ప్రమాదంలోనయినా, హత్యలోనయినా కనీసం శవాన్ని చివరిసారి చూసుకునే అవకాశం వుంది. కాని, ఈ ప్రమాదంలో ఆ అవకాశమూ లేదు. "అమ్మా... నేచదువుకుంటానే బట్టీకి వెళ్లనే" అని మొదట్లో గునిగిన శ్రీను గొంతు ఆమె చెవుల్లో మారుమ్రోగుతున్నాయి.

"అయ్యా... మన పొలం వాడెవడో లాక్కుండంటగదా? నేను బట్టీలలో బాగా సంపాదించి ఆ పొలం మళ్లీ కొంటానే..." తను చూసొచ్చిన సినిమా కథ చెప్పి హీరోలా ఫీలవుతూ తండ్రితో అన్న వాడి మాటలు శేషయ్య చెవుల్లో గింగురుమంటున్నాయి.

"అక్కా... నిన్ను మాలా కాయకష్టం చేసే ఇంట్లో పెళ్లి చేయమే. ఉద్యోగం చేసే కుర్రాడిని చూసి ఎంత కట్నమయినా ఇచ్చి పెళ్లి చేస్తామే... ముగ్గురు మొగాళ్లం సంపాదిస్తా వుండాం. నీకోసం ఆమాత్రం ఖర్చుపెట్టలేమా?"

రాత్రి అక్క పక్కలో పడుకుని ఎవరూ వినకుండా తనతోనే చెప్పిన ఆ మాటలు తిరుపతమ్మ హృదయంలో గింగిర్లు కొడుతున్నాయి.

కనీసం వాడి శవాన్ని చూసే అవకాశమేనా లేదు. ఆ బట్టీయే వాడి చితి. ఆ బట్టీయే వాడి సమాధి. పమిట నోట్లో కుక్కుకుని వెక్కి వెక్కి ఏడుస్తోంది తిరుపతమ్మ. ఇసాయేల్, మరియమ్మ వచ్చారు వారిని ఓదార్చటానికి.

"ఈ పూట చేపల పులుసు చేయవే అమ్మా పెందలాడే వస్తానని చెప్పి వెళ్ళాడమ్మా నా కొడుకు. నా బంగారుతండ్రి. ఇలా అటాత్తుగా వదిలి వెళ్లిపోతాడనుకోలేదమ్మో. ఇప్పుడా చేపల పులుసు ఎవరికి పెట్టేదిరో దేవుడో... నాకెంత అన్యాయం చేశావురా భగవంతుడా..."

చేతికందివచ్చిన కొడుకును పట్టుకెళ్లావుగ

దరో-" మరియుమ్మ గుండెల్లో తలదూర్చి, గుండెలు బాదుకుంటూ ఏడుస్తోంది రాజమ్మ.

శేషయ్య నిర్వేదంగా శూన్యంలోకి చూస్తూ వుండిపోయాడు. మిగతావారి ఆక్రందనలతో ఆ ప్రాంతమంతా ఒక్కసారిగా శ్మశానంలా మారిపోయింది. ఆ బట్టీనుండి నీలిరంగు పొగ రింగులుగా తిరుగుతూ వస్తూనేవుంది. బొగ్గూ రాయితోపాటు మనుషులని కాలుస్తున్న రాక్షసునిలా కనిపించింది ఆ బట్టీ శేషయ్యకు. ఆ బట్టీకేసి తలబాదుకున్నాడు శేషయ్య.

ఇస్రాయేల్ వెళ్లి ఆపాడతన్ని.

బట్టీకి సంబంధించిన వారు వచ్చి వారిని సముదాయించి ఇళ్లకు పంపటానికి ప్రయత్నం చేస్తున్నారు. గొడవయితే పోలీసులొస్తారు. కేసు. లేబర్ ఇన్‌స్పెక్టర్ వస్తాడు. వారికి మామూళ్లు. అదీ వారి భయం. అవేవీ లేకుండా ఆ డబ్బేదో నాయకులతో మాట్లాడి ఇస్తామని చెప్పి వారిని సముదాయిస్తున్నారు. కేసు పెట్టినా, వారికొచ్చే కాంపన్సేషన్ తక్కువే. అదీ ఎప్పటికి వస్తుందో అని చెప్పి సర్దిచెప్పి పంపిస్తున్నారు.

అక్కడ నిలబడి తమ పుత్రుని శవాన్ని కాలుస్తున్న ఆ మంటలు లేచి చితిని, కప్పు లేని సమాధిని చూడలేక, ఇంటికి బయల్దేరారు వెంకటేశం, రాజమ్మ తిరుపతమ్మ. శేషయ్య అక్కడే వుండిపోయాడు ఇస్రాయేల్‌తో పాటు.



ఆ సున్నపు బట్టీ ఆఫీస్ రూంలో చర్చలు జరుగుతున్నాయి. కార్మిక నాయకులకు, బట్టీ ఓనర్స్‌కి మధ్య.

"మన ఒప్పందాలు మీకు తెలుసు" అంటున్నారు బట్టీ ఓనర్స్.

వాటికి మేం అంగీకరించం అంటున్నారు నాయకులు.

ఆ ఒప్పందాలేమిటంటే-

అక్కడ పనిచేసేవి సుమారు నాలుగు వందల ట్రాక్టర్లు, టిప్పర్లు, లారీలు వున్నాయి. అన్నిటికీ లైసెన్స్ వున్న డ్రైవర్లు దొరకటం సాధ్యం కాదు. అందుకని రెండురోజులు క్లీనర్‌గా పనిచేసిన వాడల్లా డ్రైవర్ అయిపోతున్నాడు. ఇలా సరిగా డ్రైవింగ్ రానివారివల్ల, ఏక్సిడెంట్స్ ఎక్కువ జరుగుతున్నాయి. ఒక్కోసారి ఊళ్లోని కొట్లలోకి, హోటళ్లలోకి ట్రాక్టర్లు వెళ్లటం సర్వసాధారణం. అందుకని అక్కడివారంతా కలిసి ఒక నిర్ణయానికొచ్చారు. ఎవరైనా ట్రాక్టర్ కిందపడి మరణిస్తే పదివేలు ఇవ్వాలి. అంతే ఇక ఏ కేసూ పెట్టరాదు. కాలుగాని, చెయ్యిగాని విరిగితే ఐదువేలు ఇస్తారు. ఆ డబ్బు డ్రైవరే కట్టుకుంటాడు. అది అప్పుగా ఇచ్చి జీతంలో కోసుకుంటాడు ఓనర్. అందుకని రోజుకో ఏక్సిడెంట్ ఎక్కడో అక్కడ అయినా అది బయటకు రాదు. కేసు పెట్టబడదు. కేసు పెట్టిన ఎన్నోఏళ్ల తరువాత డ్రైవర్‌కి ఆరునెల్ల జైలు, రెండువేల జరిమానా, కాంపన్సేషన్ పదివేలు మాత్రమే వచ్చేది. దానివల్ల ఎంత లాస్. అందుకని ప్రజలు కూడా దానికి అంగీకరించారు.

కోడి చస్తే ఇరవైరూపాయలు, మేక చస్తే రెండువందలు, పొట్టేలు చస్తే ఐదువందలు... అవీ రేట్లు!

ఇక గనులలోగాని, బట్టీలలోగాని ప్రేలుళ్లలో, ప్రమాదాల్లో మరణిస్తే ఇచ్చే సొమ్ము ఇరవైవేలు. కాలు చేయికి విడివిడిగా ఐదువేలు. దీనికి కార్మికనాయకులు కూడా అంగీక

రించారొకప్పుడు.

అదే గుర్తుచేస్తున్నారు బట్టీ యజమానులు.

"కాదు అన్నీ రేట్లు పెరిగాయి. ఇదీ పెరగాల్సిందే. చనిపోయిన మనిషికి లక్షరూపాయలు ఇవ్వాల్సిందే'' పట్టుబడుతున్నారు.

"చూడండి... మనం ఎప్పుడూ ఒకేమాట మీద వుంటాం. మా మాట వినండి. మీ అసోసియేషన్లకి పదివేల చొప్పున బట్టీ యజమానుల సంఘం తరపున విరాళాలుగా ఇస్తాం"

లొంగలేదు నాయకులు.

ఒక బట్టీ ఓనర్ బయటకువచ్చి, పక్క బట్టీనుండి దాదాకి ఫోన్ చేశాడు. వివరంగా విషయాలు చెప్పాడు.

చర్చలు సాగుతూనే వున్నాయి. కారులో అక్కడ దిగాడు దాదా. అందరూ సవినయంగా అతడిని ఆహ్వానించారు. మధ్యలో ఆశీనుడయి అందరూ చెప్పేది వివరంగా విన్నాడు.

"మనం ఇంతకుముందు ఒక అంగీకారానికి వచ్చినమాట నిజమే. కాని నాయకులు అన్నట్లు రేట్లు పెరిగాయి కదా. చచ్చినవారికి తలా పాతికవేలు ఇవ్వండి. ఈ నాయకులకు తలా పదిహేనువేలు చందా ఇవ్వండి'' ఎవరో ఇచ్చిన కూల్‌డ్రింక్ తాగి అన్నాడు దాదా.

ఎవరూ మాట్లాడలేదు.

ఇప్పుడు దాదా చూడటానికి ఒక ఎమ్మెల్యేలాగా వుంటాడు. అంచున్న ఖద్దరు పంచె, ఖరీదయిన శిల్కులాల్చీ, మెడలో పులిగోరు గొలుసు, నుదుట బొట్టు, ఎడమచేతిలో చిన్న స్టిక్.

"ఇది ఫైనల్' చెప్పి లేచాడు దాదా. వారంతా అతడికి కారుదాకా వచ్చి కారు ఎక్కించారు.




"బట్టీ ఓనర్ ఎవరు?" అడిగాడు దాదా.

"నేను సార్' దగ్గరగా వస్తూ అన్నాడొకతను. "నాకో పదివేలకు చెక్‌రాసి సాయంత్రం పంపించు'' కొంచెం వంగి మెల్లిగా అన్నాడు అతడికే వినపడేట్లు. "అలాగే సార్' సంతోషంగా అన్నాడు అతడు. "పోలీస్ కేస్ మాత్రం కాకుండా చూడండి'' అన్నాడు.

అప్పటికప్పుడు వెళ్ళి కారులో కాష్ పట్టుకొచ్చాడు గుమాస్తా, అప్పటికే బ్యాంక్ టైం అయిపోయినా, బ్యాంక్‌నుండి.

డబ్బు అందరికీ ప్రామిస్ చేసినట్లుగానే ఇచ్చేశారు. నాయకులు మృతుల తరపు డబ్బు పట్టుకొని మృతుల బంధువుల తరపు వారి దగ్గరకు వచ్చారు. ముందు శేషయ్య దగ్గరికి వచ్చాడు.

"శేషయ్యా! అతికష్టంమీద ఐదువేలు కాంపన్సేషన్ పెంచాం. మనం కోర్టుకెళ్ళినా అంతకుమించి రాదు'' అని చెప్పి ఇరవైరెండువేలు చేతిలో పెట్టారు. "మీరు, మీ కుటుంబంవారు ఇంతవరకు అసోసియేషన్ సభ్యత్వం కట్టలేదు. మూడు అసోసియేషన్లతో మీ సభ్యత్వం నమోదుచేసి రసీదు రేపు పంపిస్తాం" అన్నారు.

అసలే కడుపు పగిలేలా రోదిస్తున్న శేషయ్యకు అదేమీ పట్టలేదు. నిర్వికారంగా ఆ డబ్బు అందుకుని ఇస్రాయేల్‌తో కలిసి ఇంటికి నడిచాడు.

"నీ కొడుకు ప్రాణంఖరీదు ఇరవైరెండు వేలే' డబ్బు రాజమ్మ ఒళ్ళో పోసి రోదిస్తూ అన్నాడు శేషయ్య.

పాతకాలపు తాలూకా, సమితి హెడ్‌క్వార్టర్, ఇప్పుడు మండల హెడ్‌క్వార్టర్, మేజర్ పంచాయతీ, మున్సిపాలిటీ కాదగ్గ హంగులు వున్న ఆ వూరిలో వున్న ఆటవిక న్యాయం అది.

సాయంత్రం ఆరుగంటలకు అతడి ఇంటి ముందు పోలీస్‌జీప్ ఆగింది. వెనుకనించి ఇద్దరు కానిస్టేబుల్స్ గబగబా లోనికొచ్చారు. 'శేషయ్య ఎవరు?' అనుకుంటూ.

"నేనే బాబూ..." లేచి డగ్గుత్తికతో అన్నాడు శేషయ్య. అతడికి పోలీసులంటే భయం. వారి గురించి అతడికి అన్ని విషయాలూ తెలుసు.

"యస్.ఐ.గారు పిలుస్తున్నారురా"

గబగబా బయటకు వచ్చి తలగుడ్డ చుట్టుకుని నమస్కరించాడు శేషయ్య.

"ఏరా... నీ కొడుకు బట్టీలోపడి చచ్చిపోయాడటనే? మాకు రిపోర్ట్ ఇవ్వాల్సిన పనిలేదా? మీరూ మీరూ రాజీపడి నీవు డబ్బు తీసుకుంటే సరిపోతుందనుకున్నావా? ఎక్కు జీపు. కేసు రాయాలి. డబ్బు తీసుకోవటమైతే తెలుసుగాని సివిల్‌సెన్స్ లేదు. కేసు పెట్టాలని తెలీదూ" అతడి గుండెలపై లాఠీ ఆనించి అన్నాడు ఎస్.ఐ.

గజగజా వణికిపోతున్నాడు శేషయ్య "పో... జీపెక్కు. స్టేషన్‌లో నీ విషయం ఆలోచిస్తాం" లాఠీతో శేషయ్యను వెనకకు నెట్టి అన్నాడు.

శేషయ్య భయపడుతూ వెనుకకు నడిచాడు. హెడ్‌కానిస్టేబుల్ అతడిని పక్కకు తీసుకెళ్లాడు. "నీవెక్కడ అమాయకుడివయ్యా! కేసు పెడితే నీకు డబ్బేలా వస్తుంది. నాలుగేళ్లు కోర్టుచుట్టూ తిరిగాక ఆ ఖర్చులన్నీ పోను నాలుగైదు వేలు మిగుల్తాయి. అందుకని నా మాట విని, అయ్యగారిని తృప్తిపరుచు. ఒక ఐదువేలు అయ్యగారికి ఒక వెయ్యి, నాకు ఇచ్చావనుకో ఇక కేసే వుండదు. ఆపై నీ ఇష్టం... ఆలోచించుకో"

కాసేపు ఆలోచించి హెడ్‌కానిస్టేబుల్‌ని లోపలకు పిలిచాడు శేషయ్య. ఆరువేలు తీసి అతడి చేతిలోపోశాడు. చెట్టంత కొడుకే పోగా ఈ డబ్బు ఎందుకు? అనే వైరాగ్యం అతడిలో వుంది.

అతడు జీపులోకి ఎక్కుతూనే, "పాపం అమాయకుడు సార్... వదిలేయండి" చుట్టూ మూగిన జనం వినేట్లుగా అన్నాడు. అంటే పని అయిందని అర్థం.

"సరే శేషయ్యా! అందరూ చెబుతున్నారు గనుక వదిలేస్తున్నాను. జాగ్రత్తగా వుండు" అన్నాడు ఎస్.ఐ. జీప్ పోనివ్వమని డ్రైవర్‌కి చెబుతూ.

జీప్ కదలగానే జేబులోంచి మూడువేలు తీసి ఎస్.ఐ.కి ఇచ్చాడు హెడ్ కానిస్టేబుల్. "జీప్ బట్టీ ఓనర్ దగ్గరకు పోనియ్" అన్నాడు ఎస్.ఐ. డబ్బు హిప్ పాకెట్లో పెట్టుకుని. అక్కడో పది వేలొస్తాయి!

ఆ రాత్రి ఎవరూ నిద్రపోలేదు శేషయ్య ఇంట్లో. రాజమ్మ ఏడుస్తూనే స్పృహ తప్పి పడిపోయింది. తిరుపతమ్మ ఆమెకు సపర్యలు చేస్తున్నది. వెంకటేశం శూన్యంలోకి చూస్తూ కూర్చున్నాడు.

తెల్లవారుతుండగానే ఇంటిముందు మోటార్‌సైకిల్ ఆగింది. లేబర్ ఇన్స్‌పెక్టర్‌గారు, అసిస్టెంట్ దిగి శేషయ్యదగ్గరకు వచ్చారు విచారించుకొని.

"చూడు శేషయ్యా! ఇది కార్మికులకు జరిగిన అన్యాయం. దీనిని అరికట్టడానికే మేం వుంది. కేస్ బుక్ చేయాలి... వివరాలు చెప్పు" అన్నాడు ఒక బుక్ తీస్తూ.

అసిస్టెంట్‌ని పక్కకు రమ్మని 'ఎంత?' అన్నాడు శేషయ్య విషాదంతో, వైరాగ్యంతో.

"భలే తెలివయినవాడివే?" శేషయ్య భుజంతట్టి అన్నాడు అసిస్టెంట్.

"అయ్యవారికి మూడు, నాకు రెండు"

మౌనంగా ఇచ్చి పంపించాడు శేషయ్య.

మరో అరగంటలో కరణాల బదులుగా వచ్చిన విలేజ్ అసిస్టెంట్, ఆర్ఐ వచ్చారు అతడు కొత్తగా కొన్న సుజుకి మోటార్‌సైకిల్ మీద. వారిద్దరికి చెరో వెయ్యి, ఎమ్మార్వోకి వెయ్యి తీసుకుపోయారు.

తరువాత దాదా మనిషి వచ్చాడు దాదా రెండువేలిమ్మన్నాడంటూ. దాదా సంగతి తెలుసు గనుక మాట్లాడకుండా ఇచ్చేశాడు శేషయ్య. ఇంట్లోకి వచ్చాడు ఇస్రాయేల్ శేష



య్యవెంట. అక్కడున్న డబ్బుకట్టను అందు కుని లెక్కబెట్టాడు. మిగిలింది ఏడువేలు!

"దొంగనాకొడుకులు.. శవాలమీద డబ్బు లేరుకున్నే లుచ్చాలు..." కసిగా తిట్టాడు.

శేషయ్య తిట్టలేదు. అసలు ఏమీ అనలే దు. శూన్యంలోకి చూస్తూ అలానే వుండిపో యాడు.

కాసేపాగి అన్నాడు, "ఇస్రాయిలూ రెండు పొట్లాలు తెచ్చిపెట్టు" అని. అతడి బాధ అర్థం అయిన ఇస్రాయేల్ బయటకు వెళ్లాడు డబ్బు తీసుకుని.

ఇక వారంరోజులపాటు బయటకు వెళ్లలే దు శేషయ్య. ఇంట్లో ఎవరూ కూడా పనికి వెళ్లలేదు.

కొడుకు చావగా వచ్చిన డబ్బుతోటే సంసారం గడుస్తోంది. శేషయ్యకు మందూ దొరుకుతోంది.

* * *

'శ్రీకుసుమ హరనాథ ఆర్యవైశ్య కాఫీ మరియు



భోజన హోటల్ అనేది ఆ వూర్లో ప్రసిద్ధి చెందిన హోటల్. రుచికి, శుచికి, వినయానికి, త్వరగా సప్లైకి పేరుమోసింది. మెయిన్‌రోడ్డులో బస్‌లు ఆగే ప్రదేశానికి (బస్టాండు కాదు) దగ్గరగా వుందా హోటల్. ప్రతి బస్సూ అక్కడే ఆగుతుంది కాఫీ, టీ, భోజనాలకు. ఎప్పుడూ వచ్చేపోయే కష్టమర్లతో కళకళలాడుతుంటుంది.

ముందుగా డెకొలామ్ షీట్ వేసిన పెద్ద కౌంటర్, దాని వెనుక రివాల్వింగ్ ఛెయిర్, వెనుక గోడకు స్వామి అయ్యప్ప, కుసుమహరనాధులు, ఏసుక్రీస్తు, వెంకటేశ్వరస్వామి ఫొటోలు, పక్కగా పెద్ద కేలెండర్ వుంటాయి. కౌంటర్‌కి ఒకపక్కగా వున్న మినీ కూలర్ ఎపుడూ పనిచేస్తూనేవుంటుంది.

దాని కౌంటర్లో నుదుటున విబూధితో, ఊరిన బుగ్గలతో, తెల్ల ఖద్దరు ఇస్త్రీచేసిన చొక్కా వేసుకొని, తెల్ల ఖద్దరు పంచె లుంగీలా కట్టుకుని కూర్చుని ఎపుడూ చిరునవ్వులు చిందిస్తూ అందర్నీ పేరుపేరునా పలకరిస్తూ వుంటాడు దాని ప్రొప్రైటర్. తలమీద జుట్టంతా రాలిపోయి బాగా బట్టతల అయినా పసుపురంగు దేహఛాయతో, ఎపుడూ ఖుషీగానే కనిపిస్తుంటాడు. అతడిపేరు వెంకటసుబ్బయ్య.

ఆ హోటల్ పెట్టి నాలుగయిదేళ్లవుతోంది. దేవుని దయవలన తిండికి లోపం లేదు జరిగిపోతుంటుంది' అని చెబుతాడు ఎవరయినా అడిగితే. కన్యకాపరమేశ్వరి గుడివద్ద చిన్న ఇల్లు కొనుక్కుని మేడ వేసుకుని వుంటున్నాడు అతడు. కింద పెద్ద హోల్‌సేల్ కిరాణా కొట్టువుంది. దానిని భార్య పరమేశ్వరి చూస్తుంటుంది.

డబ్బులో, ఆస్తిలో రెండడుగులు పైకే ఎదిగినా వెంకటసుబ్బయ్యలో వినయం, విధేయత తగ్గలేదు. పైగా పెరిగింది. దైవభక్తీ పెరిగింది. చాలా గుప్తదానాలు కూడా చేస్తున్నాడు.

అతడు హోటల్ పెట్టేముందే, బజార్లో టిఫిన్ బండి చూసుకోవటానికి తన చుట్టాలబ్బాయిని తన ఊరినుండి తెచ్చాడతను. అతడికి తర్ఫీదు ఇచ్చాకే హోటల్ పెట్టాడు అతడు. ఆ కుర్రాడిపేరు నారాయణ. కుర్రాడు చూడటానికి బావుండటమేగాక బుద్ధిమంతుడు, తెలివిగలవాడు. క్షణాలలో వ్యాపారాన్ని అందుకున్నాడు అతడు. వెంకటసుబ్బయ్య ఉన్నప్పటికంటే వ్యాపారం చాలా అభివృద్ధి చేశాడు. ఇడ్లీ అట్టు, ఉప్మా పూరి, చపాతీ... ఇలా అన్నిరకాల టిఫిన్‌లు వేడివేడిగా చవకగా దొరుకుతాయక్కడ!! వచ్చేపోయే జనానికి అంతేవుండదు.

వెంకటసుబ్బయ్య కూతురు కుసుమకిపుడు పదహారేళ్లు. ఊళ్లోని హైస్కూల్లో టెంత్ చదువుతోంది. తల్లిపోలిక కావటం, వయసు తెచ్చిన అందం, పుష్టిగల ఆహారం, మంచి బట్టలు, నవీన అలంకరణ పద్ధతులవలన మరింత అందంగా కనిపిస్తోంది.

రెండేళ్లక్రితం ఆ అమ్మాయి పుష్పవతి అయినప్పుడు దాదాపు పెళ్లిలా ఆ ఉత్సవాన్ని జరిపించాడు వెంకటసుబ్బయ్య.

పేరంటానికి పిలవటానికి వెళ్లిన ప్రతి ఇంటికి ఒక చిన్న స్టీలుపాత్ర ఇచ్చేవారు.

తొమ్మిదిరోజులూ మేడ అంతా రంగు రంగుల విద్యుద్దీపాలతో అలంకరించారు. ప్రత్యేకంగా మేకప్‌మెన్‌ని పిలిపించి ఆ అమ్మాయికి ఒకరోజు సత్యభామ, మరోరోజు దుర్గ, ఇంకోరోజు కృష్ణుడు... ఇలా రకరకాల వేషాలు వేయించి, సింహాసనంలా అలంకరించిన పూలతెరల మధ్య అమ్మాయినుంచి పేరంటం జరిపేవారు. ప్రతిరోజూ కలర్‌ఫొటోలు, వీడియో తప్పనిసరిగా వుండేవి.

కుసుమ పుష్పవతి అయిన సందర్భంగానే వెంకటసుబ్బయ్య పెట్టిన ఖర్చు యాభైవేలు. మరో యాభైవేలకు కూతురికి బంగారం కొన్నాడు.

వెంకటసుబ్బయ్య కొడుకులిద్దరూ ఎస్.ఎస్.సి పాస్ కాగానే వారిని తెలిసినవాళ్ల




కొట్లో గుమస్తాలుగా చేర్పించాడు. హరనాథబాబుని బట్టల కొట్లో గుమస్తాగా చేరిస్తే రామాంజనేయులిని ఫాన్సీషాపులో గుమస్తాగా చేర్పించాడు.

వారికి ఎంత డబ్బు జీతంగా ఇస్తున్నారన్నది ప్రధానం కాదు. ఎంత తొందరగా పని నేర్చుకుంటున్నారన్నదే ప్రధానం ఆయనకు. మగపిల్లలకు రెండేసి లక్షలు కట్నం ఇస్తామని, తమ వ్యాపారంలో పదిపైసల వాటా ఇస్తామనీ ఆడపిల్లల తండ్రులు అతడి వెంట తిరుగుతున్నారు. కాని ఆయనే దానికి ఇష్టపడటంలేదు.

'ముందు కుమార్తె పెళ్లి చేయాలి' అనేది ఆయన లక్ష్యం.

కుసుమకు సంబంధాలు వస్తున్నాయి. ఉద్యోగస్తులు, వ్యాపారస్తులు వరులలో వున్నారు. అయితే వారెవరినీ అతడు ఇష్టపడటంలేదు. కావాలంటే లక్షలు కట్నం ఇచ్చి ఎలాంటి సంబంధమయినా చేయగలడు వెంకటసుబ్బయ్య.

కాని కష్టించి పనిచేసే తనవాళ్లకే పిల్లనివ్వాలని, అతడిని పైకి తీసుకురావాలనీ అతడి కోరిక. అతడి దృష్టిలో నారాయణ వున్నాడు. తను ఆ బండిమీదే సంపాదించాడు. ఇంతవాడయ్యాడు. కష్టపడే శక్తి, తెలివితేటలుండాలిగాని ఈరోజుల్లో పైకి రావటం ఎంత తేలిక! అదీ అతడి నమ్మకం.

ఎందరో ఊహల్ని తల్లకిందులు చేస్తూ తన కూతుర్ని నారాయణకిచ్చి పెళ్లిచేశాడు వెంకటసుబ్బయ్య. ఆ బండినే అతడికి కట్నంగా ఇచ్చాడు. ఆ బండి రోజూ అక్కడ పెట్టుకున్నందుకు ఇపుడెవరైనా ఇరవై వేలు ఇవ్వటానికి సిద్ధంగా వున్నారుమరి!

వెంకటసుబ్బయ్యకంటే తెలివిగలవాడు నారాయణ. అతడు ఏదీ కావాలని అడక్కుండా పెళ్లి చేసుకున్నాడు సంతోషంగా. అతడికి తెలుసు నాలుగు లక్షలకు తక్కువ అతడికి ముట్టదని!

★ ★ ★

అదే మెయిన్‌రోడ్డులో వెంకటసుబ్బయ్యగారి హోటల్ ఎదురుగా పై అంతస్తులో ఒక బోర్డు వేలాడుతుంటుంది.

'లక్కీస్టార్ షేర్ బ్రోకర్స్ అండ్ ఇన్వెస్టర్స్ - ప్రొప్రయిటర్ జయప్రకాష్'

మెట్లు దాటి వెళ్లగానే ముందు విశాలమైన రూం' ఉంటుంది. అది సీ త్రూ గ్లాసెస్ బిగించబడి, కింద కార్పెట్‌తో ఢిల్లీ ఛెయిర్లతో పెద్ద టేబుల్‌తో ఒకపక్క కూలర్, పైన ఫాన్ ఉంటాయి. టేబుల్‌మీద ఆరోజు దినపత్రికలన్నీ ఉంచబడతాయి. షెల్ఫ్‌లో దలాల్‌స్ట్రీట్ నుండి ఫైనాన్షియల్ ఎక్స్‌ప్రెస్, షేర్‌కాలంలాంటి పత్రికలన్నీ పేర్చబడి వుంటాయి. గేటుపక్కనే బాయ్ వుంటాడు యూనిఫాం వేసుకుని, తలపై టోపీతో. ఎవరే ఆజ్ఞలు ఇచ్చినా చేయటానికి రెడీగా వుంటాడు. పక్క ఒక చిన్న టేబుల్. దానిపై టైప్‌మిషన్. పక్కనే ఫోన్. ఆ ఫోన్ ఎవరయినా ఆఫీస్‌కి వచ్చినవాళ్లు ఉచితంగా చేసుకోవచ్చు. (అది వ్యాపారాభివృద్ధికి ఒక పద్ధతి అని జయప్రకాష్ నమ్మకం) ఆ టేబుల్‌ముందు ఒక పదహారేళ్ల అమ్మాయి కూర్చుని వుంటుంది. ఎపుడూ చెదరని చిరునవ్వుతో, నలగని బట్టలతో. టేబుల్‌మీద సెక్రటరీ అని రాసివున్న త్రికోణాకారపు ప్లాస్టిక్ ఫ్రేం ఉంటుంది. ఎవరు దగ్గరకు వెళ్లినా వినయంగా, చిరునవ్వుతో 'వాట్‌కెన్ ఐ డూ ఫర్‌యూ' అని పలకరిస్తుందామె. షోకేసులోని అందాల బొమ్మలా ఉంటుందామె.

గోడకు గోవాబీచ్ సుందర దృశ్యాలు, చిరునవ్వుల చిన్నారుల ఫొటోలు, ధీరూబాయ్ అంబాని, టాటా, బిర్లాల ఫొటోలు వుంటాయి. 'ధైర్యం, చొరవ విజయానికి తొలి సోపానాలు' అని ఒక గోడపై రాసివుంది. పక్కనే వుడెన్ పార్టీషన్. స్వింగ్‌డోర్ తీసుకొని వెళితే ఒక పెద్ద టేబుల్ వుంటుంది. దానిపై అద్దం, ఒకపక్క పెన్‌స్టాండ్, మరోప

క్క రెండు ఫ్యాన్‌లు ఉంటాయి. వెనుక ఖరీదయిన రివాల్వింగ్ ఛెయిర్.

దానిలో చెదరని జుట్టుతో, చిరునవ్వుతో, నలగని బట్టలతో కూర్చుని వుంటాడు జయప్రకాష్. టేబుల్‌పై ఒకపక్క షేర్ ఆఫీస్ పేరు, కింద జయప్రకాష్ పేరు ఉంటుంది. పక్కనే డివిజనల్ మేనేజర్, హరహరా డెవలపర్స్ అండ్ బిల్డర్స్ అని రాసివుంటాయి.

ప్రస్తుతం అతడు ఎక్కువగా చేసే బిజినెస్ షేర్‌మార్కెట్. పెట్టుబడి లేని వ్యాపారం చేయటం అతడి ధ్యేయం కనుక సుబ్బారావుతో విడిపోగానే 'హరహరా డెవలపర్స్ అండ్ బిల్డర్స్'లో ఏజెంట్‌గా చేరాడు. ఆ కంపెనీ గుంటూరులో ప్లాట్ల వ్యాపారం చేస్తుంది.

'నెలకు ఐదు వందలు కట్టండి... గుంటూరులో ఇల్లు పొందండి...' అనేది వారి స్లోగన్. ఒక్క ప్లాట్ అమ్మితే ఏజెంట్‌కి వెయ్యి రూపాయల కమీషన్ వస్తుంది. చీఫ్ ఏజెంటుకు వెయ్యి రూపాయలు, ఫీల్డ్ ఆఫీసర్‌కి ఐదొందల రూపాయలు, ఆర్గనైజర్‌కి మూడొందల రూపాయలు, సీనియర్ సేల్స్ మేనేజర్‌కి రెండొందల రూపాయలు, మేనేజర్‌కి నూటయాభై, డివిజనల్ మేనేజర్‌కి వందరూపాయలు కమీషన్ వస్తుంది. అంటే మూడు వేల రెండొందలయాభై కమీషన్‌లు పోతాయన్నమాట. రెండువందల యాభై ఆఫీస్ ఎస్టాబ్లిష్‌మెంట్ ఛార్జీలు, పదివేలు కంపెనీ లాభం, డెవలపింగ్ ఛార్జీలు, స్టాఫ్ జీతాలు 15 వందలు. అంటే మొత్తం కంపెనీవారికి పోయే సొమ్ము 15 వేలు వుంటుంది. అసలు స్థలం ఖరీదు ఐదువేలుంటుంది. నెలకు 500 రూపాయలు చొప్పున 50 నెలలు కట్టించుకుంటారు. అంటే ఇరవై ఐదువేలన్నమాట! వడ్డీతో కలుపుకుంటే ముప్పైవేలు!!

అంటే ఐదువేల ఖరీదు చేసే స్థలాన్ని ముప్పైవేలకు అమ్మటం ఏజెంట్ చేయాల్సిన పని! ఒక ప్లాట్ కట్టిస్తే వెయ్యి రూపాయలు!!

అది నచ్చింది జయప్రకాష్‌కి.

మోటార్‌సైకిల్ వేసుకుని టీచర్ల స్కూళ్లకు వెళ్లేవాడు.

"చూడండి... రేపు మీ అబ్బాయికి ఇంజనీరింగ్‌లోనో మెడిసిన్‌లోనో సీట్ వస్తే గుంటూరులో ఉండటానికి ఇల్లు ఎంతో అవసరం కదా!" అని ప్రారంభించేవాడు. వారు కరిగిపోయేవారు.

వారింటికి వెళ్లి వాళ్ల పాప ముక్కు చీమిడి తుడిచేవాడు. "మీ పాపేనా? అచ్చం శ్రీదేవిలా వుందే? అని ఆశ్చర్యం, ఆనందం ప్రకటించేవాడు. 'ఇపుడు గుంటూరులో ప్లాట్ కొంటే అమ్మాయి పెళ్లికి లక్ష రూపాయలపైనే వస్తాయి. వేరే కట్నంకోసం వెతుక్కోవాల్సిన అవసరంలేదు' అని చెప్పేవాడు. ఎవరింట్లోనయినా హీరో చిరంజీవి ఫోటో కనిపిస్తే 'అరె మీరు చిరు అభిమానులా! భలేవారే... అయనా మా ప్లాట్ తీసుకున్నాడు. ఆయనింటిపక్కనగాని, దగ్గరలోగాని ప్లాట్ కావాలా?' అని అడిగేవాడు.

ఎవరయినా కుర్ర ఉద్యోగస్తులు కనిపిస్తే 'మా హరహరా నగర్‌లో శ్రీదేవి, జయప్రద ప్లాట్స్ తీసుకున్నారు. వారి కాలనీలోనే వుండటం ఎంత గౌరవప్రదం...' అని చెప్పేవాడు.

ప్రతి ఆదివారం కారుపెట్టి ఇష్టపడే కష్టమర్లను గుంటూరుకు చాలా దూరంగా వుండే ఆ ప్లాట్‌కి తీసుకెళ్లేవాడు. ఆదివారమే ఎందుకంటే మిగతా రోజుల్లో అక్కడ పశువులు కాసుకునేవాళ్లు కూడా ఉండరు. చుట్టూ ఎటు చూసినా పదిమైళ్లు ఖాళీగానే వుంటుంది.

ఆదివారంనాడు జిల్లాలోని అందరు ఏజంట్లు కార్లు వేసుకొని కష్టమర్స్‌ని తీసుకు వస్తారు. దాదాపు వంద కార్లొస్తాయి. ఐదొందలమంది పైగానే కష్టమర్స్ వస్తారు. ఆ జాగా అంతా కళకళలాడుతుంటుంది!

అందరికీ కూల్‌డ్రింక్స్, శ్నాక్స్ ఇవ్వబడతాయి.




మధ్యలో హరహరా నగర్ లే అవుట్ మోడల్ ఉంటుంది. చుట్టూ ఐదంతస్తుల భవనాలు, ముందు కార్లు, మధ్యలో పెద్ద పార్క్, విశాలమైన రోడ్లు, స్విమ్మింగ్ పూల్, హాస్పటల్, కాన్వెంట్, హైస్కూల్ కొద్దిదూరంలో కొత్తగా కట్టబోయే హరహరా రైల్వేస్టేషన్, కొంచెం దూరంగా విమానాశ్రయం.

ఓహ్! అరచేతిలో వైకుంఠం కనిపిస్తుంది.

అంతమంది కొనగాలేంది మనమెందుకు కొనకూడదు? అనుకుంటాడు కష్టమర్! అంతే వారి వలలో పడిపోయినట్లే.

ఐదువేలకు కొన్న ప్లాట్‌ని ముప్పైఐదువేలకు అంటగట్టేస్తారు.

పొరపాటున ఎవరయినా అమ్మాలని ప్రయత్నిస్తే దానికి వెయ్యి రూపాయల రేటు కూడా రాదు!

వేలాదిమంది మోసపోయినా, దాని ఓనర్ రెండు కోట్లు పెట్టి గుంటూరు సెంటర్లో ఇల్లు కట్టుకున్నాడు. ఏజంట్లందరూ నాలుగైదు లక్షలు పెట్టి ఇళ్లు కట్టుకున్నారు.

జయప్రకాష్, చిన్నచిన్న ఉద్యోగస్తులను, వ్యాపారస్తులను, గాంధీనగర్ వాసులను పట్టుకుని ఒక్క నెలలో చీఫ్ ఏజెంట్ అయ్యాడు. మెరికెల్లాంటి కుర్రాళ్లని ఏజెంట్లుగా పెట్టుకుని తను అంచెలంచెలుగా పెరిగాడు.

ఈనాడు అతడి ఆదాయం నెలకు ఇరవైవేలు!!

తిరగటానికి కారు, ఉండటానికి మేడ వున్నాయి.

తిట్టే నోరు, తిరిగే కాలు ఊరుకోదంటారు. అలానే డబ్బు సంపాదన మరిగినవాడు మానవరక్తం రుచి చూసిన పులిలాంటివాడు.

హర్షద్‌మెహతా ఫొటోలు మేగజైన్స్‌పై కవర్‌పేజీలుగా వస్తున్న రోజులవి. అందరూ షేర్‌మార్కెట్‌వైపు దృష్టి సారించారు. అందులో అతిగా డబ్బున్నవారి సంగతి సరేసరి!

జయప్రకాష్ బుర్ర పాదరసంలా పనిచేస్తోంది. షేర్‌మార్కెట్ గురించి స్టడీ చేయటం మొదలుపెట్టాడు.

ఆ సమయంలో సుబ్బారావు సలహాకోసం జయప్రకాష్‌ని కలిశాడు.

'షేర్ల వ్యాపారాన్ని మించింది ఏముంది? నీకున్న డబ్బంతా పెట్టి షేర్స్ కొను' కావాలనే సలహా చెప్పాడు. తనదగ్గరున్న డబ్బంతా పెట్టి షేర్లు కొన్నాడు సుబ్బారావు.

అంతలో 'స్కాం' బయటపడింది. షేర్స్ ధరలన్నీ ఒక్కసారిగా పడిపోయాయి. సుబ్బారావు నెత్తిన చెంగేసుకున్నాడు. ఇక వ్యాపారాల జోలికి పోక మహాత్మాగాంధీ బార్ అండ్ రెస్టారెంట్‌కి వెళ్లి మూడోనెంబర్ గదిలో కూర్చుని మందు కొడుతూ వెనుకటి మూడో నెంబర్ సుబ్బారావు అయిపోయాడు.

అయితే జయప్రకాష్ తన పెట్టుబడి అంతా మ్యూచువల్ ఫండ్స్‌లో పెట్టుబడి పెట్టాడు. ఎక్కువగా యు.టి.ఐ. అది స్కాంలో ఇరుక్కోలేదు. మాస్టర్‌షేర్, మాస్టర్ ప్లస్ ధరలు ఆకాశాన్నంటాయి. మాస్టర్ గెయిన్‌కి ప్రపంచంలో ఏ మ్యూచువల్ ఫండ్ సాధించలేనంత డబ్బు వచ్చింది.

అవన్నీ చూశాక జయప్రకాష్ ఒక నిర్ణయానికొచ్చి షేర్ కన్సల్టెన్సీ ఆఫీస్ ఓపెన్‌చేశాడు. ఇదీ పెట్టుబడి లేని వ్యాపారమే అయినా ఒక యాభైవేలు పెట్టి ఆఫీస్ హంగామాగా వుండేటట్లు చేశాడు.

కావాల్సినవారికి షేర్లు అమ్మిపెట్టటం, కొనిపెట్టటం అతడిపని. ఏ పని జరిగినా అతడికి రెండుశాతం కమీషన్ వస్తుంది. అది చాలతడికి. అదికాక మరో వ్యాపారం కూడా ప్రారంభించాడు జయప్రకాష్.

అది ప్రైమరీ మార్కెట్ బిజినెస్. కొత్తగా పెట్టే కంపెనీల షేర్లకు కష్టమర్ల కోరికపై వారికెన్ని షేర్లు కావాల్సుంటే అన్నిటికీ, ఎన్ని రెట్లు కావాల్సుంటే అన్ని రెట్లు డబ్బు స్టాక్ ఇన్‌వెస్ట్‌ద్వారా కడతాడు. ఆ వడ్డీ అతడికే వస్తుంది. మొత్తం డబ్బుకు పార్టీనుండి

రెండు రూపాయల వడ్డీ తీసుకుంటాడు.

అలా కాకుండా తానే బాగా డిమాండ్ వున్న కంపెనీలకు వివిధ షేర్లలో వంద అప్లికేషన్స్ వేస్తాడు. ఎవరయినా అలాట్ అయితే ముందే ఎంతకు కొనుక్కుంటారు? అని అడుగుతాడు. అలాట్ అయితే మార్కెట్లో దాని విలువ ఎంతున్నా తాను అమ్మినరేటుకు ఇచ్చేస్తాడు. ఒక్కోసారి తనే స్వయంగా షేర్లు కొని అమ్ముతుంటాడు. ఇలా ఎన్నివిధాలుగా చూసినా అతడికి లాభం వస్తుంది. షేర్ అలాట్ అయినా లాభమే, కాకుంటే వడ్డీ వస్తుంది, ఎవరయినా షేర్ కొన్నా అమ్మినా పర్సంటేజ్ వస్తుంది. ఇక ఏం కావాలతడికి?

అయినా తన కృషిని ఆపలేదతడు. అతడి దృష్టిలో విశ్రాంతి అంటే చావుతో సమానం.

ఇక అతడికి తెలిసివున్న వ్యాపారం ఒకటి మిగిలివుంది. దానికీ పెట్టుబడి అక్కర్లేదు. కేవలం మగాడయితే చాలు. కట్నం, ఇంట్లోకి సామాన్లు, పడకసుఖంతో, డబ్బు ఇవ్వక్కర్లేని దాసిగా భార్య వస్తుంది. జయప్రకాష్ దృష్టిలో పెళ్లీ వ్యాపారమే!

పది లక్షల కట్నంతో ఎత్తుపళ్లు, మెల్లకళ్లు, సొట్టకాలు అమ్మాయి వచ్చినా చేసుకోవటానికి అభ్యంతరం లేదు. ఎందుకంటే ఆడదానికి అందమే అవసరమయితే తనకున్న డబ్బుతో ఎంతో అందమయిన వారిని కొనుక్కోవచ్చు. ఇక డబ్బు వచ్చేటపుడు భార్య ఎలాటిదయితే నేం? అవీ అతడి ఆలోచనలు.

డబ్బు వెనుక పరుగెత్తేవాడు భార్యాపిల్లల్ని అలక్ష్యం చేస్తాడు. డబ్బువలన వచ్చే ఆనందం వారికి మరి దేనివలనా రాదు. అది ఎప్పటికీ తీరని, పోని వ్యసనం.

ఆ వూళ్లో పెళ్లికాని మగవాళ్లలో వరుల లిస్టులో ముందున్నాడు అతడు. అందం, డబ్బు, గౌరవం, ప్రతినెలా ఎక్కువ ఆదాయం... ఇంకా ఏం కావాలి ఆడపిల్లనివ్వటానికి?

అయితే అతడి కులమేమిటో ఎవరికీ తెలియదు. అతడి బంధువులు ఎవరూ ఆ వూళ్లో తారసపడలేదు. అతడు అన్ని కులాలకు సంబంధించిన వ్యక్తిలాగా ప్రవర్తించగలడు. అదే అతని ప్రత్యేకత. కాని కులం బయట పెడితేగాని పెళ్లికాదు. అందుకని బాగా ఆలోచించాడు.

ఒకరోజు అతడు ఆఫీసులో కూర్చుని వున్నాడు. ఆఫీస్‌ముందు ఒక మారుతీకారు ఆగింది. దాంట్లోంచి ఒక ఖద్దరుచొక్కా, పంచె వేసుకున్న వ్యక్తి దిగాడు.

"చూడండీ! మా బావమరిది జయప్రకాష్ ఉండేది ఇక్కడేనా?" అని అడిగాడు.

అదేనని చెప్పారు వారు. సరాసరి పైకెళ్లి జయప్రకాష్ రూంలోకి చనువుగా వెళ్లాడతను.

కాసేపాగాక ఆయనను తీసుకొచ్చి అందరికీ పరిచయం చేశాడు జయప్రకాష్.

"మా బావగారు... వెంకట్రామయ్య చౌదరిగారు'' అని.

అతడి బంధువులను చూడటం అక్కడున్న కష్టమర్లకు అదే మొదటిసారి. అంతేకాదు దానితో అతడి కులం కూడా తెలిసిపోయింది.

కృష్ణాజిల్లాలో తమదో పల్లెటూరనీ, చిన్నప్పుడే అలిగి వచ్చేశాననీ చెప్పాడతను.

ఆరోజు సాయంత్రమే అతడు వెళ్లిపోయాడు. పోయేముందు జయప్రకాష్‌దగ్గర రెండు వేలు తీసుకుని మరీ వెళ్లాడు.

మరునాటినుండీ అతనికి సంబంధాలు రావటం మొదలయింది. కట్నం లక్షలలో పలుకుతోంది. మంచి పెళ్లికొడుకుకు కావాల్సిన అన్ని లక్షణాలు వున్నవాడాయె! సంబంధాలకేం తక్కువ?

సరిగ్గా నెలరోజుల్లో జయప్రకాష్ పెళ్లి అయింది. ఒక ఫైనాన్స్ కంపెనీ ఓనర్ కూతుర్తో, ఏడు లక్షల కట్నం, యాభై తులాల బంగారం. అతడి పెళ్లికి అతడి బావ తప్ప ఎవరూ రాలేదు. తనే పిలవలేదని చెప్పాడు. పిలవదలుచుకోలేదని ముందే చెప్పాడు




అందరికీ.

అతడి రిసెప్షన్‌కి ఊళ్లోని పెద్దలందరూ వచ్చారు. వివిధ వ్యాపారాలు చేసే వర్తకులు, డాక్టర్లు, ఎమ్మెల్యే, పోలీస్ అధికార్లు అందరూ విచ్చేశారు. ఆ వూర్లో అంతకుముందు ఎపుడూ జరగనంత వైభవంగా జరిగింది రిసెప్షన్. బఫేలో దాదాపు పదిరకాల చికెన్, పదిహేను రకాల మటన్, మూడురకాల ఫిష్, రెండురకాల ప్రాన్స్ అరేంజి చేయబడ్డాయి.

ఆరోజే శోభనం అయిపోయింది. తెల్లవారుజామున లేచి బయటకు వచ్చి బాల్కనీలోని ఊయల కుర్చీలో కూర్చుని సిగరెట్ తాగుతూ ఒక్కసారి గతాన్ని తలపోశాడు. అతడి వళ్లు జలదరించింది. రోమాలు నిక్కబొడుచుకున్నాయి.

తల్లీ దండ్రీ ఎవరో తెలియని అనాథ. వీధులలో అడుక్కుతింటుంటే ఎవరో అనాధ శరణాలయంలో చేర్పించారు. హైస్కూల్ చదువయ్యాక ఇంటర్ రెండేళ్లు పట్నంలో చదువుకున్నాడు వారాలు చెప్పుకుని వివిధ కులాలవారింట్లో. అందుకనే అతనికి అన్ని కులాలవారి ఆచార వ్యవహారాలూ బాగా తెలుసు.

ఫ్లాట్‌ఫారంమీద బతికే తను సమాజంలో ఒక స్థానం సంపాదించటానికి ఏమయినా చేయాలని నిశ్చయానికొచ్చాడు. జీవితపోరాటంలో అతడాడని నాటకం లేదు. బావ కూడా నాటకమే! అయితేనేం?

అతడు విజేత!

★ ★ ★

చిన్నకొడుకు చనిపోయిందగ్గరనుండి శేషయ్య పనిలోకి వెళ్లటంలేదు. మొదట్లో తిరుపతమ్మ కూడా వెళ్లలేదు. పెద్దకొడుకు వెంకటేశం అపుడపుడు పనికి వెళుతుండేవాడు. వారి జీవితాలలో తెలియని నిరాసక్తత ఆవహించింది.

శేషయ్య మనిషి బాగా తగ్గిపోయాడు. దానికితోడు తాగుడు. ఒకసారి డాక్టర్ దగ్గరకు తీసుకెళితే క్షయ అని చెప్పారు. గవర్నమెంటు హాస్పటల్‌కి వెళితే ఉచితంగా మందులు లభిస్తాయని చెప్పారు. అయితే శేషయ్య రెగ్యులర్‌గా ట్రీట్‌మెంట్ తీసుకోవటంలేదు.

ఖళ్ళుఖళ్లున దగ్గే తండ్రిని, మంచాన్ని వదలలేని తల్లిని చూసి బాధపడటం మినహా ఏమీ చేయలేకపోతోంది తిరుపతమ్మ. వెంకటేశం, ఏసుపాదం సమవయస్కులు. మనశ్శాంతికోసం అతడితో కలిసి సినిమాలకు షికార్లకు వెళుతున్నాడు వెంకటేశం. దానికి ఏసుపాదం అమ్మ మరియమ్మ కూడా అభ్యంతరం పెట్టలేదు. శ్రద్ధగా పనిచేస్తే ఈపాటికి సున్నపు బట్టీలలో మేస్త్రీ అయ్యుండేవాడు అతడు. టెంత్ తరువాత చదువు ఆపేసి ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజ్‌లో రిజిష్టర్ చేసుకొని, కాల్‌లెటర్ వస్తుందేమోనని ఎదురుచూస్తూవున్నాడు ఏసుపాదం. ఇద్దరికీ అసంతృప్తే. జీవితంలో ఏదో కావాలని, సాధించాలనీ ఆశగాని, ఆశయంగానీ లేవు వారికి.

ఇక తప్పక కుటుంబ భారాన్ని స్వీకరించింది తిరుపతమ్మ. మామూలుగా గని పనిలోకి వెళ్లటం ప్రారంభించింది. ఉదయాన్నే లేచి కళ్లాపిజల్లి, వంటచేసి, తాను తిని, బాక్స్‌లో పెట్టుకుని బయటపడుతుంది ఆమె. పమిటను తలపైగా తీసుకొచ్చి, ఒక కొసను బొడ్లో దోపుతుంది. ట్రాక్టర్ రాగానే ట్రాలీలో ఎక్కి తన తోటివారితోపాటు ముందున్న సపోర్టింగ్ రాడ్‌ని పట్టుకుని నిల్చుంటుంది. తానాగు వాగుదగ్గర గనిలో పనికి వెళుతుందామె. ఊరికి పది కిలోమీటర్ల దూరంలో కొండల సమీపంలో ఉందా గని. ఏడు గంటలకు నడుం వంచితే తిరిగి సాయంత్రమే తల పైకెత్తేది. అంత కష్టపడుతుంది కనుకనే రోజుకు వందరూపాయల కూలీ సంపాదించి, సంసారాన్ని నెట్టుకొస్తున్నది.

ఆమెకు అసలు తెలియనిది, ఆలోచించే

సమయం లేనిది తన శరీరం గురించే. అది ఆమెకు పట్టకపోయినా, అలంకరణలు లేకున్నా లోకం దృష్టిలోనుంచి ఆమె తప్పుకోలేకపోయింది.

చెంపకు చేరడేసి కాటుక పెట్టిన కళ్లు, కోటేరులాంటి ముక్కు, బుల్లిబుల్లి అధరాలు, చిన్న చుబుకం, రంగులీనే మెడ, ఎండకు మెరిసే బుగ్గలు, ఎర్రని అధరాలపై పడి ప్రతిఫలించే వెలుగూ, అధరాల అంచులలో అణగదొక్కబడిన చిరునగవు, కళ్లలో ఆత్మవిశ్వాసం ఆమెకు పెట్టని ఆభరణాలు. దానికి తోడు పదహారేళ్ల వయసు! ఆమెలోని ఆకర్షణ, అందం ఎందరి యువకుల హృదయాలనో దోచుకుంది. కాని ఆమె మౌనంగా వుండటం; వలపు పిలుపులకు పలకకపోవటంలాంటివి ఆమెకు శృంగార జడత్వం ఉందేమోననిపించేట్లు చేసేది. ఒకసారి ఓ ట్రాక్టర్ డ్రైవర్ తొందరపడి ఆమెమీద చేయేశాడు. అంతే! రెండు పొర్లిగింతలు పెట్టి అవతల పడ్డాడు ఆమె కొట్టిన దెబ్బకు. ప్రతిక్షణం గడ్డపారలతో, సలకపారలతో, మట్టి, రాళ్లతట్టలతో రాటుదేలిన శరీరం ఆమెది. ఆమె అందం ఆమెను సుకుమారిలా కనిపింపచేస్తుందే తప్ప నిజంగా బలమయిన అమ్మాయి తిరుపతమ్మ.

ఆ డ్రైవర్ సంఘటన తరువాత ఎవరూ ఆమె జోలికి రాలేదు. సాధారణంగా మేస్త్రీ అదిరించో, బెదిరించో ఆ వయసు పిల్లల్ని లొంగదీసుకుంటాడు. కాని ఆ మేస్త్రీకి ఆమె నడవడిక చూశాక అంత ధైర్యం కలగలేదు.

ఒకరోజు మామూలుగా గనిలో పనిచేస్తున్నది తిరుపతమ్మ. అప్పుడే ఒక మోటార్‌సైకిల్ వచ్చి ఆగింది అక్కడ. 'అతడిదే ఈ గని' పక్కనున్న మరోపిల్ల చెప్పింది తిరుపతమ్మతో! "పోకిరీ వెధవ... కష్టపడకుండా డబ్బులొస్తున్నాయి. రోజూ తాగడం, వీలయితే అమ్మాయిల వెంటపడటం..." ఛీత్కారం చేస్తూ అంది. అది వినిపించుకోకుండా తన పనిలో మునిగిపోయింది ఆమె.

కాని అతడి కళ్లు ఆమెపై పడనేపడ్డాయి. పరీక్షగా చూసి వెళ్లిపోయాడు అతను. అతని పేరు రమణ. వయసు పాతికలోపే అయినా ముప్ఫై ఏళ్ల వాడిలాగా కనిపిస్తాడు. నెలకు యాభైవేల టాక్స్ లేని (కట్టని) ఆదాయం అతడిది. డబ్బు ఏం చేయాలో అర్థంకాని పరిస్థితి అతడిది. తింటం, తాగటం, వ్యభిచరించటం ఇదే అతడి పని. మరో వ్యాపకం లేదతడికి. ఆరోజు రాత్రి మిత్రులతో బార్‌లో మందు కొడుతున్న అతనికి నిషా ఎక్కటంలేదు. తిరుపతమ్మ రూపమే కనిపిస్తోంది.

అదే తన మిత్రులతో చెప్పాడు. వారూ ఇతడిలాంటివారే. గని యజమానుల కుమారులు. వారి వృత్తీ ప్రవృత్తీ రమణలాంటిదే.

"అయితే లైన్‌లో పెట్టకపోయావా?" అడిగాడొక మిత్రుడు.

"ఊహుఁ... లొంగేరకం కాదు... నిప్పులాంటిదట పాపం" అన్నాడు.

"అయితే మనం నీళ్లుపోద్దాం" రా తాగుతూ అన్నాడు మరొకతను.

"ఎలామరి? డబ్బుకు లొంగేరకం కాదు... ఏవిధమయిన ఆశలకూ లొంగదట..."

"విచిత్రమైన ప్రాణి... మరి అంత అందంగా ఎందుకు పుట్టిందట?" నవ్వాడు.

"అంజమ్మని అడిగి చూడకపోయావా?" అంజమ్మ ఆ వూరిలోని తొలి వేశ్యగా ప్రసిద్ధి పొందిన స్త్రీ. ఏడెనిమిది ఏళ్లనుండి కంపెనీ నడుపుతోంది.

"అడిగాను.. ఆమే ఈ వివరాలన్నీ చెప్పింది'' అన్నాడు రమణ.

"మరేం చేద్దాం? మంచి వయసులో వుండీ, కావాల్సినంత డబ్బూ వుండీ, ఆఫ్టరాల్ ఒక కూలిపని చేసుకునేదాన్ని అనుభవించలేకపోవటమా? అవమానం..." మరొకడన్నాడు. ఆరోజుకి మందు కోటా పూర్తవటంతో ఇంటికెళ్లారందరూ.

మరునాడు రెండు మోటారు సైకిళ్లపై ఏదో




పని వున్నట్లుగా గనిదగ్గరికి వెళ్లారు. రమణ చూపించకుండానే తిరుపతమ్మ ఎవరో గుర్తు పట్టారు వారు. చుక్కల్లో చందమామ. కాకుల్లో రామచిలుక ఆమె.

"లాభంలేదు..." తిరుగుప్రయాణంలో అన్నాడొకతను.

"ఆమెని పొందని బతుకే వ్యర్థం"

"కానీ మార్గం లేదే!" నిరాశగా పెదవి విరిచాడు రమణ. తిరుపతమ్మ పనిచేసే ముఠాలోనే ఒక ఇరవై ఏళ్ల అమ్మాయి వుంది. ఆ అమ్మాయి సరదాగా అపుడపుడూ రాత్రులు వారితో గడుపుతుండేది. ఆమె సాయం తీసుకుందామన్నారు మిత్రులు.

"అదీ ప్రయత్నించా... ఆ పిల్ల నిప్పు... అలాటి ఆశలు పెట్టుకోవద్దు అంది'' అన్నాడు రమణ.

"మరేంచేద్దాం" అడిగాడొక మిత్రుడు.

"అవకాశంకోసం చూడటమే... అంతకు మించి చేసేదేంలేదు'' అన్నాడు రమణ.

ఒక నెల గడిచింది. అపుడొచ్చింది ఆ అవకాశం. కాదు వారే తీసుకున్నారు.

ఆ చుట్టుపక్కల గ్రామాల్లో నాలుగైదు ఎకరాల బీళ్లు వున్న సన్నకారు రైతులు ఎందరో వున్నారు. వాటి విలువ పదివేలు కూడా వుండదు. ఎందుకు పనికిరానట్టున్న భూములు. సంవత్సరాదాయం నాలుగైదు వేలకు మించదు. అలాటివారి పొలాల్లో మంచి రాయి పడితే అదే గని అవుతుంది. ఒక్కసారిగా లక్షలకు అధిపతులు అయిపోతారు. నెలకు ఇరవై వేలనుండి లక్ష రూపాయల దాకా ఆదాయం వస్తుంది. అలాటివారి రెండో తరం నడుస్తోంది. తండ్రులు కష్టపడినవారు గనుక డబ్బు విలువ తెలుసు. జాగ్రత్తగా ఖర్చు చేస్తూ వచ్చేవారు. మంచి పొలాలు కొనటం, ఇళ్లు కట్టించటం వగైరాలు. వచ్చే చిక్కల్లా ఈ రెండోతరం యువకులతోనే.

అంతులేని ఆదాయం. సరియైన చదువు లేకపోవటం, జీవితానికి నిర్దిష్టపథం లేకపోవటం, వృద్ధులైన పెద్దలమాట లెక్క పెట్టకపోవటం, ఇష్టారాజ్యంగా ప్రవర్తించటం... శ్రమ విలువ తెలియకపోవటం, అనుకొన్నది ఏదైనా తమ డబ్బుతో తీసుకోవచ్చు అనే భ్రమలో వుండటం, దానికి తోడు వ్యసనాలు వారిని వ్యర్థజీవులుగా మారుస్తాయి. ఆ ఆదాయాన్ని తీసేస్తే వీధులలో అడుక్కోవటానికి కూడా పనికిరారు వారు. ఆ పని లేకపోవటమే వారిలో వింత ప్రవర్తనను రేకెత్తిస్తుంటుంది. చిన్నపిల్లల్లా మంకుపట్టు పట్టటం, ఏడవటం, డిప్రెషన్‌కి గురికావటం సర్వసాధారణం. అది వారిలోని క్రిమినల్ మెంటాలిటీని డెవలప్ చేస్తుంది. అదే జరిగింది రమణా, అతడి మిత్రుల విషయంలో.

కంటికి నదురుగా కనిపించిన అమ్మాయికి ఎర వేస్తారు. లేదా చిరుతపులిలా మాటువేస్తారు. తరువాత ఎరా వుండదు, లేడీ వుండదు. ఏమీ జరగనట్టు కీటకాన్ని గుట్టుచప్పుడు కాకుండా మింగి, తనదారిన తాను వెళ్లే బల్లిగా వుంటుంది వారి ప్రవర్తన.

ఆ నెలరోజుల్లో వారు సేకరించిన విషయమేమిటంటే, తిరుపతమ్మ దినచర్య. డిసిప్లిన్ ఉన్నవారు అన్నీ టైం ప్రకారం చేసుకుంటూ పోతారు. వారి దినచర్యలో మార్పు ఉండదు సహజంగా. అదే తిరుపతమ్మను దెబ్బతీసింది.

తిరుపతమ్మ పనిచేసే గని దగ్గరగా వాగు ప్రవహిస్తోంది. దానికానుకునే ఒకపక్క కొండ వుంది. కొండకు, వాగుకూ వారధిలా దట్టమైన చిట్టడవి వుంది.

మధ్యాహ్నం భోజనాలవేళ తన బాక్స్ తీసుకుని వాగు వద్దకు వస్తుంది తిరుపతమ్మ. ముందుగా అడవివేపు వెళ్లి లఘుశంక తీర్చుకుని, వచ్చి కాళ్లు చేతులు కడుక్కుని తన బాక్స్‌లో తెచ్చుకున్నది తిని, తన తోటి కార్మికులవద్దకు చేరుతుంది తిరుపతమ్మ. తిరిగి పనిలో మునిగిపోతుంది. వంచిన తల ఎత్తదు. పని కాగానే ట్రాక్టర్‌లో అందరితోపా




టు ఇంటికెళ్ళిపోతుంది.

దీనిని బాగా గమనించాక ఆ దినచర్య లోని 'లూప్‌హోల్'ని గమనించాడు రమణ మిత్రుడు. "ఆమె అడవికి రాగానే అరవ కుండా నోట్లో గుడ్డలు కుక్కి లోపలకు లాక్కె ళదాం... అనునయంతో చెబుదాం, డబ్బు ఇద్దాం... బెదిరిద్దాం... దేనికీ ఒప్పుకోకపోతే 'రేప్' చేసేద్దాం..." అన్నాడతను.

అందరూ ఉలిక్కిపడ్డారు. వారంతా చాలా మంది అమ్మాయిల్ని అనుభవించారు గాని ఎపుడూ రేప్ చేయలేదు. అంత ధైర్యం వారికి లేదు. కాని ఆ ఆలోచనే వారిలో ఏదో వెర్రి ఆనందాన్ని ఇచ్చింది. రేప్‌లు సినిమాలలో చాలా చూశారుగాని ఒక్క మనిషి రేప్ చేయటం అసాధ్యం అని వారికి తెలుసు. అందుకనే రేప్ చేయాలనే నిర్ణయానికొచ్చారు అందరూ కలిసి. అదో థ్రిల్.

అందుకే పది పదిహేను రోజులుగా కూలీ లు ఎవరూ లేని సమయంలో ఆ ప్రదేశా న్నంతా గాలించారు. తమకు అనువైన చోటు ను నిర్ణయించుకున్నారు. ఆ ప్రదేశానికి ఆహా రపదార్థాలు, మందుబాటిల్స్ తెల్లవారుజా మునే చేర్చుకున్నారు. ఆ చిట్టడివిలో పొదల మాటున పొంచి కూర్చునివున్నారు.

సమయం గడుస్తున్నకొద్దీ వారిలో థ్రిల్ పెరుగుతోంది. ఎరకోసం పొంచివున్న చిరుత ల్లా పొంచివున్నారు మధ్యలో కొంచెం కొంచెం మద్యం పుచ్చుకుంటూ. వారి కళ్లలో ఏదో కొత్త ఆనందం! కసి!! పైశాచిక మనస్తత్వం. బాధలోనే సుఖం వుందనుకునే మనస్తత్వం.

వారు ఊహించిన సమయం వచ్చేసింది.

తిరుపతమ్మ అక్కడున్న పొదలకేసి వంటరిగా వస్తోంది. చెమటతో తడిసిన ము ఖంతో, చేతులనిండా, తలనిండా మట్టితో ఉన్నా వారి తాగుడుకళ్లకు ఆమె అప్సరసలా కనిపిస్తోంది.

ఆమె పొదచాటుకు రాగానే నలుగురూ ఒక్కసారిగా మీదపడ్డారు. ఒకడు జేబుగు డ్డతో నోరుమూశాడు. మరొకడు చేతులు వెనక్కు విరిచి పట్టుకున్నాడు. ఇంకొకడు కాళ్లు పైకెత్తి ముందుకు లాగాడు. క్షణాలలో బాలెన్స్ తప్పింది తిరుపతమ్మకు. రమణ పక్కనే నిలబడి ఏమైనా అలికిడి అవు తుందేమో, ఎవరయినా వస్తున్నారేమోనని గమనిస్తున్నాడు.

కాళ్లు ఒకరు, తల ఒకరు, మధ్యలో ఒకరు పట్టుకుని తిరుపతమ్మను తాము ముందుగా జాగ్రత్తపడి తయారుచేసుకున్న 'మాటు'వ ద్దకు తీసుకెళ్లారు.

ఈ హఠాత్సంఘటనకు బిత్తరపోయింది తిరుపతమ్మ. హఠాత్తుగా కాళ్లు పైకి గాలిలోకి లేవటంతో కాలు జారి పడుతున్నానేమోనను కుంది. జేబుగుడ్డతో నోరు మూయటంతో, చేతులు వెనక్కు విరిచి పట్టుకోవడంతో ఉక్కి రిబిక్కిరి అయిపోయింది. అరవటానికి, చేతు లు, కాళ్లు కొట్టుకోవటానికి అవకాశంలేదు. నోరు తెరిచి అరవటానికి ప్రయత్నించటంతో జేబుగుడ్డ బాగా నోట్లోకి అదమబడింది. దా నితో శ్వాస అందలేదు. వారు మాటుదగ్గరకు తీసుకెళ్లేసరికి స్పృహ తప్పింది.

కొద్ది నిముషాల తర్వాత స్పృహ వచ్చింది తిరుపతమ్మకు. నోట్లో జేబుగుడ్డ కుక్కబడివున్నది. చేతులు వెనుకకు ఓణీతో కట్టివేయబడి వున్నాయి. రవిక ముడి విప్పబ డి పరికిణీ స్థానభ్రంశం చెందివున్నాయి. కళ్లు తెరిచి చూసిన తిరుపతమ్మకు యమకింకరు ల్లా నలుగురు యువకులు కనిపించారు. వారిలో రమణను మాత్రమే గుర్తుపట్టిందా మె. ఆమె కళ్లల్లోకి రక్తం పొంగింది. శ్వాస వేగంగా తీసుకొంటోంది. కణతలు ఉద్వేగాని కి అదురుతున్నాయి. జరగబోయేదేమిటో అర్థమయ్యేలోపలే ఒకడు పైశాచికంగా ఆమె పై వాలాడు. మద్యం వాసన గుప్పుమని వస్తోంది.

ఒక్కక్షణం మస్తిష్కం మొద్దుబారిపోయి నా క్షణాలలో స్పృహ తెచ్చుకుంది. కొంచెం



తల పైకెత్తి వెనుకగా కట్టివేయబడిన చేతులు ఒకసారిగా ముందుకు తెచ్చింది. చిన్న జెర్క్, అంతే. ఆమె కట్టివేయబడిన రెండు చేతులూ ఒక్కసారి ముందుకు వచ్చేశాయి. తనమీదకు పైశాచికంగా దూకిన ఆ యువ మృగం తలపైకి వచ్చేశాయి చేతులు. ఒక చేయి తలపైగా, ఒక చేయి తలకిందుగా వచ్చింది. ఆమె చేతులకు కట్టిన ఓణీనే అతడి పాలిటి ఉరి అయింది. కట్టివేసిన చేతులు ఒక్కసారిగా ముందుకు రావటంతో ఆమె చేతుల కీళ్లు పెటపెటమన్నాయి. చేతులు విరిగిపోయేటంతగా బాధవేసింది. అయినా ఆగలేదు ఆమె. కసిగా చేతులు బిగించి, ఎడమకాలు కొంచెంగా కదుపుతూ ఒక్కసారిగా ముడిచి బలంగా కొట్టింది మోకాలితో. సరిగ్గా అతడి గజ్జల్లో పిడుగుపాటులా తగిలిందా దెబ్బ. అదే సమయంలో మెడ గట్టిగా బిగుసుకుంది.

చుట్టూ వున్నవారు ఒక్కసారి ఉలిక్కిపడ్డారు. లేచి తమ మిత్రుడిని విడిపించటానికి వచ్చారు. అప్పటికే మోకాలితో నాలుగుసార్లు కుమ్మిందామె. వెచ్చగా, జిగటగా ఆమె మోకాలికి తగిలింది. ఆమెకర్థమయింది. అది రక్తం. వృషణాలు చితికిపోగా వచ్చే ద్రవం! అతడి నోటినుండి కేక కూడా రాలేదు. మూలిగి ఆమెపైనే వాలిపోయాడు. పక్కకు దొర్లింది ఆమె. రాతితో ఆమెను కొట్టటానికి వచ్చిన ఒకతని దెబ్బ సూటిగా అతడి మిత్రుడి తలకు తగిలింది. తల చిట్లి రక్తం స్రవించింది అనాచ్ఛాదంగా వున్న ఆమె గుండెలపై.

పక్కకు పొర్లుతూనే చేతిపట్టు గట్టిగా బిగించింది. పైనుండి వారి స్నేహితులు కొడుతున్నా బలవంతాన లాగుతున్నా వదలలేదామె. అతడి కనుగుడ్లు వెళ్లుకొచ్చాయి. నాలుక బయటకు వచ్చింది. అప్పటివరకు గసలా ఆమె గుండెలకు తగిలిన శ్వాస ఆగింది. తన పట్టు సడిలించి చేతులు పైకెత్తి విసురుగా పక్కకు దొర్లింది. దానితో ఆమె మీద వున్నవాడు పక్కకు పడిపోయాడు వెల్లకిలా. వెళ్లుకొచ్చిన కనుగుడ్లు, బయటకు వచ్చిన నాలుక, చితికిపోయిన వృషణాలు...

వారికర్థమయింది అతను చనిపోయాడని! కోపంతో ముగ్గురూ ఆమెమీద పడ్డారు.

అయితే వారికర్థం కానిదేమంటే - తిరుపతమ్మ అతి చురుకయినదని. ఒక చేతి చూపుడువేలు, మధ్యవేలు కత్తిలా చేసి ఒకడి కళ్లలో గట్టిగా పొడిచింది. కెవ్వున కేకవేశాడతడు. రెండు కళ్ల కనుగుడ్లు చితికిపోయాయి. రక్తంతోపాటు తెల్లని రసం కళ్లనుండి కారుతుండగా వెనుకకు విరుచుకుపడ్డాడు అతడు. రమణ, అతడి మిత్రుడు నిర్ఘాంతపోయేంతలోనే లేచి కూర్చుంది తిరుపతమ్మ. కదులుతున్న ఇంకొకడి కాలుని రెండుచేతులతో పట్టుకుంది. భల్లూకపు పట్టు అది! కాయకష్టం చేసిన శరీరం ఆమెది. మహిషాసుర మర్దనిలా వుందామె. తొలగిన రవికకు సిగ్గుపడటంలేదామె. ఆ దుర్మార్గుల అంతం చూడటమే ఆమె ధ్యేయం!

ఏం చేయాలో అర్థంకాని రమణ పక్కనున్న బండరాయి అందుకున్నాడు... బలంగా తిరుపతమ్మ తలపై కొట్టాడు. తల చిట్లింది. ఆమె నోటినుండి కేక కూడా రాలేదు నోట్లో జేబుగుడ్డ వుండటంతో! ఆమె తల వాల్చేసింది. తలనుండి కారుతున్న రక్తం ఆమె వక్షోజాలను తడుపుతోంది. చేతులు వదిలేసింది. క్షణాలలో స్పృహ కోల్పోయింది. 'అయితేనేం తన శీలం పోలేదు...' చివరగా అనుకున్న మాటలవి.

రమణ, అతడి మిత్రుడు నిర్ఘాంతపోయి కూర్చున్నారు. వారి మత్తు ఒక్కసారిగా దిగిపోయింది. ఒకపక్క వృషణాలు పగిలి, గుడ్లు, నాలుక వెళ్లుకొచ్చి మరణించిన మిత్రుడు. మరోవేపు రెండు కళ్లూ పోయి, రెండు చేతులతో ముఖాన్ని కప్పుకుని రోదిస్తున్న మరో మిత్రుడు...

మరోవేపు తల పగిలి స్పృహ తప్పి, బట్టలు స్థానభ్రంశం చెంది, రక్తంతో తడిసిన




వక్షోజాలతో తిరుపతమ్మ!!

బీభత్సదృశ్యం అది. వారి జీవితంలో ఎపుడూ చూడని సన్నివేశం. ఊహించలేని పరిణామం. కూలిపని చేసుకునే ఒక సాధారణమయిన ఆడదానిలో అంత శక్తి, యుక్తి వుంటాయని వూహించలేని అజ్ఞానం.

కొంచెం దూరంగా గనులలో తూటాలు పేలుస్తున్న శబ్దం... దానితోపాటు లేచే మట్టీ ధూళీ...

రోదిస్తున్న మిత్రుడు.

ఏంచేయాలో తోచలేదు వారికి.

తిరుపతమ్మ శ్వాస ఆడటంలేదు. తలపక్కకి వాల్చేసింది. ఆమె అర్థనగ్న శరీరం వారిలో ఇప్పుడు కామవాంఛ కలిగించటంలేదు.

రెండు హత్యలు!! ఒకడికి కళ్ళు పోవటం.

పక్కకు తీసుకెళ్లాడు మిత్రుడు- రమణని. ఉప్పెన తరువాత ప్రశాంతంగా ఆలోచిస్తున్నారు వారు. "ఇది బయటపడితే మనకు ఉరి తప్పదు'' నెమ్మదిగా అన్నాడతను. గజగజా వణికిపోతున్నాడు రమణ.

"చనిపోయిన వారిద్దరినీ వాగులో పడేద్దాం. శవాలు కూడా దొరకవు'' సరేనన్నట్లు తలూపాడు రమణ. అంతకుమించి గత్యంతరంలేదు. ముందుగా తమ మిత్రుడిని తీసుకెళ్లి వాగులో పడేశారు. మునుగుతూ లేస్తూ కొట్టుకుపోతోందా శవం.

తరువాత తిరుపతమ్మ శవాన్ని వాగు మధ్యలోకి విసిరేశారు. ఒక్కక్షణం కనిపించి నీటిలో మునిగిపోయిందామె శవం.

అలా చూస్తూ నిలబడ్డారు వారు. ఆ శవాలు 'బోదనం' దగ్గర కృష్ణానదిలో కలిసిపోతాయి. పులిచింతల దాటి చివరకు తేలితే విజయవాడ లాకుల్లో తేలాలి. దానికి నాలుగైదురోజులు పడుతుంది కనుక భయంలేదు.

"కాని... కళ్లు పోయినవాడి సంగతి?" రమణ అన్నాడు. "వాడిని హాస్పటల్‌కి తీసుకెళ్లినా ఇక కళ్లురావు. ఈ ప్రమాదానికి కారణం ఏమని చెబుతాడు? వాడే భయంతో అసలు రహస్యం చెప్పేస్తే?"

ఇద్దరి గుండెలూ దడదడలాడాయి.

తాము బ్రతకాలి. ఆరునూరైనా ప్రపంచం తల్లకిందులయినా తాము బ్రతకాలి. క్షణాలలో నిర్ణయానికొచ్చారు వారు.

ఇద్దరూ చెరో బండరాయీ తీసుకొని వెళ్ళారు ఆ కబోదివద్దకు. రెండే రెండు దెబ్బలు. కేక కూడా బయటకు రాలేదు. తల చిట్లి మెదడు బయటికి వచ్చింది. వాడిని కూడా వాగులో పడేసి, కాళ్లూ చేతులూ కడుక్కుని, కొండ వెనుకవేపుగా నడక సాగించి సాయంత్రానికి ఊరు దగ్గరకు చేరి చీకటిపడ్డాక ఇంటికి చేరారు వారు.



రాత్రి అయినా కూతురు ఇంటికి రాకపోవటంతో కంగారుపడ్డారు శేషయ్య రాజమ్మలు. శేషయ్య, వెంకటేశం మిగతాకూలీల దగ్గరకు వెళ్లి విచారించారు. వారంతా తమకు తెలియదని, మధ్యాహ్నంనుండి కనిపించలేదనీ చెప్పారు. దానితో అనుమానం ఎక్కువయింది వారికి. ఆరోజు గనిలో రాళ్లు పేల్చటం జరిగింది. ఏదైనా రాయి తగలరానిచోట తగిలి స్పృహ కోల్పోయిందేమోననుకున్నారు. వెంటనే ఆమెను వెతకటానికి కూలీలందరూ బయలుదేరారు పెట్రోమాక్స్ లైట్లు తీసుకుని ట్రాక్టర్‌లో. ఆ రాత్రంతా గాలించారు.

ఎక్కడా ఆచూకీ దొరకలేదు.

రమణ మిత్రులిద్దరి తల్లిదండ్రులు కూడా, ఎంత త్రాగినా అర్ధరాత్రి కొంపకు చేరే పిల్ల లెందుకు ఇంటికి రాలేదని కంగారుపడ్డారు. తెల్లవారిందాకా చూశారు. రమణను విచారించారు. అంతా తమకు తెలియదనే చెప్పారు. అందుకుని ఉదయాన్నే వెళ్ళి పోలీస్ రిపోర్ట్ ఇచ్చారు.

"వాళ్లు ఇద్దరూ కల్సి ఏదో వూరు వెళ్ళి వుంటారులెండి ఏదో మజా చేసుకోటానికి. దానికంత కంగారెందుకు. రెండు మూడు రోజుల్లో తిరిగివస్తారు'' నవ్వుతూ అన్నాడు సబ్‌ఇన్‌స్పెక్టర్.

"లేదండీ... వాళ్లు ఎన్ని వెధవ్వేషాలు వేసినా మాకు చెప్పే చేస్తారు. ఊరికి వెళ్ళినా చెప్పేపోతారు'' నమ్మకంగా చెప్పారు వారు.

"చూద్దాం... సాయంత్రానికి రాకపోతే మళ్ళీ రండి. ఈలోపు నేను విచారిస్తాను'' చెప్పాడతను.

వారు వెళ్లిన అరగంటకు, శేషయ్య, ఇస్రాయేల్, మిగతా కార్మికులు పోలీస్‌స్టేషన్‌కి వెళ్ళారు రిపోర్ట్ ఇవ్వటానికి. అంతా బయట వుంటే, శేషయ్య, ఇస్రాయేల్ లోనికెళ్లారు.

"ఏమిటి పని?" ముఖం చిట్లించి అన్నాడు ఎస్.ఐ.

"నిన్నటినుండి మా అమ్మాయి కనిపించటంలేదండి''

"ఎన్నేళ్లుంటాయి?"

"పదహారేళ్లు..."

"ఏం పని చేస్తుంటుంది?" శేషయ్యను పరిశీలనగా చూస్తూ అన్నాడు.

"గనిలో పని''

"ఓహో'' భుజాలెగ రేశాడు.

"ఎప్పటినుండి?"

"నిన్న మధ్యాహ్నం నుండి..."

తల ఊపాడు ఎస్.ఐ. బెల్‌కొట్టి హెడ్‌కానిస్టేబుల్‌ని పిలిచాడు.

"ఇందాక కుర్రాళ్లు తప్పిపోయారని రిపోర్టు ఇచ్చారు చూడూ? వారు మైన్స్ ఓనర్సేకదా? ఎక్కడున్నాయి మైన్స్?"

"తానాగు దగ్గర..." అతడిని వెళ్లమన్నట్లు సైగ చేశాడు ఎస్.ఐ.

"మీ అమ్మాయి పనిచేసే గనీ తానాగు దగ్గరేనా?"

'అవునన్న'ట్లు తలూపాడు శేషయ్య.

"అదీ కథ-" వ్యంగ్యంగా నవ్వాడు ఎస్.ఐ.

"ఆ గనుల ఓనర్‌ల కొడుకులు ఇద్దరు, వయసులో వున్నవాళ్లు నిన్నటి ఉదయంనుండీ ఎవరికీ కనిపించటంలేదు. ఆ గనిలోనే పనిచేసే పదహారేళ్ల అమ్మాయీ కనిపించటంలేదు'' మళ్ళీ నవ్వాడు ఎస్.ఐ.

"పో... పో... మీ అమ్మాయిని కంట్రోల్లో పెట్టుకో. ఒళ్లు కొవ్వెక్కి అదెవళ్లతోనో లేచిపోతే వాళ్లను మేం వెదికిపెట్టాలా? ఏం పోలీసులు అంటే అంత తేరగా ఉన్నారనుకున్నారా? ప్రతి అడ్డమయిన వెధవా ఏదో కేసు పట్టుకురావటమే'' చిరాగ్గా అన్నాడు.

"కాదండి. నా బిడ్డ నిప్పులాంటిది. అదలాటిది కాదు'' కోపాన్ని తగ్గించుకుని, ఉద్రేకాన్ని చల్లబరుచుకుని అన్నాడు శేషయ్య.

"పో... ఫో భలే చెప్పావులే. ప్రతి మగాడూ తన పెళ్లాం పతివ్రతేననుకుంటాడు. ప్రతి తండ్రీ పెళ్లికాని తన కూతురు నిప్పులాంటిదేననుకుంటాడు. వాళ్ల రంకుతనం ప్రపంచమంతా తెలిశాకగాని చివరికి వాళ్లకి తెలియదు'' ఫైల్ తీస్తూ అన్నాడు.

"ఆయన చెప్పేది నిజమే బాబూ! ఆ పిల్ల మా వాళ్లందరికీ చిన్నప్పటినుండి తెలుసు'' ఇస్రాయేల్ అన్నాడు.

అప్పుడు చూశాడు బయటవున్న కార్మికుల్ని. దాంతో అతడి చులకనభావం కొద్దిగా కరిగింది. కార్మికులంతా కలిసి వచ్చారంటే చాలా జాగ్రత్తగా వుండాలి. లేకుంటే లా




అండ్ ఆర్డర్ దెబ్బతింటుంది. వారికి ఉద్రేక మొస్తే ఆపటం అసాధ్యం. ఎన్నో గొడవలు. రాజకీయాలు. క్షణం ఆలోచించాడు.

"సరే! మీ అమ్మాయి మంచిదే కావచ్చు. నేనూ నమ్ముతాను. ఆ హెడ్ కానిస్టేబుల్‌కి రిపోర్ట్ ఇచ్చివెళ్లు విచారిస్తాను"

వందరూపాయలు ఇస్తేగాని రిపోర్టు రాయలేదు హెడ్‌కానిస్టేబుల్. ఒక తెల్లకాగితంపై విషయమంతా వ్రాసి, శేషయ్య చేత వేలిముద్రలు వేయించాడు. ఎందుకయినా మంచిదని మరో తెల్లకాగితంపై కూడా. అతడికీ తెలుసు ఎఫ్.ఐ.ఆర్. కూడా వ్రాయరని. కేస్ రిజిష్టర్ కాదని.

"సరే... రెండు మూడు రోజుల తరువాత కనిపించు. ఈలోపు అమ్మాయి తిరిగివస్తే వచ్చి విషయం చెప్పిపో"

వారిని పంపించివేశాడు హెడ్‌కానిస్టేబుల్.

ఇదంతా దూరంగా మోటార్‌సైకిల్‌పై కూర్చుని, టీ త్రాగుతూ గమనిస్తున్నారు వారు. పొద్దున మిత్రుల తల్లిదండ్రులొచ్చారు. ఇప్పుడు తిరుపతమ్మ తండ్రి వచ్చాడు. రెండోది అంత ప్రమాదం కాదుగాని మొదటిదే ప్రమాదం. పోలీస్ జాగిలాలు వచ్చినా, కేస్ బుక్ అయినా, శవాలు దొరికినా, తలుచుకుంటే తమమీద హత్యానేరం రుజువు చేయటం పోలీసులకు అంత కష్టమేంకాదు. ఆలోచించారు వారు.

★ ★ ★

రమణ, అతడి మిత్రుడు దాదా వద్ద కూర్చున్నారు. చెరో యాభైవేలూ ఆయన ముందు టీపాయ్‌పై పెట్టి, చేతులు కట్టుకు కూర్చున్నారు. అయినా నిలువెల్లా వణికిపోతున్నారు. "చెప్పండి..." గంభీరంగా అన్నాడు దాదా. అతడి ఎయిర్‌కండిషన్డ్ రూం అది.

"జరిగిందంతా వివరంగా పొల్లుబోకుండా చెప్పండి. ఏ సహాయం అయినా చేస్తాను. అబద్ధం చెప్పారో మీరే ఇరుక్కుపోతారు" ఖద్దరు పంచె సర్దుకుంటూ అన్నాడు.

రమణ పొల్లుపోకుండా అంతా వివరించి చెప్పాడు. "వారు పోలీస్ రిపోర్ట్ ఇచ్చారు. కేస్ అయితే.. మేం భరించలేం. మీరే రక్షించాలి" ఆయన కాళ్లు పట్టుకున్నారు.

"సరే- లేచి సరిగా కూర్చోండి" ఆజ్ఞాపించినట్లుగా అన్నాడు దాదా.

"మూడు హత్యలు, ఒక రేప్ అన్నమాట. చాలా ఖరీదవుతుంది. తట్టుకోగలరా?"

తలలూపారు వారు.

"మూడు హత్యలకు మూడు రెండ్లు ఆరు లక్షలు. రేప్‌కి ఒక లక్ష. ఈ లక్ష ఎడ్వాన్స్‌పోతే ఆరు లక్షలూ ఒకవారంలో ఇవ్వాలి"

"అంత ఎక్కువా? తగ్గించండి" బ్రతిమిలాడారు.

"దాదా మాటంటే మాటే. తిరుగుండదు. దానికి చాలా ఖర్చవుతుంది. మీరు కుర్రవాళ్లు కాబట్టి తగ్గించాను. మీ కిష్టం లేకపోతే వెళ్లిపోయి వేరే పద్ధతిలో ప్రయత్నం చేసుకోండి" అంటూ ఆ లక్షరూపాయలు పక్కనున్న సొరుగులో వేశాడు. "మీరు చెప్పిన నిజాన్ని ఎవరికీ చెప్పకుండా ఉండేందుకు ఆ లక్షా నేను ఉంచుకుంటాను" లేచినుంచుని అన్నాడు.

"సరే... అలాగే కానివ్వండి. మామీద అనుమానం కూడా రాకూడదు"

"అలాగే. మీరే చూడండి" అని బెల్ కొట్టాడు.

ఒక యువకుడు లోనికొచ్చాడు. "నీవు, జాన్సన్ కలిసి తిరుపతమ్మ అనే అమ్మాయిని తీసుకుని ఇప్పుడే కార్లో విజయవాడ వెళుతున్నారు మీ పేర్లు. (చనిపోయిన రమణ మిత్రుల పేర్లు చెప్పాడు). మీరు విజయవాడలో ఒక మాదిరి హోటల్లో ఆ పేర్లతో నాలుగురోజులకు గది అద్దెకు తీసుకుంటారు. ఆ హోటల్ డైనింగ్ హాల్లో ఆ అమ్మాయి అదే తిరుపతమ్మ అనే పేరుగల అమ్మాయివ

లన గొడవ అవుతుంది. ఇద్దరూ కొట్టుకుంటారు. హొటల్ ఫర్నిచర్ కూడా దెబ్బ తింటుంది. పోలీసులు వస్తారు. వారికి లంచం ఇచ్చి, హొటల్‌వానికి జరిగిన నష్టపరిహారం అంతా ఒక్కవేయి తగ్గించి కట్టేయండి. ఇక్కడ వాళ్ల ఇంటి అడ్రస్ ఇచ్చి మనిషిని పంపితే వేయి ఇస్తామని చెప్పి, ఒక కారు మాట్లాడుకోని రాత్రికే గుంటూరు రండి. మరునాడు వచ్చేయండి'' అని చెప్పాడు దాదా.

తలూపాడు అతను. యాభైవేల నోట్లకట్ట అతడికి విసిరివేశాడు.

"ఆ అమ్మాయికి రెండువేలు ఇవ్వండి. మిగిలింది నాకు తెచ్చివ్వండి''

అతడు బయటకు వెళ్లిపోయాడు.

బెల్‌కొట్టి మరొకర్ని పిలిచాడు దాదా.

"మీరు చేపలు పట్టేవారిని తీసుకెళ్లి వాగంతా శవాలకోసం వెతకండి. శవాలు దొరికితే వారిని పంపేసి శవాలకు రాళ్లు కట్టి వాగుమధ్యలో పడేయండి. మీరూ పోలీసులని వారితో చెప్పండి. బోధనం దగ్గర వాగు కృష్ణానదిలో కలుస్తుంది. అక్కడిలోగా శవాలు దొరక్కపోతే పడవలు అద్దెకు తీసుకుని, విజయవాడదాకా వెళ్లండి. శవాలు మాత్రం బయటపడకూడదు'' అతడికి ఇరవైవేలు ఇచ్చి చెప్పాడు దాదా. అది తీసుకొని వెళ్లాడతను. మరొకసారి బెల్‌కొట్టి మరొకడిని పిలిచాడు.

"హత్యలు జరిగిన ప్రదేశపు వివరాలు చెప్పి, "అక్కడకు వెళ్లి ఆ చుట్టుపక్కల అంతా మిరియాలపొడి, నాలుగైదు ఎండ్రిన్ సీసాలు పోయండి. ఆ వాసనకు పోలీసు జాగిలాలు వచ్చినా పసికట్టకుండా వుండాలి. అక్కడ వీరు వదలివచ్చిన మందుసీసాలు, తినిపారేసిన ఆకులు, సిగరెట్‌ముక్కలు ఏరి ఐదారుమైళ్ల దూరాన పాతిపెట్టండి. మీరు వెళ్లేదారిలో కూడా మిరియాలపొడి చల్లటం మర్చిపోవద్దు'' అతడికి ఐదువేలు ఇచ్చి పంపాడు దాదా.

"చూశారుగదా నాకు ఎంత ఖర్చవుతుందో?" నవ్వాడు దాదా. "పోలీస్‌కుక్కలు వచ్చినా హత్యాప్రదేశాన్ని, ఇతర ఆచూకినీ పసిగట్టలేవు. ఇక శవాలు దొరకవు. నిన్న చనిపోయిన ముగ్గురూ ఈరోజు హొటల్లో గొడవపడి ఫర్నిచర్ ధ్వంసం చేస్తారు. డబ్బు కట్టేస్తారు. మిగిలిన వెయ్యికోసం ఇక్కడికి మనిషి వస్తాడు. అదే చనిపోయిన మీ మిత్రుల ఇళ్లకు... వారు తమ కొడుకులు బ్రతికే వున్నారనుకుంటారు. తిరుపతమ్మను వారే తీసుకుపోయారనీ 'ఎలిబీ' వుంటుంది.

ఇక కొద్దిరోజుల తరువాత శవాలు దొరికినా, వారే కొట్టుకొని చచ్చివుంటారని పోలీసులు నిర్ధారణకు వస్తారు. అదీ ప్లాన్... ఇక మీరు వారంలోపల నాకు డబ్బు కట్టేయాలి. లేకుంటే మీరు మీ ఫ్రెండ్స్‌ని కలుసుకుంటారు'' హుందాగా చెప్పాడు దాదా.

వణుకుతూ బయటకు వెళ్ళిపోయారు వారు.

★ ★ ★

మరునాడే విజయవాడనుండి మనిషి వచ్చాడు డబ్బుకోసం- హొటల్‌నుండి. వారు డబ్బు ఇచ్చి పంపేశారు- తమ కొడుకులు క్షేమంగా వున్నారనే ఆనందంతో పోలీస్‌స్టేషన్‌కి ఫోన్‌చేసి వివరాలన్నీ చెప్పారు.

తిరుపతమ్మ వారితో లేచిపోయింది- అనే వార్త వూరిలో గుప్పుమన్నది.

నిర్ఘాంతపోయాడు శేషయ్య. గుండెలు బాదుకుంది రాజమ్మ. చేష్టలుడిగాడు వెంకటేశం. ఇస్రాయేల్‌కాని, మరియమ్మ కాని ఈ విషయాలు నమ్మలేదు. పోలీస్టేషన్‌కి వెళ్లి విచారిస్తే నిజమేనని చెప్పారు వారు. నిర్ఘాంతపోయాడు ఇస్రాయేల్!

అది అతడు కలలో కూడా ఊహించని విషయం!

ఏదో మర్మముందని అర్థమవుతున్నా అదే

మిటో తెలియలేదతడికి.



1994 ఆరోజు ఆదివారం కావటంవలన హోటల్ లేదు. పొద్దుటే లేచి పేపర్ తీసుకుని తనకు కావాల్సిన విషయాలు చదవటం ప్రారంభించాడు వెంకటసుబ్బయ్య.

"ఊc... కాఫీపొడి నూటముప్ఫై రూపాయలు, బియ్యం పదకొండు రూపాయలు అబ్బో... నూనె నలభైఒక్క రూపాయి. పంచదార పదహారు రూపాయలు. చాలా పెరిగిందే. కందిపప్పు పద్దెనిమిది రూపాయలు. మినపగుండ్లు ముప్ఫైరూపాయలు. అయ్యయ్యో ఆc... చింతపండు ఇరవైరూపాయలు. ఊ... ఊహూ... బంగాళాదుంప ఎనిమిది రూపాయలు. టమోటా పన్నెండు రూపాయలు, మటన్ అరవైరూపాయలు, గుడ్డు రూపాయిన్నర. పాలు పది రూపాయలు. పచ్చిమిర్చి పన్నెండు రూపాయలు''

"అబ్బబ్బ... ఆపండి. ఆ పేపర్లో వచ్చే రేట్లు తక్కువ. మనం అమ్మే రేట్లు ఎక్కువ. మీకు రోజూ చెబుతూనే వున్నాను అలా పెద్దగా చదవద్దని. అయినా మీరు మానరు'' విసుక్కుంటూ వచ్చి పేపర్ లాక్కుంది పరమేశ్వరి. అలా పేపర్ లాక్కుందంటే ఏదో చెప్పాల్సింది ఉందని అర్థమయిందతడికి.

"ఏమిటో చెప్పరాదే శ్రీమతీ!" హుషారు తెచ్చుకుని అన్నాడు.

"మగపిల్లల పెళ్లి సంగతి. మీకెంత చెప్పినా అర్థం కాదు'' తల కొట్టుకుంది.

"అదీ ఆలోచించాగా... పెద్దబ్బాయికి తన బట్టలషాపులో అర్ధరూపాయి వాటా ఇచ్చి రెండు లక్షల కట్నం ఇస్తానన్నాడు వాడు పనిచేసే షాపతను. హరనాథూ అంగీకరించాడు. ఇక రెండో అబ్బాయికి ఫైసెంటర్లో ఉండే ఫ్యాన్సీ షాపతను షాపునే కట్నంగా ఇస్తానన్నాడు. అది మూడు లక్షలు చేస్తుంది. అమ్మాయికి రెండు లక్షల బంగారం వుంది. రామాంజనేయుల్ని అడిగాను. వాడికీ ఇష్టమేనన్నాడు. వాళ్లిద్దరికీ ఇష్టం కనుక, అన్నీ నాకు కూడా నచ్చాయి కనుక నేను 'సరే నన్నాను. నేను 'సరే నన్నాను గనుక అది నీకూ ఇష్టమేనని నీకూ తెలుసు. వచ్చే నెలలో ముహూర్తాలున్నాయి. ఈ విషయాలు చాలా? ఇంకా కావాలా?"

"చాలు చాలు... మీ నోట్లో పంచదార పొయ్యా! అన్నీ తెలిసి నాకు ఒక్కముక్క కూడా చెప్పలేదుకదా?" మూతి విరుస్తూ అంది.

"అలా పొయ్యకు. ఎందుకంటే నాకు షుగరుంది. అదీగాక పంచదార పదహారు రూపాయలమ్ముతోంది'' నవ్వాడు వెంకటసుబ్బయ్య.



"నాకూ ఒక రిక్షా కొనిపెట్టు. అది తొక్కుకొని బతుకుతాను'' విసురుగా అన్నాడు ఏసుపాదం తండ్రి ఇస్రాయేల్‌తో.

"అదేంటి? ఉద్యోగం ఇకరాదా?" ఆశ్చర్యపోతూ అన్నాడు.

"వస్తుందా? చస్తుందా? నీవేమో మతాన్ని నమ్ముకొని వుంటివి. నాకు రిజర్వేషన్ వుండదు. అదే ఆ ప్రఫుల్లకుమార్ చూడు... వాడూ క్రిష్టియనే. అయితేనేం రికార్డుల్లో వెనుకబడ్డవాడు. వాడికి ఈ ఊళ్లోనే ఉద్యోగం వచ్చింది టీచర్‌గా''

"అది కాదులేరా- వాళ్లమ్మా నాన్నా ఇద్దరూ టీచర్లేగదా. వాడు బాగా చదువుకొని ఉద్యోగం సంపాదించుకొని వుంటాడు'' మరియమ్మ అంది.

"నీ మొఖం... నీకేం తెలుసు. మతం మతం అని నా భవిష్యత్తుని పాడుచేశారు. ఏం నాకూ ఏ ఫణికుమారో, విద్యాసాగరో అని పేరు పెడితే ఏంపోయేది? నాకూ రిజర్వేషన్ వచ్చి బాగా చదువుకుని ఈపాటికి ఉద్యోగం సంపాదించి వుండేవాడినికదా? ఆ ప్రఫుల్లకు




మార్ చూడు. అప్పుడే మోటార్‌సైకిల్ కొని స్కూలుకి వెళుతున్నాడు. ఛీఛీ... ఏం బతుకులో' చిరాగ్గా అన్నాడు.

"పోనీ కిళ్లీబంకు పెట్టుకోరా... అది కష్టం లేనిది'' ఇస్రాయేల్ అన్నాడు.

"ఆc చూశాంలే సంబడం. కిళ్లీకొట్లవాళ్ల పిల్లలు కిళ్లీకొట్లే పెట్టుకుంటున్నారు. పంతుళ్ల పిల్లలు పంతుళ్లవుతున్నారు. డాక్టర్ల పిల్లలు డాక్టర్లవుతున్నారు. కలెక్టర్ల పిల్లలు కలెక్టర్లవుతున్నారు. లాయర్ల పిల్లలు లాయర్లవుతున్నారు. కూలివాడి పిల్లలు కూలివాళ్లే అవుతున్నారు. నేను రిక్షాతొక్కేవాడి పిల్లవాడిని. నేను-రిక్షావాడినే అవుతాను'' కోపంగా అన్నాడు ఏసుపాదం. "ఇంతకంటే బాగా బతికే బతుకు ఎక్కడినుండి వస్తుంది? ఎందుకు కలలుకంటూ బతకటం అందుకే మార్క్స్ ఏమన్నాడంటే..."

"వద్దు వద్దురా... ఆ మాటలొద్దు. రాడికల్స్‌లో చేరి మాకు దూరమవబాకు. చేరిన వాళ్లను నీవు చూస్తూనే వున్నావుగదా? ఇంకా ఎందుకు నీకీ ఆరాటం... ఉన్నదేదో కలో గంజో తిని బతుకుదాం" గబగబా అన్నాడు ఇస్రాయేల్. తన కొడుకామధ్య రాడికల్ కుర్రాళ్లతో తిరగటం చూశాడు. అందుకే ఆ భయం.

"దీనికంటే అదే నయం. పోతే ఏ ఎన్‌కౌంటర్లోనో చస్తాను'' అంటూ విసురుగా బయటకు నడిచాడు ఏసుపాదం. మరియమ్మ కొడుకుకేసి ఆశ్చర్యంగా చూస్తోంది. అతడిలో ఏదో అలజడి. అశాంతి. దేనిమీదో అర్థంకాని కోపం. ఉద్రేకం. అది ఎక్కడికి దారి తీస్తుందోనని భయపడుతోందామె.

"వాడెక్కడికి వెళుతున్నాడో చూడు-" భర్తతో అంది కంగారుగా. "ఈమధ్య వాడేదో మన కర్థంగాని మాటలు మాట్లాడతావుండాడు''

బయటకు వచ్చాడు ఏసుపాదం. చుట్టూ కొడుకుకోసం చూశాడు. ఎక్కడా కనిపించలేదు. అతడి గుండెలు ఝల్లుమన్నాయి.

అతడి చూపులు పరిశీలనగా ఒకచోట ఆగాయి. అక్కడ తానుంచిన రిక్షా లేదు. అతడి కళ్లలో నీళ్లు చిమ్మాయి.



ఒకరోజు అంజమ్మ శేషయ్య వాళ్ళింటికి వచ్చింది. వారొచ్చిన ఈ పదిపన్నెండేళ్ళలో ఒకే కాంపౌండ్‌లో వున్నా ఏనాడూ వారింటికి రాలేదు అంజమ్మ. దారిలో ఒకవేళ రాజమ్మకు ఎదురుపడ్డా, తలవంచుకుని వెళ్ళిపోయేదామె. ఆమెతో మాట్లాడాలంటే రాజమ్మకే అదోరకంగా వుండేది. అందుకని ఎపుడూ పలకరించలేదు.

తిరుపతమ్మ వెళ్ళిపోయి నాలుగు నెలలు గడిచింది. శేషయ్య కుటుంబం గర్భదారిద్ర్యంలో వుంది. వెంకటేశం ఎపుడన్నా పనికెళితే తింటానికి తిండి... లేకుంటే లేదు. శేషయ్య, రాజమ్మ బాగా చిక్కిపోయారు. తమ తిండి తిప్పలకన్నా పరువు ప్రతిష్టకు ఎక్కువ విలువ ఇచ్చే కుటుంబం వారిది. అందుచేతే బయటకు ముఖం చూపలేకపోతున్నారు.

లోనికొచ్చిన అంజమ్మను చూసి, లేచి చాప వేసింది రాజమ్మ.

"మీకో విషయం చెప్పటానికి వచ్చాను. మీ అమ్మాయి తిరుపతమ్మ ఎవరితోనూ లేచిపోలేదు. నిప్పులాంటి పిల్ల''

"నీకెలా తెలుసు?" ఆశ్చర్యంగా అడిగింది రాజమ్మ.

"ఎలా తెలుసును అని అడగకండి. అది రహస్యం. అది తెలిస్తే మీ ప్రాణాలకే ప్రమాదం"

"మరయితే తిరిగిరాదేం?" కన్న కడుపు కోతతో అడిగింది రాజమ్మ.

"వస్తుంది... ఖచ్చితంగా వస్తుంది'' తను చెప్పేది అబద్ధమని తనకు తెలిసినా అబద్ధమే చెప్పింది. "కొన్ని కారణాలవలన దాక్కోవ

లసి వచ్చింది. నా మాట నమ్మండి''

రాజమ్మ కళ్లలో కొత్త జీవం. శేషయ్య పెదవులపై చిరుదరహాసం. "నీకెలా తెలుసు? ఎందుకిలా జరిగింది? అనే ప్రశ్నలు నన్ను వేయవద్దు. సమాధానాలు తెలిసినా మీకు చెప్పలేను. అది మీకే ప్రమాదం... దీనికి ఏం చేయాలో నాకు తెలుసు... చెడిపోయిందానిని గనుక శీలం విలువ నాకు తెలుసు. తిరుపతమ్మ గురించి నాకు తెలుసు. మేలిమిబంగారం మీరు బాధపడవద్దు''

లేచి వెళ్ళిపోయింది అంజమ్మ.

ఆమెవేపే చూస్తూ నిశ్చేష్టులై వుండిపోయారు వారు. కాసేపాగి అన్నాడు శేషయ్య. "అంజమ్మ వళ్ళు అమ్ముకుని బ్రతికేదే కాని ఒకరిని మోసం చేసి, అబద్ధాలు చెప్పి బతికేది కాదు. ఆమె చెప్పేది ముమ్మాటికీ నమ్మవచ్చు'' లేచి నుంచున్నాడు శేషయ్య.

"నిజమే... ఇన్నేళ్ళనుండి ఆమెను చూస్తున్నాను గదా? కల్లాకపటం లేని మనిషి. ఉంటే తింటుంది లేకుంటే పస్తులుంటుంది. ఆమె ఇంతవరకు ఎవరితో పొల్లుమాట అనంగా నేవినలేదు'' ఆమెకు అంజమ్మ మాటలు కొంత ఉత్సాహాన్నిచ్చాయి. "ఇక మనం తల దించుకోవాల్సిన పనిలేదు. ఏదో ఒకరోజు మన బిడ్డ తిరిగి వస్తుంది. కనీసం దాని రాకకోసమైనా మనం బతకాలయ్యా''

"అవును... కానీ పిల్లోడు ఇల్లు పట్టకుండా తిరుగుతున్నాడు. వాడికీ మనసు సరిగా లేదు. మనమా ఏ పనీ చేయలేం"

"కాదు మనం కూలికి వెళదాం... గనిలో పనికే వెళదాం... మన తిరుపతమ్మ పని చేసిన గనికే వెళదాం... ఏవైనా వివరాలు దాని స్నేహితురాళ్లు చెబుతారేమో''

"కాని మనకు పనెవరిస్తారే...?" నిర్జీవమైన కళ్లతో అన్నాడు శేషయ్య.

నేను మాట్లాడతాను... ఇద్దరం కలిసి పనిచేద్దాం. ఇద్దరికీ కలిపి ఒకరి కూలి ఇవ్వమందాం... అందరూ మనకు తెలిసిన వాళ్ళేగా. కాదనరు''

"అలాగేలే... రేపే మాట్లాడదాం" కండువా దులిపి భుజాన వేసుకుని బయటకు నడిచాడు శేషయ్య.



ఇద్దరు పెద్దమనుషులు కూర్చుని వున్నారు. ఎదురుగ్గా చాపమీద కూర్చుని వుంది అంజమ్మ.

"నీవు చెప్పేది నిజమా?"

"అవును..." వారిద్దరూ ముఖముఖాలు చూసుకున్నారు. వారిద్దరి పిల్లలే తిరుపతమ్మను తీసుకొని వెళ్ళి హెూటల్లో గోలచేసింది. ఆ నాటినుండి ఈ నాటివరకు పిల్లలు ఎందుకు తిరిగిరాలేదా? అని బాధపడుతున్నారు.

"దీనికి రుజువేమిటి?"

"మీ పిల్లల్లాగా ఆ హెూటల్లో నాటకమాడిన వాళ్ళు జాన్సన్ వాడి ఫ్రెండ్. తిరుపతమ్మగా ఆ హెూటల్కి వెళ్ళిన అమ్మాయి... మా కంపెనీ అమ్మాయే... అదే నాతో చెప్పింది. అదంటే జాన్సన్‌కి మోజు... అందుకనే చాలా వివరాలు తెలిశాయి''

"ఆ అమ్మాయి ఉందా?" ఒకాయన అడిగాడు.

"ఉంది... ఆ అమ్మాయి నిజం చెప్పగలదు కూడా. కాని ఆ అమ్మాయిని వాళ్ళు చంపేస్తారు నిజం చెబితే... నేనా పెద్దదాన్నయిపోయాను. నేను చచ్చినా ఫరవాలేదన్ని





చెబుతున్నాను''

"మా పిల్లలు ఏమయ్యారు?"

"చంపేశారు... తిరుపతమ్మనీ చంపేశారు''

ఉలిక్కిపడ్డారు వారు. ఒక్క క్షణం నిర్ఘాంతపోయారు. కాని, ఆ అనుమానం వారిలో ఒక మూల వుండటంవలన అంతగా దిగ్భ్రాంతి చెందలేదు.

"ఎవరు?"

"రమణ- వాడి ఫ్రెండూ''

మాట్లాడకుండా వింటున్నారు వారు.

"చంపేశాక భయపడి దాదా దగ్గరకి వెళ్లారు. దాదాకి ఆరు లక్షలు ఇచ్చారట కేసు లేకుండా చేయటానికి. విజయవాడలో హోటల్‌లో జరిగిన నాటకం ఆడించింది దాదానే. శవాలు దొరక్కుండా చేసిందీ దాదానే. కేసులు లేకుండా చేసిందీ దాదానే''

"బాగానే వుంది... కాని నీవీ విషయాలన్నీ ఎందుకు చెబుతున్నావు?"

"ఎందుకంటే తిరుపతమ్మపై జాలి. ఆ పిల్ల నా కళ్ళ ఎదురుగ్గానే పెరిగింది. అది నిప్పులాంటిదని నాకు తెలుసు... నేనెటూ చెడినదాన్నే... జీవితంలో ఒక్కమంచిపనీ చేయలేదు. కాని- ఆ దుష్టులు శిక్షింపబడితే తిరుపతమ్మ ఆత్మశాంతిస్తుందని నా నమ్మకం. మనం చచ్చాక వైతరిణీ అనే నదిని దాటాలట! దానిలో చీమూ, నెత్తురూ ప్రవహిస్తుంటాయట. అమితమైన దుర్గంధం వేస్తుంటుందట. దానిలో మొసళ్ళు, సర్పాలు దాటేవారిని తింటానికి సిద్ధంగా వుంటాయట. ఆ వైతరిణీ ఆవలిగట్టు చేరటానికే బ్రాహ్మణులకు గోదానం చేస్తారట. ఆ ఆవు తోక పట్టుకుని ఆ వైతరిణీని దాటాలట..." విచిత్రంగా నవ్వింది అంజమ్మ... "అవి పురాణాలు కావచ్చు... కాని మామూలు మనిషి కష్టాల ఏటిని దాటటానికి 'మంచి' అనే ఆవుతోక ప్రతి మనిషికీ వుండాలి. జీవితంలో ఎన్నో తప్పులు చేస్తాం, చేస్తుంటాం. శాశ్వత శాంతి అనే అవతలిగట్టుకి చేరటానికి కనీసం ఒక్కమంచి పనయినా చేయాలని నా ఉద్దేశ్యం. అందుకే ఈ విషయాలు మీకు చెప్పాను''

ఆశ్చర్యంగా చూశారు అంజమ్మవేపు వారు. ఆ బజారు మనిషి అలాటి మాటలెలా మాట్లాడింది? అని ఆలోచనలో పడ్డారు.

నవ్వింది అంజమ్మ వారి సంశయం చూసి.

"నా గతం మీకెవరికీ తెలీదు... అందుకే ఆశ్చర్యపోతున్నారు. అంజనీదేవి నా పేరు. మాది నెల్లూరు. రఘురామశాస్త్రిగారనే ఒక ఉన్నతుని నీచమైన బిడ్డను. చదువుకునే రోజుల్లో ప్రేమలోపడ్డాను. అది ప్రేమ కాదు కామం అని తెలిసేసరికే ఆలస్యమయిపోయింది. ఇంటినుండి పారిపోయి ఈ వూరు వచ్చాను. నా భాషా వేషం అంతా మార్చుకుని పచ్చి వ్యభిచారిణిలా బతికాను. నన్ను మోసగించిన వాని అంతం చూడాలని నా తుదికోరిక. ప్చ్... వాడు ఇంతవరకు కనిపించలేదు''

అంజమ్మకేసి ఆశ్చర్యంగా, వింతగా చూశారు వారు. ఒకాయన ఫోన్ ఎత్తి నెంబర్ డయల్ చేశాడు. గబుక్కున వచ్చి ఫోన్ క్రెడిల్ చేసింది ఆమె.

"మీరు దాదాకి ఫోన్ చేయబోతున్నారు''

"అవును రమణను వాడి ఫ్రెండునీ చంపటానికి ఎంత డబ్బు కావాలో అడుగుదామనుకుంటున్నాను''

నవ్వింది అంజమ్మ.

"రమణ దాదాకు బంగారు గుడ్లుపెట్టే బాతు. వారి దగ్గరినుండి తన ఇష్టమొచ్చినపుడల్లా డబ్బులు లాగుతూనే వున్నాడు. కొద్ది మొత్తం కోసం బంగారు గుడ్లుపెట్టే బాతును చంపే మూర్ఖుడు కాదు దాదా''

"అయితే ఏం చేయాలి?" కోపంగా అన్నాడు ఒకాయన.

"మీ పిల్లల శవాలు కూడా దొరక్కుండా చేశాడు దాదా. కనీసం కేసు కూడా పెట్టలేనంతగా అందర్నీ నమ్మించగలిగాడు. దాదా లాంటి వారు ఉండబట్టే రమణలాంటివారు తయారవుతున్నారు. రమణపై అతడి స్నేహితుడిపై మీ కక్షతీర్చుకోండి. కాని మీ ముఖ్యశత్రువు... దాదా... అది మర్చిపోవద్దు''

"దాదాని ఏమీ చేయలేం" నిస్పృహాయంగా అన్నాడు ఒకతను.

"తలుచుకుంటే ఏమైనా చేయగలరు... అలా చేయగల వ్యక్తి జాన్సన్. అతడే దాదా కావాలని ప్రయత్నిస్తున్నాడు. ఇదీ నాకు రహస్యంగానే తెలిసింది... మీరు జాన్సన్‌ని రహస్యంగా పట్టుకోండి. అతడిద్వారా మీకు నిజాలు తెలుస్తాయి. రమణను కట్టిపడేసి మీ ఎదురుగ్గానే నిజాన్ని వప్పించగలడు అతను. అతనే... అతనే దాదాని అంతం చేస్తాడు... తనే ఈ వూరికి కాబోయే దాదా'' చెప్పేసి లేచింది అంజమ్మ.

"కూర్చోమ్మా'' చాలా మర్యాదగా చెప్పాడు. ఒక నిముషం లోనికెళ్ళి వచ్చాడు. అతడు తిరిగి వచ్చి కూర్చున్నాక ఆయన భార్య వచ్చింది పళ్లెంలో చీరా, రవికా కుంకుమపైన పదివేల రూపాయల నోట్ల కట్టపెట్టుకుని.

అంజమ్మ కళ్ళ వెంట నీళ్ళు తిరిగాయి. "డబ్బు వద్దు బాబుగారూ!" మెల్లిగా అంది.

"మేం ఖర్చుపెట్టబోయే లక్షలాది రూపాయలలో ఇది చిన్నమొత్తం. ఒక ఆడపడుచులా ఇస్తున్నాం. తీసుకొని ఏ వూరయినా వెళ్ళి బ్రతుకు... ఇదే సమాచారం మరొకరు చెబితే కనీసం లక్షరూపాయలు ఇచ్చేవాళ్ళం" గద్గదంగా అన్నాడాయన.

అంజమ్మకు బొట్టుపెట్టి, బట్టలు పెట్టిందామె.

అందరికీ నమస్కరించి కదిలింది. వెళుతూ అంది. "ఇవన్నీ ఎంత రహస్యాలో మీకు తెలుసు. బయట పడిన క్షణం నా ప్రాణాలు వుండవు'' బయటకు వచ్చింది ఆమె. అతడి చేయి, జాన్సన్‌కి ఫోన్ చేయటానికి వెళ్ళటం ఓరగంట గమనించి తనలోతానే నవ్వుకుంది అంజమ్మ.

ఎవరికీ తెలియని, ఆమెకుమాత్రమే తెలిసిన రహస్యమేమిటంటే-

ఆమెను ప్రేమించానని మోసగించిన వ్యక్తే- ఇప్పటి దాదా!

దాదా అంజమ్మను గుర్తించలేదు- ఆ సంగతి అంజమ్మకూ తెలుసు.



శేషయ్య, రాజమ్మ గని పనిలోకి వెళుతున్నారు. కాని, వారు ఆశించినట్లుగా ఇరువురికి కలిపి ఒకరి కూలి అంటే వంద రూపాయలు అన్నా ఇవ్వటానికి తోటి కూలీలు అంగీకరించలేదు. ఇద్దరికీ కలిపి ఎనభై రూపాయలు ఇవ్వటానికి అంగీకరించారు. అది ఆ కార్మికులకు అలవాటే. జీవితాంతం కష్టపడి, చివరి దశలో ఏ పనీ చేయలేక మంచాన పడి కృంగి కృశించే కార్మికులు వారికి తెలుసు. అందుకనే ఏమాత్రం జవసత్వాలున్నా వారిని పనిలోకి రానిస్తారు. తగిన కూలి పడేట్లు చేస్తారు.

రాళ్ళు లోతుకు తరువాత ప్రక్కలకూ త్రవ్వుతూ పోతుంటారు. తరువాత వీలయినంత ప్రక్కకు తవ్వి, మళ్ళీ పైనుండి మొదలుపెడతారు. ముందుగా మట్టి, చిన్నచిన్న రాళ్ళు వస్తాయి. అవి బట్టీలకు పనికిరావు. అవి తమ పనికి అడ్డం కనుక వాటిని ప్రక్కకు పోయిస్తుంటారు. వృద్ధులకీ ఎక్కువ పని చేయలేనివారికీ ఆ పని అప్పగిస్తుంటారు.

శేషయ్యకు, రాజమ్మకు అప్పగించిన పని అదే. శేషయ్య ఎక్కువగా వంగలేడు. అందుకని నిలబడి గునపంతో తవ్వుతుంటే, ఆమె బొచ్చెలలోకి రాళ్ళు రప్పలు ఏరి ప్రక్కన పోస్తోంది. అది వ్యవసాయంలో అలవాటయిన పనే కనుక ఏదో నెట్టుకుపోతున్నారు.

దున్నేటపుడు నాగలికి అడ్డుపడే రాళ్ళను




తొలగించటం నట్టు తీయటం అంటారు. ఆ పని దాదాపు ప్రతి రైతుకూ తెలుసు. ఇపుడు తాము చేసేది దాదాపు అదే పని అయినా రైతు కూలీకంటే రెట్టింపు కూలి వస్తున్నది.

రాజమ్మ ప్రొద్దునే నిద్రలేచి, ఇల్లు ఊడ్చి, ముగ్గు వేసి, రాతి వెండి బొచ్చెలో ఇంత అన్నం, ఇగురు తయారుచేస్తుంది. ఏవో రెండు ముద్దలు బొక్కి, గబగబా, ట్రాక్టర్ అందుకోవటం కోసం వెళతారు, మధ్యాహ్న భోజనం చట్టిలోపెట్టి దానికి వాసిన కట్టుకుని.

మధ్నాహ్నం అక్కడే చెట్టుంటే చెట్టు నీడన లేకుంటే చరియలో కూర్చుని భోజనం ఉల్లిగడ్డ, పచ్చిమిర్చి కొంచెం మజ్జిగతో కానిచ్చి, ఐదు నిముషాలు విశ్రాంతి తీసుకుని తిరిగి పనిలోకి దిగుతారు.

శేషయ్యకు ఈమధ్య చిన్న పని చేసినా రొప్పు వస్తున్నది. అయితే పళ్ళ బిగువున పనిచేస్తున్నాడు. రాజమ్మ పరిస్థితీ అలానే వుంది. బుగ్గలు, కళ్ళు లోనికి పీక్కుపోయి, కండలు వేలాడుతూ, కొద్దిగా వంగి నడుస్తూ వుంది. ఒక్కసారిగా వయసు భారం ఆమెపై పడినట్లుగా వుంది.

వీరు పనికి వెళ్ళటం మొదలుపెట్టాక, వెంకటేశం కూడా పనికి వెళుతున్నాడు.

వీలు చిక్కినపుడల్లా కూతురు గురించి ప్రశ్నిస్తోంది రాజమ్మ కళ్లొత్తుకుంటూ. అందరూ తిరుపతమ్మ గురించి మంచిగానే చెప్పారు. ఆమె అందరూ అనుకునేట్లుగా లేచిపోవటం చేయదనీ, ఏదో తిరకాసు ఉందనీ చెబుతున్నారు.

'నాకు తెలుసు ఖచ్చితంగా ఏదో గూడుపు ఠాణీవుంది' అంది ఒకమ్మాయి. రమణ తిరుపతమ్మను గురించి తనను అడగటం, ఆమె నిప్పులాటిదని తాను చెప్పటం వివరించింది. ఏది ఏమయినా రమణకు కొంత తెలిసివుండాలి అనే అనుమానం వ్యక్తం చేసింది. తిరుపతమ్మ పారిపోయింది రమణ స్నేహితులతోటేనని గదా పుకారు! కనుక రమణకు తప్పకుండా తెలిసి వుంటుంది అని ఆమె ఆర్గ్యుమెంట్.

మిగతా కూలీలు కూడా దానినే సపోర్టుచేశారు. కాని, ఆ సంఘటన తరువాత రమణ ఎప్పుడూ గనికేసి రావటంలేదు. పనికి వెళ్ళని రోజు రమణ ఇంటికెళ్ళి అయినా ఆచూకీ చెప్పమని ప్రాధేయపడాలి అని నిశ్చయించుకున్నాడు శేషయ్య.

ముందురోజు భారీవర్షం పడింది. గనులలో నీళ్ళు నిలిస్తే పనిచేసే అవకాశం ఉండదు. అలానే వాన పడుతున్నా పని చేసే అవకాశంలేదు. అదే బట్టీలలో అయితే పని ఆగదు. అయితే కార్మికులు గనిదాకా వెళ్ళి, పని చేసే వీలుంటే చేస్తారు. అలానే ఉదయమే బయల్దేరారు శేషయ్య, రాజమ్మ.

ట్రాక్టర్ ఏడుగంటలకల్లా గని దగ్గరకు చేరింది. బాగా లోతుగా తవ్వినచోట నీళ్ళు నిలిచినా కొత్తగా తవ్వకాలు ప్రారంభించిన చోట నీరు నిలవలేదు. అందుకని పని ప్రారంభిద్దామనే అనుకున్నారు కార్మికులు. అప్పటికే సూర్యుడు తన ప్రతాపాన్ని చూపించటం మొదలుపెట్టాడు.

దాదాపు పన్నెండు గంటలు కావస్తుండగా కొంచెం మబ్బులు మొదలయి, చినుకుల్లా మారాయి. కార్మికులందరూ దగ్గరున్న సొరియల్లోకి చేరారు. సొరియలంటే, నిలువుగా తవ్వకం అయ్యాక అడ్డంగా తవ్వుకుంటూ వెళతారు. పైన రాయిమట్టి అలానే వుంటాయి. కొద్దిగా త్రవ్వాక అక్కడ పోటీలు పెట్టి ముందుకు త్రవ్వుతారు. అదో గుహలా వుంటుంది చూడటానికి.

రాజమ్మ, శేషయ్య అలాటి సొరియలోకి వెళ్ళారు. వాన మెల్లమెల్లగా పెరుగుతోంది కాని తగ్గటంలేదు.

"ఈ లోపల బువ్వ తినేద్దాం" అన్నాడు శేషయ్య. ఆ చలికి అతడికి వణుకు వస్తోంది.

రాజమ్మ చట్టి విప్పింది. ఒక మూలనున్న కుండలోంచి నీరు తెచ్చిపెట్టింది. ఒక ముద్ద కలిపి నోట్లో పెట్టుకోబోయాడు శేషయ్య.

అంతే!

ఉరుము ఉరిమినట్లుగా, భూమి కంపించినట్లుగా అనిపించింది. క్షణంలో జరిగేదేమిటో తెలిసేలోగానే అంతా చీకటి... చిమ్మచీకటి... పైన దాదాపు నాలుగడుగుల మందంవున్న మట్టి, రాయి ఒక్కసారిగా విరిగి పెద్ద శబ్దంతో క్రిందికి దిగిపోయింది.

కొన్ని టన్నుల బరువున్న ఆ మట్టిలో అట్టడుగున వుండిపోయారు వారు. ప్రకృతి కట్టిన సమాధి అది. వారి బాధలు చూడలేక భూదేవే కృంగిందేమో!

చుట్టూ హాహాకారాలు... కార్మికులంతా చుట్టూ వున్న సొరియల్లోంచి బయటకు వచ్చేశారు... ఏ సొరియ కూలింది? అడుగుతున్నారు.

వారికి కూలిన సొరియ కనిపించింది.



ఎవరున్నారు దానిలో? 'ఆ ముసలోళ్లిద్దరూ వున్నారు' ఎవరో అన్నారు.

"అయ్యోపాపం' అంటూనే అక్కడున్న మట్టి మట్టిపెల్లలు తీయటం ప్రారంభించారు. మేస్త్రీ వచ్చి అన్నాడు. "దాదాపు నాలుగు ట్రక్కుల మట్టి తీయాలి. అదిపుడు సాధ్యం కాదు'' చెప్పాడు దానిని పరీక్షగా చూసి.

అంటే- శేషయ్య రాజమ్మ సజీవసమాధి అయిపోయారన్న మాట!! వెంటనే ఆ వానలోనే ట్రాక్టర్ ఒకటి కదిలింది ముఖ్యులను ఎక్కించుకుని. గని యజమానికి విషయం తెలియపర్చటం, కొడుకుకి చెప్పటం కోసం వారు కదిలారు.

అదే ట్రాక్టరులో గంటలోపే అక్కడికి చేరుకున్నాడు వెంకటేశం. వాన తగ్గింది. సారియను చూస్తూనే పెద్దగా ఏడుస్తూ రెండు చేతులతో మట్టిపెళ్ళలను లాగసాగాడు అతడు. అతడికీ ప్రపంచంలో 'నా' అంటూ మిగిలింది వారిద్దరే... ఇక వారు లేకపోతే?

గుండెలు వ్రయ్యలయ్యేలా దుఃఖిస్తున్నాడు వెంకటేశం.

చూసిన వారి గుండెలు తరుక్కుపోతున్నాయి.

తమ్ముడు అతని కళ్లెదురుగ్గానే సజీవంగా దహించబడటం...

చెల్లెలు ఏమయిపోయిందో తెలియకపోవటం.

ఇపుడు మిగిలిన తల్లీదండ్రీ ఒక్కసారే సజీవసమాధి కావటం. అందరి గుండెలనూ పట్టిచ్చిన, గుండెలు తరుక్కుపోయేలా చేసిన విషాదసంఘటన అది!

ఈలోగా దగ్గర గనులన్నిటి నుండీ విషయం తెలిసిన కార్మికులు వచ్చారు. వారే దాదాపు మూడొందల మంది అయ్యారు.

"మట్టి లాగండి. ఎంతసేపుట్లో తీస్తాం?" ఎవరో అన్నారు. అంతే అందరూ తలా ఒక చేయి వేయసాగారు.

ఈ లోపల విషయం తెలిసిన ఇస్రాయేల్, మరియమ్మ, ఏసుపాదం వచ్చారు. ఇస్రాయేల్‌ని చూడగానే కౌగలించుకుని భోరుమన్నాడు వెంకటేశం.

అంతలోనే గని యజమాని, కార్మికనాయకులు అక్కడికి చేరుకున్నారు. ఒక గంటలోపే మట్టీ. రాళ్లూ అన్నీ చకచకా తీసేశారు కార్మికులు.

ముందుగా శేషయ్య చేయి కనిపించింది. ఆ చేతిలో తినబోతున్న ముద్ద. అందరికళ్లూ చెమర్చాయి. నెమ్మదిగా మట్టిని తీయసాగారు వారు. పావుగంటలో రాజమ్మ, శేషయ్యల శవాలు ఆ గనిలో పడుకోబెట్టబడ్డాయి.

వారి మంచితనం తెలిసిన తోటికార్మికులు కన్నీరు పెట్టుకున్నారు.

శేషయ్య గతవైభవం తెలిసిన ఇస్రాయేల్-శోకం ఊహించనలవికావటంలేదు. ఇన్నేళ్లుగా తమ ఇంట్లో మనిషిలా అన్నిటికీ తోడుగా వున్న రాజమ్మను చూసి బావురుమంది మరియమ్మ.

ఇద్దరి శవాలు చెక్కుచెదరలేదు. నిద్రపోతున్నట్లుగా వున్నాయి ముఖాలు. వారిపై బడి రోదిస్తున్నాడు వెంకటేశం గుండెలు పగిలేలా.

ఇక ఈలోకంలో వెంకటేశానికంటూ ఎవరూ లేరు!!

వెంకటేశం భుజంపై చేయివేసి దగ్గరగా లాక్కున్నాడు ఏసుపాదం 'నేనున్నాను' అన్నట్లుగా.

"మిగతా పనులు కానివ్వండి..." ఎవరో అన్నారు. "శవాలను ఇంటికి తీసుకెళ్లాలా?"

ఇస్రాయేల్ అక్కరలేదన్నట్లుగా తలూపాడు.

అక్కడికి కొంచెం దూరంగా కొందరు వెళ్ళి గుంతలు త్రవ్వారు. ట్రాక్టర్ పై శవాలను ఎక్కించి అక్కడివరకు తీసుకెళ్ళారు.

పాడె కట్టవలసిన అవసరం లేదు. కోరా




గుడ్డ పని లేదు... శేషయ్య పై పంచే అతడి శవంపై గుడ్డ అయింది.

ఇస్రాయేల్ పైపంచె రాజమ్మపై కప్పారు.

వెంకటేశంచేత మూడు పిడికిళ్ల మట్టి శవంపై వేయించారు. నిద్రపోతున్నట్లుగా వున్న తల్లి శవాన్ని చూసి బావురుమంటూ మట్టి వేశాడు వెంకటేశం. వెంటనే అందరూ తలా మూడు పిడికిళ్లు మట్టి వేశారు. తరువాత తండ్రి శవంపై గుడ్డ తొలగించి, చివరిసారిగా ముఖంచూసి, తిరిగి మూసేసి మూడు పిడికిళ్ల మట్టి వేశాడు.

వెంకటేశాన్ని దూరంగా తీసుకువెళ్లాడు ఇస్రాయేల్. నిముషాలలో రెండు సమాధులు అక్కడ వెలిశాయి. చివరిసారి నమస్కరించి వెనుదిరిగాడు వెంకటేశం.

అతడిని పొదివి పట్టుకుని నడిపిస్తున్నాడు ఏసుపాదం. అతడి వెన్ను నిమురుతూ, కన్నీరు తుడుస్తూ నడుస్తోంది మరియమ్మ.

అంతలో అసోసియేషన్‌వాళ్లొచ్చారు వెంకటేశంతో మాట్లాడటానికి.

"అతన్ని వెళ్లనివ్వండి నేను మాట్లాడతాను'' అన్నాడు ఇస్రాయేల్.

"జరిగినదానికి చాలా చింతిస్తున్నారు యజమాని వర్గంవారు. ఇద్దరూ ముసలివారే కదా... చెరో పదివేలూ ఇద్దామనుకుంటున్నారు''

వారికేసి చూశాడు ఇస్రాయేల్ - ఆ చూపులో ఒక అసహ్యాన్ని చూస్తే కలిగేంత ఏవగింపు వుంది.

"వాళ్ళ కొడుకు చచ్చినపుడు పాతికవేలిస్తామని చెప్పి చివరకు మిగిల్చింది ఏడువేలు. కూతురు గనిలో పనికి వచ్చి మాయమైతే ఏ చర్యలూ తీసుకోకుండా ఆ అమాయకురాలిమీద అభాండాలు వేసి ఏమీ ఇవ్వలేదు మీ నాయకత్వం, ఆ యాజమాన్యం. ఇప్పుడు నిండు ప్రాణాలు పోతే చెరి పదివేలిస్తారా? అక్కర్లేదు..." గట్టిగా అరుస్తున్నాడు. కార్మికులంతా చుట్టూ చేరారు. అతడి మాటల్లోని నిజం వారికి తెలుసు.

"చెప్పండి... మీరే చెప్పండి... మీలో ఎవరి తల్లయినా, తండ్రయినా మరణిస్తే దీనికి అంగీకరిస్తారా?"

"లేదు..." అరిచారు వారు.

"తల్లీదండ్రిని ఒక్కసారిగా ఈ గనిలో కోల్పోయి, ఈ గనిలోనే చెల్లెలు మాయమైతే, ఈ రాయితోనే తమ్ముడు మరణించి, అనాధగా ఎవరూ లేకుండా నిలబడితే వాడు బతకటానికి ముష్టిపారేస్తారా? చెరి యాభైవేలు ఇవ్వండి... ఇప్పించండి... తిరుపతమ్మ ఏమయిందో మీరే చెప్పండి... ఇవన్నీ జరగకపోతే ఇక ఈ గనిలో కార్మికులు ఎవరూ పనిలోకి దిగరు... రేప్పొద్దునే మేం పోలీస్ రిపోర్ట్ ఇస్తాం" చెప్పేసి కదిలాడు ఇస్రాయేల్.

"అంతే..." అరిచారు కార్మికులు.

యూనియన్ నాయకులు ఈ తిరుగుబాటుకు తత్తరపడ్డారు. తమ గ్రిప్ పోతుందేమోనని భయపడ్డారు. గబగబా యజమానుల దగ్గరకు పరిగెత్తారు.

కార్మికులు ఇళ్లకు బయల్దేరారు.

యాజమాన్యంతో కార్మికుల షరతులు చెప్పారు నాయకులు. ఇస్రాయేల్ బెదిరింపూ చెప్పారు.

యజమాని గుండెల్లో రాయి పడింది.

ఎందుకంటే అది గవర్నమెంట్ ఆథరైజ్డ్ లైసెన్స్ వున్న ఓపెన్‌మైన్ కాదు. అది చాలా పెద్ద తప్పు.

అలా సొరియలు తీసి వుంచటం మరో తప్పు. సొరియలు పడగొట్టాలి.

యజమాని గుండెల్లో రైళ్లు పరిగెత్తాయి. "సరే రాత్రికి ఆలోచించుకుని రేప్పొద్దుటే చెబుతాం" అన్నాడు మిగతా యజమానులతో కలిసి కారు ఎక్కుతూ. ఆ గని ఓనర్ కొడుకే రమణ. ఇది విన్న రమణ గుండెల్లో రైళ్లు పరిగెత్తాయి. కేసు పెట్టటం అంటూ జరిగితే తీగ లాగినట్లే... అపుడు డొంకంతా

కదులుతుంది. కనుక అలా జరగటానికి వీల్లే దు అనుకున్నాడు. అతను సలహా తీసుకునే వ్యక్తి ఒకడే వున్నాడు... తనదగ్గర అవసరమ యినపుడల్లా డబ్బు తీసుకుంటున్నాడు. అత డు హెల్ప్‌చేస్తాడు అనుకుని అదే తండ్రితో చెప్పాడు.

అరగంటలో తండ్రీకొడుకులిద్దరూ 'దాదా' ఇంటికి చేరారు. విషయమంతా వివరించి చెప్పాడు రమణ తండ్రి పదివేల రూపాయల కట్ట టీపాయ్‌పై వుంచుతూ. నున్నటి గడ్డాన్ని సవరించుకుంటూ మొత్తం తాపీగా విన్నాడు దాదా.

"వాళ్లు ఎంత అడిగారు?" అన్నాడు.

"లక్ష"

"మీరెంత ఇద్దామనుకుంటున్నారు?"

"ఇరవై వేలు..."

"కేసు పెట్టినా వారికా డబ్బు వస్తుంది. కాని నీకో రెండు లక్షలు పోతాయ్'' మాట్లాడ లేదు వారు.

"ఒక పని చెయ్... నాకు యాభైవేలు ఇవ్వు. అసలే గొడవా లేకుండా చేస్తాను..."

"మరి కార్మికులూరుకోరేమో..." నసిగా డు రమణ.

"దాదా ఒక్కమాటే చెబుతాడు... అది జరిగి తీరుతుంది''

కాసేపు ఆలోచించాడు రమణ తండ్రి.

"మరి పోలీస్‌కేస్''

"అది నేను చూసుకుంటాను. మీకు ఏ నష్టమూ రాకుండా చూసే పూచీ నాది''

"సరే ఇవ్వు..." అన్నాడు రమణ.

జేబులోంచి డబ్బు తీసి చేతిలో పెట్టాడు రమణ తండ్రి.

తీసి డ్రాయర్ సొరుగులో పడేశాడు దాదా.

బెల్ నొక్కాడు.

ఒక యువకుడు లోనికొచ్చాడు. "జాన్స న్‌ని పిలువు..." అన్నాడు.

రెండో నిముషంలో వచ్చాడు జాన్సన్.

"చూడు... వీళ్లకెవడో పిల్లాడు అడ్డం వున్నాడట. వాడినీ రాత్రికే పైకి పంపించు. శవాన్ని సున్నపు బట్టీలో పారెయ్. ఆ కుర్రాడె క్కడుంది రమణ నీకు చూపిస్తాడు'' పదివే లు అతడికి విసిరేస్తూ అన్నాడు దాదా.

"చూడండి... ఒక రిపోర్ట్ ఇచ్చేవారుండ రు. కాంపన్సేషన్ ఇవ్వటానికి అసలు మనిషే లేడు'' నవ్వాడు దాదా.

తృప్తిగా తలూపి కదిలాడు రమణ, అతడి తండ్రి.

★ ★ ★

రాత్రి పది గంటలయింది. తన స్నేహితు లతో ఈ విషయాన్ని చర్చించి ఇంటికి బయల్దేరుతున్నాడు ఇస్రాయేల్.

మలుపు తిరిగేచోట క్రీనీడలోంచి బయ టకు వచ్చింది అంజమ్మ. ఆగాడు ఇస్రా యేల్. రమ్మన్నట్టుగా సైగచేసి పక్క గొంది లోకి దారితీసింది. పక్కనే నడుస్తున్నాడు ఇస్రాయేల్.

"వెంకటేశాన్ని చంపడానికి నిర్ణయించేశా రు. ఈ రాత్రే ముహూర్తం... నీ ఇష్టం... ఏం చేస్తావో... ఎలా చేస్తావో... ఆ పిల్లాడిని కాపాడు... మెయిన్ రోడ్డులోకి రాకు... నడి బజార్లో పట్టపగలు హత్యలు జరగటం ఈ ఊళ్లో చాలా సాధారణ విషయం... వెంటనే వెళ్లు..." అంటూనే ముందుకెళ్లింది అంజ మ్మ.

ఇస్రాయేల్ కొంచెం వడిగా నడిచి, ఇంటికి పరుగందుకున్నాడు. కొంచెం ముందుకు నడిచి ఏదో నిర్ణయానికొచ్చినదానిలా పక్క సందులోకి తిరిగిందిఅంజమ్మ.ఆ బజార్లో ఒక పత్రికా విలేఖరి ఉంటున్నాడు. ఏ వార్తనయి నా నిర్భయంగా పంపించగలడు. ప్రచురింప చేయగలడు. తనకు ఆచూకి ఇచ్చినవారి పేర్లు ప్రాణం పోయినా బయటపెట్టడు. ఆ పత్రికలో వార్త ప్రచురింపబడితే ప్రభుత్వ యంత్రాంగమంతా కదులుతుంది... ఆలోచి




స్తూ ఆ ఇంటి తలుపు తట్టింది ఆమె.

★ ★ ★

గసపెడుతూ ఇంటికొచ్చాడు ఇస్రాయేల్. వయసువల్ల, పరుగువల్ల, భయంవలన వచ్చిన ఆయాసం అది. వెళుతూనే లోపల పెట్టె తాళాలు తెరిచాడు. దానిలో వున్న డబ్బంతా గుప్పిటలో అందుకున్నాడు. పరుగుతో శేషయ్య ఇంటికెళ్లాడు.

ఒకపక్కన కూర్చుని తనలో తానే కుమిలిపోతున్నాడు వెంకటేశం. మరోపక్క దీనంగా చూస్తున్నాడు ఏసుపాదం.

"వెంకటేశం... నిన్ను చంపటానికి మనుషులొస్తున్నారు. పారిపో..." అంటూ అతడి చేతిలో డబ్బు కుక్కాడు ఇస్రాయేల్.

"ఏసుపాదం... నీవు రిక్షా తీయి... మెయిన్ రోడ్‌కి వెళ్లకు. రైలు కట్టకు అటువేపు నుండి స్టేషన్‌కి తీసుకుపో వెంకటేశాన్ని... బయల్దేరు'' గసపెడుతూనే చెప్పాడు.

రేసుగుర్రంలా పరిగెత్తి రిక్షా తెచ్చాడు ఏసుపాదం. దానిలో కూర్చున్నాడు వెంకటేశం. అతడి కన్నీళ్లు తుడిచాడు ఇస్రాయేల్.

"ప్రభువా! ఇతడిని రక్షించు'' ప్రార్థించాడు.

ఆలోపలే రిక్షా కదిలింది. వేగంగా పోతోంది రిక్షా. ఆ ప్రాంతంలో లైట్లు లేకపోయినా అలవాటుకొద్దీ వేగంగా రిక్షా తొక్కుతున్నాడు ఏసుపాదం.

రైలుగేటు దాటింతరువాత ఒక మెరకపై నుండి కిందపడబోయింది రిక్షా. కొంచెం ముందుకు సాగేసరికి అంతా బురద.

రిక్షా ఆపాడు ఏసుపాదం. 'పద' వెంకటేశం చేయి పట్టుకుని పరిగెత్తాడు ఆ చీకట్లో. నిర్వికారంగా పరుగెడుతున్నాడు వెంకటేశం.

ముళ్లూ, రాళ్లూ చూడకుండా పరుగెడుతున్నారు వారు చీకటిలో. కొంచెం దూరంలో స్టేషన్ కనిపించింది. సిగ్నల్ వేయకపోవటంవలన ఏదో ట్రైన్ ఆగివుంది.

నడికుడి-బీబీనగర్ లైన్ పడ్డ తరువాత ఆ స్టేషన్‌మీదుగా చాలా ట్రైన్స్ వెళుతున్నాయి. వరంగల్ రైల్‌రోడ్ బాగా లేకపోతే ఆ ట్రైన్సూ ఇటే వస్తాయి. అలా వస్తే అవి బాంబేకో, లేదా హైదరాబాద్‌కో, ఇటయితే కలకత్తాకో లేక మద్రాసుకో, కొచ్చిన్‌కో ఎక్కడికో ఒకచోటుకి వెళుతుంది ఆ ట్రైన్.

ఏ ఊరయినా ఈ వూరు కాకుండటం ముఖ్యం.

గస పెడుతున్నాడు వెంకటేశం. సిగ్నల్ వేశారు. ట్రైన్ మెల్లగా కదులుతోంది. "పరిగెత్తుకుపోయి ఎక్కు'' అతడిని కౌగలించుకుని చెక్కిలిపై ముద్దాడి అన్నాడు ఏసుపాదం.

కళ్లు తుడుచుకుంటూ పరుగెత్తి పోయి కదులుతున్న ట్రైన్‌లో ఎక్కేశాడు వెంకటేశం. నిముషంలో వేగం అందుకుంది ఆ ఎక్స్‌ప్రెస్ ట్రైన్.

గేటుపక్కనే నిలబడి ఆయాసాన్ని తగ్గించుకుని, చొక్కాతో ముఖం తుడుచుకుని నిలబడ్డాడు వెంకటేశం.

ట్రైన్ ఆ వూరి పొలిమేరలు దాటేసరికి కొంచెం స్థిమితపడ్డాడు. ప్రాణభయం పోయింది.

తాపీగా ముందుకు చూశాడు.

అది జనరల్ కంపార్ట్‌మెంట్. పెట్టెనిండా జనం ఉన్నారు క్రిక్కిరిసి. కొంచెం పక్కకు కదిలి జేబులోని డబ్బు తీశాడు. లెక్క పెట్టాడు. అవి ఎక్కువ రూపాయి నోట్లే... దాదాపు ఎనభైదాకా వున్నాయి.

నిట్టూర్చి వాటిని జేబులో దోపుకున్నాడు. తలుపు వేసి దానికి ఆనుకోని నిలబడ్డాడు. అతడి గుండెలవేగం క్రమంగా తగ్గుతోంది. తల్లిదండ్రుల మరణంకన్నా తన ప్రాణభీతి అతడిని మరింత భయపడేలా చేసింది.

కంపార్ట్‌మెంట్ లోపలకు చూశాడు.

ఒక కుర్రవాడు, తనకంటే చిన్నవాడు చొక్కా విప్పి కంపార్ట్‌మెంట్ తుడుస్తున్నాడు. సీటుకింద తుడిచి చెత్త పక్కకు నెట్టి చేయి

చాపి అడుగుతున్నాడు. అది యాచన కాదు. శ్రమశక్తి... చిల్లర నాణాలు అతడి చేతుల్లో పడుతున్నాయి. కొందరు కసురుకుంటున్నారు. అయినా అతడి ముఖంలో కోపంగాని, చిరాకుగాని లేవు. తన పని తాను చేసుకుపోతున్నాడు.

అతడికేసే చూస్తున్నాడు వెంకటేశం.

ట్రైన్ వేగంగా, కాలంతో పోటీపడుతూ దూసుకుపోతూనేవుంది...

అది ఆరంభం...

* * *

నేను ప్రారంభంలోనే చెప్పాను. వచ్చేవాళ్లు వస్తూవుంటారు. పోయేవాళ్లు పోతూవుంటారు.

జీవితసమరంలో అలసిసొలసి, కులం వెనుక పరిగెత్తి, పార్టీలచుట్టూ తిరిగి తిరిగి, సిద్ధాంతాలతో వేసారి, చేతికందినట్లు అంది అందకుండా మాయమయ్యే డబ్బు వెనుక పరిగెడుతూ, శాంతి అనే దప్పిగొని మృగతృష్ణ చుట్టూ, పరిభ్రమిస్తుంటారు జనం. అది అపుడూ అంతే. ఇపుడూ అంతే.

ఇంతవరకూ నే చెప్పింది కేవలం పదిహేను సంవత్సరాల నా చరిత్రలో జరిగిన అతి స్వల్పమైన విషయాలే. కాని నేను ఎన్నో సంవత్సరాల గతాన్ని ఎరిగున్నాను. మీకు తెలియకపోవచ్చునేమోగాని కొన్ని తరాల ముందునుండి ఏం జరుగుతున్నదో నాకు తెలుసు.

అపుడు బ్రాహ్మణులది అగ్రకులం. డబ్బు వారిది, అధికారం వారిది. మొన్న మరో కులం అగ్రకులం అయింది. నిన్న ఇంకో కులం అగ్రకులం అయింది. అగ్రకులంగా మారిన ప్రతి కులం డబ్బుని, అధికారాన్ని పోగుచేసుకుంటోంది. మిగతా కులాల్ని అణగదొక్కుతోంది. కులానికి బదులు 'అసోసియేషన్' అనే మరో ముసుగు తగిలిస్తోంది. ఒకేపని చేస్తున్న కార్మికులు, కర్షకులు, వ్యాపారులు, ఉద్యోగులు అనే మరో ముసుగు తొడుక్కుంటోంది.

రేపు...?

ఈనాటి అగ్రకులం రేపటి అణగదొక్కబడిన జాతి కావచ్చు. నిన్న హీనంగా చూడబడిన జాతి రేపు అగ్రస్థానానికి చేరవచ్చు. కాని అణిచేకులం, అణచబడే కులం ఎల్లవేళలా వుండాలా...?

ఉండక తప్పదేమో! పరిపాలకులున్నప్పుడు పాలింపబడేవారుండాలి. దోచుకునేవాడుండేటప్పుడు దోచుకోబడేవాడుండాలి. ప్యూన్ లేనపుడు ఆఫీసర్ ఉండే అవకాశమే లేదు.

మార్క్స్ కలలుగన్నాడు సమసమాజంకోసం. కార్మిక కర్షక నియంతృత్వం అధికారంలోకి వస్తే సమసమాజం వస్తుందనుకొన్నాడు. రష్యాలో వచ్చింది. కాని కార్మికులు కర్షకులని దోచుకున్నారు. నాయకులైన కార్మికులే బూర్జువాలయ్యారు. బ్యూరోక్రాట్సే దోపిడీదారులయ్యారు. రష్యా పతనమయింది. స్వేచ్ఛగోరే మేధావులను అణచివుంచుతూ సైనిక నియంతృత్వాన్ని జోడించి చైనా ప్రస్తుతం మనుగడసాగిస్తోంది. కాని స్వేచ్ఛావిపణికి అవకాశం కల్పించిన చైనా భవిష్యత్తు ప్రశ్నార్థకం. మిశ్రమ ఆర్థిక విధానాన్ని పోషించిన నెహ్రూ ఆలోచనలు, సోషలిజం, నేడు నిష్ప్రయోజనమని తేలిపోయాయి. నరసింహారావు తెరచిన స్వేచ్ఛావిపణి ద్వారాలు, మన్మోహన్‌సింగ్ ఆలోచనా విధానాలు ఈ దేశాన్ని ఎటు తీసుకెళతాయో కాలమే నిర్ణయించాలి. రెండువందలకు పైగా సంవత్సరాలుగా స్వేచ్ఛావాయువులు పీలుస్తూ ప్రజాస్వామ్యపు విలువలు హెచ్చుగా వున్న అమెరికాలోనూ ధనికుడికీ పేదవాడికీ ఉన్న తేడా ఊహించలేనంత. మత ఛాందస సైనిక నియంతృత్వం మరోవేపు బలపడుతోంది. ఇవన్నీ ఎందుకోసం పోటీ పడుతున్నాయి? ప్రపంచాధికారంకోసం. ప్రపంచ విపణిలో




ప్రథమస్థానంకోసం. దానికోసం ప్రాంతం, సిద్ధాంతం, నిపుణత అనేవి చూపుతూ తమ స్థానాల్ని పదిలపర్చుకుని, తమ అధికారాన్ని, డబ్బుని నిలుపుకోవటానికి ప్రయత్నిస్తు న్నాయి.

దీనికీ, మన దేశంలోని ఒక గ్రామాన్న యిన నాలోవున్న ప్రజలకూ తేడా కన్పించ టంలేదు. ఇక్కడా అధికారం, డబ్బుకోసం పోరాటమే. దానికి కులం, మతం, ప్రాంతీయ తత్వం మొదలైనవి పావులుగా వాడుకోబడు తున్నాయి.

అయితే అక్కడా ఇక్కడా దిగజారినవి విలువలే! అయితే మూఢవిశ్వాసాలు మారలే దు. తరాలనాడు గంగమ్మ గుడిలో బలులు ఇచ్చేవారు... ఈనాడూ ఇస్తున్నారు. మారింద ల్లా అవసరంకోసం మార్చుకోదగిన విలువ లే. నాడు శీలానికి ఉన్న దృక్కోణం వేరు. నేడు చూస్తున్న దృక్కోణం వేరు.

నేడు అణగదొక్కబడుతున్న స్త్రీ తన స్వే చ్ఛకోసం పురుష దురహంకారాన్ని తెగనాడ డంకోసం తన గళాన్ని విప్పింది. ఇద్దరూ సమానంగా వుండాలనే నేటి దృక్పథం రేపటి మాతృస్వామ్యానికి పునాది కావచ్చు. ఎందు కంటే ఇద్దరూ సమానంగా వుండాలి అనే అద్భుతమైన, రమ్యమైన కల, యుటేపియా కావచ్చు!

అసలు సమసమాజమనేదే మేధావులనబ డే పిచ్చివాళ్లు కంటున్న రంగులకల!! తర తరాల మనుషులను చూశాను. చరిత్రను చూశాను. ఎపుడూ దోపిడీ తప్ప మరొకటి లేదు... కాకుంటే మనుషులు మారవచ్చు. స్థానాలూ మారవచ్చు. అంతే.

ముప్పై ఏళ్లనాడు నాలుగైదు వేల జనాభా వున్న నేను ఈనాడు ఏభైవేల జనాభాకు పెరిగినా, నాటికంటే నేడు శాస్త్రీయంగా ఎంతో పురోగమించినా, నాటి దోపిడీయే నే డూవుంది. రేపూ ఉంటుంది. కాకుంటే మను షులు మారవచ్చు, కులాలు మారవచ్చు, మనుషుల స్థానాలు మారవచ్చు.

ఈ నా కథ... నా ఒక్క కథ కాదు. ప్రతి గ్రామం కథ, ప్రతి నగరం కథ, ప్రతి దేశం కథ. అయితే ప్రతి వ్యక్తికి ప్రత్యేకమైన అనుభవాలుంటాయి. అనుభూతులుంటాయి. ఆశలుంటాయి. అదే జీవన స్రవంతిని నడి పిస్తున్న బలమైన శక్తి, అదే ప్రపంచాన్ని మన నేత్రాలతో చూపింపచేస్తున్నది. మన ఆశయా లకోణంనుండి, మన నైతిక విలువలనుండి, మన కట్టుబాట్లనుండి, మన సంస్కృతి నుండి, మన సిద్ధాంతంనుండి ఏదో ఒక రంగుటద్దాన్ని మన నేత్రాలకు బలవంతంగా వుంచి, చూసేలా చేస్తున్నది.

ఈ రంగుటద్దాలు తొలిగేదెన్నడో!?

మనసున మనసై, తోటివారినీ తనలాగా నే ప్రేమించేదెన్నడో?

బహుశా నాదీ రంగుల కలేనేమో!!

అలా అని నేను నిరాశావాదిని కాదు.

కవినై రాని సమ సమాజంకోసం కవితలు రాయలేను. అలాగని భావుకత్వంలోనూ ము నిగిపోను.

రచయితనై, ఆశావాదినై సమసమాజం వస్తుందని పాఠకుడిని భ్రమల పెడుతూ కథలు రాయలేను.

కాని - దోపిడి కొంత తగ్గించటానికి ప్రయత్నం చేస్తాను. అదే రాస్తాను... అసలు నేను నా జీవిత చరిత్ర అంటూ రాస్తే!



గమనిక: ఈ నవలలో కథాగమనంకోసం కొన్ని ఊర్లపేర్లు, డిపార్ట్‌మెంట్‌ల లోని వ్యక్తుల హోదాలను, వృత్తు లను ఎన్నుకోవటం జరిగింది. ఇవన్నీ ఊహాజనితమే తప్ప ఎవ రినీ ఉద్దేశించి రాయబడినవి కా వని గమనించగలరు!

-రచయిత




# ఏరిన ముత్యాలు

★ జీవితంలో ఏదీ వ్యసనంగా పరిణమించకూడదు. అదే జీవితానికి ప్రధానసూత్రం

-టెరెన్స్

★ జీవితం ఒక సుదీర్ఘప్రయాణంలాంటిది. ఈ ప్రయాణంలో మంచి స్నేహితులు లభిస్తే మార్గాయాసమే తెలియదు

-జాన్‌మిల్టన్

★ నీమీద వేసిన నింద నిజమైతే తప్పు సరిదిద్దుకో. అబద్ధమైతే నవ్వేసి ఊరుకో

-షేక్‌స్పియర్

★ విజ్ఞానం పొందాలనుకుంటే శ్రమించక తప్పదు. శ్రమపడటం అనేది జీవనసూత్రం

-రస్కిన్

★ భయం ఎప్పుడూ అజ్ఞానంనుంచే పుట్టుకొస్తుంది

-ఎమర్సన్

★ సంతోషం కూడా మంచుబిందువులాగా సున్నితమైనది. నవ్వుతూనే నిష్క్రమిస్తుంది

-టాగూర్

★ పిరికివాడవై నీవు సాధించేదేమీ లేదు. వెనుకంజ వేసి నీవు ఏ ప్రమాదాన్ని తప్పించుకోలేవు

-వివేకానంద

★ అసాధ్యమనేది మూర్ఖుల నిఘంటువులో మాత్రమే కానవచ్చే పదం

-నెపోలియన్

★ బావిలో నీరు ఎండిపోయినపుడే దాని విలువ తెలుస్తుంది

-బెంజిమన్

★ కనీసం ఒక్క చెడ్డగుణమయినా లేందే ఏ మనిషీ మంచివాడు కాలేడు

లింకన్

★ విద్య అనే మహావృక్షంయొక్క వేళ్లు చేదుగానూ, అది అందించే ఫలితం మధురంగానూ ఉంటుంది

-అరిస్టాటిల్

★ బంగారంలో ప్రతి సన్నని తీగకు విలువ ఉన్నట్లే, జీవితంలో ప్రతి క్షణానికి విలువ ఉంది

-కౌటిల్య

★ మానవుని రోగాలలో చికిత్సకు లొంగని రోగం అహంభావం

-ఇర్షాద్

సేకరణ: డి. విద్య

# చమత్కార కెరటాలు

## ఇంటర్వ్యూ

"హలో విజయగారూ!" భుజంమీద చెయ్యి వేసి ఎవరో పలకరించటంతో హడావుడిగా కూరలు ఏరుతున్న విజయ వెనక్కి చూ, సింది. పక్కనే పక్కరోడ్డులో వుండే జయలక్ష్మి.

సమాధానంగా నవ్వుతూ "బావున్నారా! చాలారోజులకి కనిపించారు!" అంది. ఆ అనటంలోనూ, అంటూనే కూరలు ఏరుకోవటంలోనూ విజయ పడుతున్న హడావుడి జయలక్ష్మి దృష్టిని దాటిపోలేదు!

"ఏదో హడావుడిగా ఉన్నట్టుగా వున్నారు! బంధువులెవరైనా వున్నారా ఇంట్లో!"

అప్పటికి విజయ కూరలు తీసుకోవటం అయిపోయినట్టుంది. అంత హడావుడిగానూ కూరలమ్మాయికి డబ్బులు ఇస్తూ, "బంధువులేం కాదు! ఇంటర్వ్యూ వుంది! రేపు!" అంటూ అక్కణ్ణుంచి ఆఘమేఘాలమీద అన్నట్టుగా కదిలింది.

నెలరోజులక్రితం ఏదో ఆఫీసులో ప్రైవేట్ జాబ్‌కి అప్లై చేశానని విజయ చెప్పిన సంగతి జ్ఞాపకం వచ్చింది జయలక్ష్మికి. వాళ్లు రేపు ఇంటర్వ్యూ పెడుతున్నారులా వుంది అనుకుంది. ఏవిటో! ఈ రోజుల్లో ఆడవాళ్లకి అవసరం వున్నా, లేకపోయినా ఉద్యోగం వ్యావర్తి ఎక్కువయిపోయింది! అనుకుంది మనస్సులో.

జయలక్ష్మి కూరలు ఎంచుకుంటుంటే పక్కింటి ఛాయ వచ్చింది బుట్టతో అక్కడికి. జయలక్ష్మిని చూసి ఓ చిరునవ్వు నవ్వి తనూ కూరలు ఏరుకుంటూ "దారిలో విజయలక్ష్మి కనిపించింది. ఏవిటో ఇంటర్వ్యూట! నిలుచుని సమాధానం చెప్పటానిక్కూడ తీరిక లేదన్నట్టుగా వెళ్లిపోయింది. నిన్నా అంతే! ఇంతకీ దేనికి అప్లయ్ చేసిందిట?" అంది.



చెప్పింది జయలక్ష్మి! "ఓహో! అదా విషయం!" అంది ఛాయ. "ఎంత. ఇంటర్వ్యూ అయితేమాత్రం! ఒక్క మాట నిల్చుని మాట్లాడితేనే టైము వేస్టయిపోతుందా మరీ బడాయి కాకపోతేనూ!" అంటూ సాగదీసింది కూడా. విజయకి ఎక్కడ ఉద్యోగం వచ్చేస్తుందో, ఎక్కడ నెలకి ఇంత అని సంపాదిస్తుందోనన్న ఈర్ష్య, కోపం కనిపించాయ్ ఆమె కళ్లల్లో జయలక్ష్మికి.

నాలుగు రోజులయ్యాక ఛాయకి మళ్లీ కూరల బజారులో ఎదురయింది విజయ. విజయ కళ్లల్లో ఆనందం దూరంనుంచి తనని చూసి తనకోసమే ఎదురుచూస్తున్నట్టుగా తీరుబడిగా నిల్చోవటం ఛాయ గుండెల్లో మంటని రేపింది. ఉద్యోగం వచ్చేసిందేమో! అందుకే ఆ కళ్లు అలా మెరుస్తున్నాయ్! తనకి గొప్పగా చెప్పుకోవటానికి కాబోలు ఎదురు చూస్తోంది అనుకుంది. అయినా దగ్గరకి వచ్చాక ఆత్రుతని ఆపుకోలేక అడిగేసింది "మొన్న ఏదో ఇంటర్వ్యూ అంటూ హడావుడిగా వెళ్లిపోయావ్? ఉద్యోగం వచ్చినట్టేనా?"

"ఉద్యోగవాఁ? అదేవిఁటీ?" ఈసారి ఆశ్చర్యపోవటం విజయవంతయింది.

"మరి మొన్న ఇంటర్వ్యూ..?"

"అదా! మావాడికి ఎల్.కె.జి.కి ఇంటర్వ్యూ! ఏదో ఆ దేవుడి దయవల్ల సీటొచ్చేసింది!" అంటూ మరోసారి పైనున్న దేవుడికి దండం పెడుతూ అంది.

"హమ్మయ్య! ఇవాల్టికి గండం గడిచినట్టే!" అనుకుంది ఛాయ మనసులో.

-దర్భా లక్ష్మిఅన్నపూర్ణ

## వెలితి

స్వేచ్ఛాభారతంలో సమ్మెలు, ఘెరావ్‌లు, బంద్‌లు, ధర్నాలు యధేచ్ఛగా జరుగుతున్న రోజులు.

ఫ్యాక్టరీ జనరల్ మేనేజరు కారు స్పీడ్‌గా ఫ్యాక్టరీలోకి మలుపు తిరిగింది.

అలా మలుపు తిరుగుతుండగా గేటుపక్కనే ఉన్న టెంటు చూసి ముందుగా ఆశ్చర్యపోయి ఆ తరువాత విసుక్కున్నాడు.

తన ఫ్యాక్టరీలో ఉన్న ఎన్నో యూనియన్లలో ఏదో ఒక గ్రూపువాళ్లు తమ కోర్కెల పట్టికలతో వంతులవారీ నిరాహారదీక్షకు కూర్చున్నారన్నమాట.

జనరల్ మేనేజర్ మాధవరావు చిరాకుపడ్డాడు. తన ఆఫీసు ముందు గుంపులుగా కూడి కేకలు వేయడం, డౌన్, డౌన్ అని అరవడం కోపాన్ని కూడా తెప్పించాయి.

ఆ తరువాత ఏడాదికల్లా యూనియన్ నాయకులతో సుహృద్భావ వాతావరణంలో సమస్యల పరిష్కారాలకోసం సుదీర్ఘ చర్చలు, కొన్ని సందర్భాల్లో చర్చలు సఫలంకావడం, ఎక్కువసార్లు విఫలం కావడం, వంతులవారీ నిరాహారదీక్షలు, డౌన్‌డౌన్ అరుపులు, కేకలు అలవాటయిపోయాయి.

కాలం గడుస్తోంది.

రోజూ వస్తూనే ఫ్యాక్టరీ ఆవరణలోకి కారు మలుపు తిరుగుతుండగా టెంట్‌లో ఎంతమందున్నారో గమనించే అలవాటు చేసుకున్న మాధవరావు ఓరోజున నీరసపడిపోయాడు.

దిగులుగా తన ఆఫీసుగదిలో కడుగెట్టాడు.

ఫైళ్లు చూడబుద్ధి కాలేదు. లంచ్ అవర్లో ఇంటినుంచి వచ్చిన క్యారియర్‌సైతం విప్ప బుద్ధికాలేదు.

వెలితి... ఏదో వెలితి.

ఈ వెలితి ఎలా తీరుతుంది అని తనలో తాను మధనపడిపోసాగాడు. చివరికో నిర్ణయానికొచ్చి కాలింగ్‌బెల్ నొక్కి స్టెనోను పిలిచాడు.

"ఇన్నాళ్లూ మన ఫ్యాక్టరీ ముందున్న టెంట్ ఏమయింది?" సీరియస్‌గా అడిగాడు.




"విసుగొచ్చి వాళ్లే ఎత్తేసుకున్నారు సార్ రాత్రి'' వినయంగా సమాధానమిచ్చాడు స్టైనో.

"టెంట్ వేసుకోవడం, ఎత్తేయడం అంతా వాళ్లిష్టమేనా? ముందు మన ఫ్యాక్టరీలో ఉండే ఐదారు యూనియన్లలో ఎవర్నో ఒకర్ని టెంట్ వేసుకొని కూర్చోమను'' అని ఆర్డరు జారీచేశాడు.

ఏం మాట్లాడాలో తోచక తలూపి వెళ్లిపోయాడు పి.ఏ. కమ్ స్టైనో.

-దమ్ము శ్రీనివాస్‌బాబు

## మాకూ తెలివితేటలున్నాయండి

సాయంత్రం ఆరవుతూంది.

దట్టంగా కను చీకట్లు ముసురుకుంటున్నాయి.

బస్సు స్టాపులనిండా జనం క్రిక్కిరిసి ఉన్నారు.

తలమీద ఉప్పరితట్ట, చేతిలో పలుగు, గెడ్డపార పట్టుకుని అయిలయ్య, సత్తు భోజనం క్యారేజి పట్టుకుని కొండమ్మ పరుగు పరుగున బస్సు స్టాపుకి వచ్చారు.

అప్పటికే నిండు గర్భిణిలా బస్సు వచ్చి స్టేజిలో ఆగింది. బస్సులో జనం క్రిక్కిరిసి ఉన్నారు.

తోసుకొని తోసుకొని ఎక్కేవాళ్ళు ఎక్కుతుంటే దిగేవాళ్లు దిగుతున్నారు.

"కొండమ్మ ఎట్టాగోఅట్ట బస్సెక్కు, నే గూడా ఎక్కుత" అంటూ అయిలయ్య జనాన్ని తోసుకొంటూ తోసుకుంటూ బస్సులోకి ఎక్కాడు.

ఆడాళ్ళవైపు జనం కాస్త తక్కువుగా వుండటంతో కొండమ్మ అప్పటికే బస్సు ఎక్కేసింది.

ఎంట్రన్స్ పక్కన నిల్చుని గట్టిగా బస్సు రాడ్ పట్టుకొంది.

ఒకళ్ళని ఒకళ్ళు రాసుకుంటు గాలికూడా చొరనంత రష్‌గా ఉంది బస్సు. ఆడవాళ్ళ వైపునుంచి బస్సెక్కిన కండక్టరు 'రైట్' చెప్పాడు. బస్సు కదిలింది.

ఎంట్రన్స్ పక్కనే రాడ్‌ని పట్టుకుని నిల్చు

న్న కొండమ్మని చూస్తూ "టిక్కెట్" అన్నాడు.

"ఎనక మా ఆయన ఉన్నాడు'' అంది.

"ఎనకున్నాడా? పేరేంటి?"

"అయిలయ్య''

కండక్టరు ఆమె జవాబు వినకుండానే టిక్కెట్టు కొట్టుకుంటూ ముందుకి కదిలాడు.

కండక్టరు ఆడవాళ్ళకి టిక్కెట్టు ఇచ్చి మగవాళ్ళ దగ్గరకి వచ్చేసరికి వాళ్ళ స్టేజి వచ్చింది.

అంతలో కండక్టర్ "ఊc... సర్లే... టిక్కెట్టు డబ్బులు తియ్యి ముందు. ఎక్కడికెళ్ళాలి? ఎన్నిటిక్కెట్లు?" అన్నాడు.

"రెండు టిక్కెట్లు దొరా. నేను, ముంగల మా ఆడదుంది''

"రెండా? ఎక్కడికెళ్ళాలి?"

"లస్కర్... గదే సికిందిరాబాదు?"

గయ్యిమన్నాడు కండక్టరు.

"ఏంటి? సికింద్రాబాద్ పోవాల్నా?"

"అవ్''




అది రిక్వెస్టు స్టేజి కావటంతో పెద్దగా జనం లేరు.

ఒకరిద్దరు ఎక్కి దిగారు.

బస్సు మళ్ళీ కదిలింది.

'టిక్కెట్... టిక్కెట్ ప్లీజ్' అరుస్తూ కండక్టరు అయిలయ్య దగ్గరకి వచ్చాడు. మనుష్యులు నిల్చుంటాకే చోటులేకుండా వుంటే ఈ తట్టలు బుట్టలు ఏంటయ్యా?" అంటూ పాసింజర్స్ అయిలయ్యని విసుక్కుంటున్నారు.

"ఏం చేస్తును దొరా, మా బతుకంత ఈటితోనే ఎల్లమార్తుంది'' అంటూ వినయంగా ఏదో చెప్తున్నాడు అయిలయ్య.

"నీ... ఎక్కేటప్పుడు అడిగి ఎక్కే పనిలేదా? బస్సు కనిపించగానే ఎక్కెయ్యటమేనా?"

"ఏంది దొరా అడిగేడిది. నాకు తెల్వకపోతే గందా? నాకు సదవస్తంది. మా మేస్త్రిరి ఎనభై ఆరో నెంబరు సికిందిరాబాదు అని రాసుంటుంది ఎక్కుమని సెప్పిండు''

"ఆడు సెప్పాడు నీవెక్కినావ్'

"అవ్''

"పాగల్... దిగు ముందు'' కండక్టరు నోటికొచ్చినట్లు తిట్టుకుంటూ అయిలయ్యని

భుజంపట్టి కిందికి తోశాడు.

"ఏంది దొరా గట్ల తోస్తవు... బస్సుమీన సికిందిరాబాదు అని రాసుండె. ఎనభై ఆరు... నెంబరుండె... ఎందుకు పోదు?"

"ఇది పోదయ్యా... ముందు నీవు బస్సు దిగు నాయనా. అసలే మాకు లేటయ్యిందని మేం ఏడుస్తుంటే మధ్యలో ఈ న్యూసెన్సుఏంటి? నువ్వు ముందు దిగు. ఈ బస్సు సికింద్రాబాదు పోదు''

"ఎందుకు పోద్దొరా... ఎనభై ఆరు..."

"నెంబరు కరక్టే, సికింద్రాబాదు అని రాయటం కరక్టే నాయనా. కాని ఈ బస్సు సికింద్రాబాదు నుంచి కోటి పోతూంది. నువ్వు అటువైపు వెళ్ళి బస్సు ఎక్కాలి''

ఎవరో ఇద్దరు పాసింజర్స్ అయిలయ్యని బలవంతాన బస్సు దించారు.

"ఓ కొండమ్మ దిగుదిగు'' ఓ పొలికేక పెట్టాడు అయిలయ్య. చేతిలోని ఉప్పరితట్టల్ని పదిలంగా తలమీద పెట్టుకుంటూ సత్తు టిఫిన్ కారేజిలు లొడలొడ లాడించుకొంటూ అప్పటికే బస్సు దిగింది కొండమ్మ.

"పల్లెటూరి మొఖాలతో వచ్చిన చిక్కే ఇది. తెలివి తక్కువ వెధవలు, తెలిసిచావదు, చెబితే వినరు'' కండక్టర్ విసుక్కుంటుంటే తక్కిన పాసింజర్స్ నవ్వారు.

బస్సు కదిలింది.

కదులుతున్న బస్సుని చూసి అయిలయ్య, కొండమ్మ కూడా ఒకరి మొఖాలు ఒకరు చూసుకుంటూ నవ్వుకున్నారు.

"గీ పట్నపోళ్లకి మనం తెలివితక్కువ మొగాలయితే మనకి ఆళ్ళుగాదేమో. ఏ పిట్టకు తగిన మూతి ఆ పిట్ట కుంటుందని ఎరకలేదా ఆళ్ళకి. మనం ఉప్పరి పని చేసే కాంపిలెస్ గాడ్నించి మనం వుండే ఉప్పరబస్తీకి రావల్నంటే ఒక్క టేజీ. గీ ఇంతదూరానికి తల ఒక్కంటికి రూపయి ఎనభై పైసలు టిక్కెట్టు కొడతాడా. అంటే మనిద్దరకి మూడు అరవై పైసలు. కూలినాలి సేసుకునేటోళ్ళం గన్నన్ని పైసలు బస్సులకి, రిచ్చాలకి ఖర్సుపెట్టగలమా? పోనీ నడుద్దమా అంటె పగలంతా ఉప్పరిపని చేసిచేసి నడుంలు ఇరగుతయ్యి, ఇంగ నడిసే ఓపికేడుంది? గీ బస్సు సికిందిరాబాదు పోదని నాకు తెల్వదా? గట్ల సేస్తే తప్పుడు బస్సు ఎక్కినావని టిక్కెట్టు కొట్టకుండా పక్క టేజిలో దింపేస్తడు. ఈడ్నుంచి మనగూడెం నాలుగడుగులెనాయె.

ఆ కండక్టరోడు తిడితె తిట్టుకోనీ?"

ఉప్పరి తట్ట దులుపు కున్నట్లు దులుపుకున్నాడు అయిలయ్య.

"గంతే మరి... రూలు గీలు అనుడేగాని మనకట్టం ఆళ్లు సూసినారా? ఆళ్ళకట్టం మనం సూట్టానికి? అదేమంటే సర్కారు సర్కారు అంటరు. ఏడుంది ఆ సరకారు? నే ఎప్పుడూ సూడలా?" మగడ్ని సమర్థించింది కొండమ్మ.

కిలోమీటరు పైగా దూరం నడిచే భారం తప్పి పైసా ఖర్చులేకుండా బస్సులో వచ్చినందుకు మురిసిపోతూ చేయిచేయి కలిపి తమగూడెంవైపు సాగిపోయింది ఆ పల్లె శ్రామిక జంట!

-కాకాని కమల

---

## అనుకున్నదొక్కటి...

సాయంత్రం ఆరు అయింది. ఎండాకాలం కావటంవల్ల వెలుతురు బాగావుంది. పార్కులో అరగంటనుంచి వెయిట్ చేస్తున్న రవి చికాగ్గా గేటువంక చూస్తున్నాడు.

దూరంనుంచి వేగంగా నడిచి వస్తున్న సరితను చూసి కొంచెం స్థిమితపడ్డాడు.

"ఏమిటి ఇంత ఆలస్యం"

"ఏం చేయను... వచ్చే టైముకు ఏదో




అర్జంట్ పని చేయవలసి వచ్చింది. నీకు తెలుసుగా మనం పనికి ఎప్పుడూ నో చెప్ప మని'' అంటూ పక్కనే కూర్చొని అలసట తీర్చుకొంది.

"ఎన్నాళ్లు మనం ఇలా పార్కుల్లో గడ పాలి. ఏదో విషయం తేల్చేయరాదూ మీ నాన్నదగ్గర" అన్నాడు రవి.

"నేను ఆ విషయం చెప్పాలనే ఈరోజు నిన్ను పిలిచాను. రేపు సరిగ్గా ఆరుగంటకు మా ఇంటికి వచ్చేయి. అందరూ నిన్ను 'ఓ.కే.' అంటారు. మన పెళ్ళి జరిగిపో తుంది.

మర్చిపోకు. ఇక వస్తాను. మళ్ళీ బస్సులు దొరకవు'' అంటూ సరిత లేచింది.

ఆ సాయంత్రం వెళ్లాలంటే పొద్దుటినుంచే టెన్షన్‌గావుంది రవికి. సరిత గవర్నమెంట్ జాబ్ చేస్తుంది. తను ప్రవేట్ కంపెనీలో చేస్తాడు. ఆర్థికంగా తనే తక్కువలో ఉన్నాడు. అలాంటిది వాళ్ల నాన్న ఒప్పుకుంటాడా! ఏమో చూద్దాం అనుకుంటూ బయల్దేరాడు.

ఆరుగంటలకి సరిత వాళ్ల గేటు తెరిచాడు. నిజంగానే టి.వి. చూస్తూ గేటు చప్పుడు ఎవరూ వినలేదు. కాని సరితకి ముందే తెలుసు గనుక గేటుదగ్గరకొచ్చి లోపలికి




"అదేమిటి అంత సింపుల్‌గా ఎలా ఓ.కే అంటారు'' అన్నాడు రవి.

"అదే తమాషా. కిందటివారం మా ఇంట్లో ఓనీడా టీవీ కొన్నాము. ఆ టీవీ ప్రోగ్రాంలు చూస్తుంటే ఎవరూ చూపు తిప్పలేరు. సాయంత్రం అందరూ టి.వి. చూస్తారు కనుక నిన్ను చూడకుండానే ఒప్పుకుంటారు''

"నిజంగా ఒప్పుకుంటారా? నాకు నమ్మకం కలగటంలేదు'' రవి ఆశ్చర్యంతో అన్నాడు.

"నువ్వే చూస్తావుగా. ఆరుగంటలకని

తీసుకెళ్లింది. ముందుగదిలోకి అడుగుపె ట్టడం, కరెంట్ పోవటం ఒకేసారి జరగటంతో అందరూ వచ్చిన వ్యక్తిని పరీక్షగా చూశారు వెనక్కి తిరిగి.

పాపం రవి, సరితల పరిస్థితి ఏమిటో మీరే ఊహించుకోండి!

-గొల్లపూడి శ్యామల

# సారస్వత ముత్యాలు

★ జీవితం వ్యక్తిలో పెంచే కాలుష్యాన్ని మంచి రచనలు ప్రక్షాళన చేస్తాయి

-కొడవటిగంటి

★ కవిత్వమంటే రక్తాన్ని సిరాగా మార్చే బాధ

-టి.యస్.ఇలియట్

★ కవుల కవిత్వంతో కేవలం జ్ఞానమూలకమైన బ్రహ్మవిద్యగానీ, రాజ్యాధికారంగానీ తులతూగవు

-జయదేవుడు

★ కవులు మానవతా విలువల పరిశీలకులు. మనోవికాస మాధుర్య పరిపోషకులు. సభ్యతా సామనస్య సద్వివేక సంధాతలు - సంస్కృతీ నిర్ణేతలు

-రాధాకృష్ణన్

★ మన జీవనగమనాన్ని మహోజ్జ్వల తారకా కాంతినిబట్టి సాగించాలిగాని మసకబారిన వీధి దీపాలనుబట్టి కాదు.

-రాధాకృష్ణన్

★ మన కలల్నిబట్టి గాక మనం సాధించిన కార్యాల్నిబట్టి చరిత్ర తీర్పు చెబుతుంది.

-రాధాకృష్ణన్

★ విభిన్న సంస్కృతులమధ్య వారధులు నిర్మించడానికి సాధనాలు మంచి పుస్తకాలు.

-రాధాకృష్ణన్

★ మంచిని బోధించే మహనీయులు మండుతున్న కాగడాలవంటివారు. తాము కాలిపోతూ ఇతరులకు వెలుగునందిస్తారు.

-రాధాకృష్ణన్

★ సైన్స్ మనకు విజ్ఞానాన్ని కలిగిస్తుంది. తత్వశాస్త్రం వివేకాన్ని వెలిగిస్తుంది.

-విల్‌డ్యురాంట్

★ సూర్యకాంతి మీదపడుతున్నంతసేపూ మురికిగుంట కూడా మెరుస్తుంటుంది.

-గెథే

★ సంతృప్తి అన్నది సహజమైన సంపద. దర్జా జీవనం కోరి కల్పించుకున్న దారిద్ర్యం.

-సోక్రటీస్

★ ఉత్తమ గ్రంథాలు లేని గృహం ఆత్మలేని బొందిలాంటిది

-సిసిరో

★ పట్టుబట్టి సాధించుకోవలసింది కీర్తి. పదిలంగా సంరక్షించుకోవలసింది గౌరవం.

-సోపెన్‌హార్

---

సేకరణ: ఈదుపల్లి వెంకటేశ్వరరావు

# 'ది యూనివర్సిటీ' పై సమీక్షలు

**జూలై నెలలో ప్రచురితమైన, నవలల పోటీలో కన్సొలేషన్ బహుమతి పొందిన కె. సురేష్ నవల 'ది యూనివర్సిటీ'పై మాకందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఐదింటిని ఈ దిగువన ప్రచురిస్తున్నాం.**

## ముచ్చటైన ముగింపు

*(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

గత దశాబ్దకాలంలో ఆంధ్రప్రదేశ్‌లోని కొన్ని విశ్వవిద్యాలయాల్లో నెలకొన్న పరిస్థితులను చిత్రించిన నవల 'ది యూనివర్సిటీ'. సామాజికాభివృద్ధిలో విశ్వవిద్యాలయాల పాత్ర ఎంతో విశిష్టమైంది. అలాంటి విద్యావిధానం వల్ల రేపటి సామాజిక పౌరుల బాధ్యత ఎలా పతనస్థాయికి చేరుకుందో చక్కగా వివరించాడు రచయిత. 'సామాజిక ఉత్పత్తికి తోడ్పడే శ్రమకు ఉపకరించే విధంగా విద్య ఉండాలి' అన్న లెనిన్ మాటే ఈ నవలకు నేపథ్యం.

విద్య జాతి జీవనాన్ని తీర్చిదిద్దడమే గాకుండా సంఘ భవితవ్యాన్ని నిర్మిస్తుంది. ఏ దేశంలోనైనా విద్యావిధానమే సుస్థిర సమాజాభివృద్ధికి మూలం. అందుకే డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ 'ఎడ్యుకేషన్ ఈజ్ ది మీన్స్ ఫర్ రికాన్‌స్టిట్యూషన్ ఆఫ్ సొసైటి' అన్నారు. కాని నేటి విద్యా వ్యవస్థ కేవలం డిగ్రీల ప్రదానానికే తప్ప సామాజిక ప్రగతికికాదు అనే విషయం స్పష్టమౌతుంది. లోపభూయిష్టమైన ఈ విద్యావిధానంవల్ల విద్యార్థుల్లో స్వార్థం, తన జీవితం, సంపాదన అనే సంకుచిత భావమేర్పడుతుంది. అందువల్ల సమాజంపట్ల సేవాభావం కనబరచక తను విద్యకు ఎంత ఖర్చుపెట్టాడు, తను ఎంత సంపాదించాలి అనే భావన మనసులో మెదుల్తున్న సమాజ సభ్యులున్నంత కాలం సమాజం అభివృద్ధి చెందదు అనే విషయాన్ని వెలిబుచ్చింది ఈ నవల.

విశ్వవిద్యాలయాలలో నేడు రాజు, కోటి, పావని, శరత్‌లు అరుదు. కాని వంశీ, రజనీకాంత్, శ్రీనివాసులు లాంటి వారే అధికం. అకడమిక్, పోటీ పరీక్షలలో ఏ ర్యాంకులు సంపాదించినా, ఎంత ఉన్నత ప్రభుత్వ ఉద్యోగాలు చేపట్టినా మన పరిస్థితి భోజరాజ సాలభంజికలు అని తెలుసుకొంటే మంచిదని హితవు చెప్పింది. సామాజికంగా అభివృద్ధి చెందలేదు కాబట్టి లక్ష్మి చావు తప్పలేదు, పద్మజ అత్యాచారం ఆగలేదు, తాగుడు భర్తతో మాధురి జీవితం కొనసాగడం తప్పలేదు. యూనివర్సిటీ పాఠ్యాంశాల చర్చ విపులంగా సాగి వుంటే బాగుండేది. అభంశుభం తెలియని శరత్ పల్లెటూరి నుంచి ఉన్నత విద్యకై విశ్వవిద్యాలయానికి ప్రయాణంకావడంతో ప్రారంభమైన నవల సామాజిక స్పృహతో యూనివర్సిటీ వైపు వెళ్లడంతో ముగింపు ముచ్చటగానే ఉంది.

త్యాగధనులకు ఆదర్శాలుంటాయని, ఇతరులకు కోరికలుంటాయనే విషయాన్ని వివిధ పాత్రలకు మేళవించి రచించిన నవల 'ది యూనివర్సిటీ'. అడ్మిషన్లనుంచి అపాయింట్‌మెంట్ వరకు కుల, మత, వర్గ ప్రాంతీయ బేధాలతో కూరుకుపోతున్న విశ్వవిద్యాలయాలలో రాజు, కోటి, పావని, శరత్‌లు అవసరమని చెప్పింది 'ది యూనివర్సిటీ'. అందుకు రచయిత కె.సురేష్‌కు, నవలను ముద్రించి పాఠకలోకానికి అందించిన 'చతుర'కు అభినందనలు.

-డి.నల్లన్న
తిరుపతి

## ఏకోన్ముఖ విశ్లేషణ

*(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

జూలై చతుర నవల 'ది యూనివర్సిటీ'

ఏదేదో చెప్పేయాలన్న ఆరాటంతో ఎన్నెన్నో విశ్లేషించాలన్న ఆతృతతో అసలేమీ చెప్పని 'చప్పని' నవలగా మిగిలిపోయింది.

'అంపశయ్య' లాంటి ఎన్నో గొప్ప నవలలకి రూపునిచ్చిన యూనివర్శిటి అనేకానేక భిన్న ప్రవృత్తుల, వ్యావృత్తుల, జీవనవిధానాల కూడలి. భారత భవిష్యద్దర్శనాలైన విశ్వవిద్యాలయాల తీరుతెన్నులు నేడు అనూహ్యంగాను, కొండొకచో అవమానకరంగాను మారుతున్నాయి. అలాంటి విషయాలను వెలుగులోకి తెచ్చే నవలలెన్నయినా ఆహ్వాన యోగ్యమే. కాని సురేష్‌గారి రచన ఏ స్పర్శాలేకుండా చాలా మామూలుగా అదీ ప్రారంభంలో ఉన్న ఆసక్తి క్రమేణా సన్నగిల్లేలా సాగింది.

'లాక్ ఆఫ్ హ్యూమన్‌టచ్' ఇన్ని అనర్థాలకు కారణమన్న అభిప్రాయం సమంజసమే. రాజు, బాలయ్య, కోటి మానవ సంబంధాలను విశ్లేషించిన తీరు బాగుంది. విశ్వమానవ ప్రేమకు వాళ్లు ముగ్గురూ ప్రతీకలు. రాజులో నాయకత్వ లక్షణాలు బాగా చూపించబడినాయి. అయితే కొన్ని చిన్న అంశాలను కూడా ఏకోన్ముఖంగా విశ్లేషిస్తూపోవడం నవలా పఠనంలో పంటికిందరాయైంది. రాజు అదృశ్యంతో యూనివర్శిటీలో కదలిక ఆగిపోవటం అసంబద్ధం. ఏ ఉద్యమమైనా ఒక శక్తిగాని ఒక వ్యక్తికాదు. అయితే ప్రజల్లో చైతన్యం కలిగించాలంటే రాజు అజ్ఞాతంగా బతకాల్సిందేనా? అందునా అతడు తీవ్రవాదికాడు.

అలాగే శరత్ అందరు యువకుల్లాగే ఏదీ నిర్ణయించుకోలేని అయోమయావస్థలో ఏవేవో ఆశయాలపట్ల ఆకర్షణతో గమ్యం చేరని పయనమే చేశాడు. ఆ అస్పష్టత అతనిలో అలాగే మిగల్చటం అబ్సర్డిటీని పోషించడమా? శరత్ తల్లి మోసగింపబడటం గురించి చెప్పిన ప్రయోజనమేమిటో, అతడి తమ్ముడి విషయంలో రాజు ప్రమేయం ఏం సాధించిందో, ఆద్యంతం తృతీయ పురుషలో సాగిన కథనం మధ్యలో అక్కడక్కడ ప్రథమ పురుషలోకి మారిపోవడం దేనికో మనకు అర్థం కాదు.

నవలలో కదిలించిన సంఘటన వంశీ వృత్తాంతంతో శరత్ షాక్ తినటం. నైతిక విలువలు భ్రష్టుపట్టిపోయి, కుహనా విలువలే ప్రయోజకత్వంగా చెలామణి అవుతన్న మేడిపండు జీవితాలకి ఉదాహరణ వంశీ. రాజుకీ విషయం శరత్ చెప్పకపోవటం, విశ్లేషణకి అవకాశమివ్వకపోవటం బాగాలేదు.

సంఘమంత విశాలమైన సమస్యలకి ఏదో ఒక పరిష్కారం ఎవరో చూపి, ఏ ఒక్కనాటికో బాగు చేసేయలేరు వ్యవస్థను. కాని దాన్ని గురించిన అవగాహన, ఆలోచన కల్పించవచ్చును మెదళ్లలో. ఆ ప్రయత్నం నవలలో జరిగినా అంతశక్తివంతంగా అనిపించలేదు.

**-రాయనూతల లక్ష్మి**
సి.మల్లవరం

## అనూహ్యస్పందన

***(మూడవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)***

ఎన్నో ఆశలతో, ఆలోచనలతో, ఆశయాలతో విజ్ఞానకాంతుల్ని విరజిమ్మే విశ్వవిద్యాలయంలోనికి అడుగుపెట్టిన ఎందరో విద్యార్థులు అక్కడి అనూహ్యమైన వాతావరణంలో మదింపబడి చివరికి కొందరు మాణిక్యాలుగా... మరికొందరు మట్టిసుద్దలుగా బయటికొస్తారు. యూనివర్సిటీ కొందరికి అనుభూతులనిస్తే... మరికొందరికి అనుభవాలనిస్తుంది. విభిన్న దృక్పథాల సమైక్య నిలయం 'ది యూనివర్సిటీ...' అన్న వాస్తవిక ప్రమాణాలను ఆవిష్కరించిందీ నవల.

రచయిత సురేష్ ఇంత చక్కటి సబ్జెక్టను కేంద్రబిందువుగా తీసుకొని... నేటి సమాజాన్ని పరిధిగా చేసుకుని విశ్లేషించ ప్రయత్నించడం ప్రశంసనీయం. అయితే ఆ విశ్లే




షణ... 'చతుర' నవలకు కావలసినన్ని పేజీలవరకు సాగదీసి... తర్వాత దానికి ముగింపు ముడివేసినట్లనిపించింది.

ఎంతసేపూ రచయిత యూనివర్సిటీ విద్యార్థుల మనస్తత్వం, మనోవేదన, సమస్యలు... వాటి పరిష్కారం కోసం వాళ్లుపడే తపన... ఇలా స్టూడెంట్స్ కోణంనుండే విశ్లేషించారు తప్ప... యూనివర్సిటీ నిర్వహణలో బాధ్యతాయుతమైన అధికారులు, లెక్చరర్స్, ప్రొఫెసర్స్ వంటివారివల్ల జరుగుతున్న, జరిగే మంచీ... చెడు... విధానాలను గూర్చి అంతగా ప్రస్తావించకపోవడం శోచనీయం.

రచయిత నవల మొత్తం యూనివర్సిటీ విద్యార్థుల జీవితసరళిని గూర్చిన సంఘర్షణలతో నడిపించినా... ముగింపుకు ముందు మాత్రం అనూహ్యమైన ఆలోచనలతో పాఠకుల హృదయాలను స్పందింపచేశారు.

'యూనివర్సిటీ క్యాంపస్‌లో పుట్టిన ఉద్యమాలు క్యాంపస్‌ను వదలి బయట సమాజంలో రగులుకొంటున్నాయి. తిరిగి క్యాంపస్‌లో మరో మార్పు... మళ్లీ అది రేపటి సమాజంలోనికి చేర్పు' అన్న విషయాన్ని రచయిత పావని పాత్రద్వారా చెప్పించారు. క్యాంపస్‌లో మళ్లీ ఏదో ఒకటి ప్రారంభించటం ద్వారా పరిష్కారాన్ని సాధించవచ్చునన్న పావని ఆలోచన అంత సమంజసంగా లేదు.

ఏదిఏమైనా... సమాజ భవిష్యత్‌కు సవాల్‌గా నిలిచే యూనివర్సిటీ విద్యార్థుల సమస్యలను, ఉత్తేజపూరితమైన ఆలోచనలను నవలా వేదికనెక్కించి... పరిష్కార మార్గానికి మాత్రం పోగొట్టుకున్నచోటే వెతుక్కోమని శూన్యంలోనికి చేయి చూపించారు రచయిత.

సూక్ష్మంలో... మోక్షాన్ని బోధించేవిధంగా ముఖచిత్రాన్ని తీర్చిదిద్దారు ఆర్టిస్ట్ పినిశెట్టి. యూనివర్సిటీ చరిత్రపుటలలో చెదలు పట్టిపోతున్న సువర్ణ అధ్యాయాల్ని, చిగుళ్లు తొడుగుతున్న వికృతపు అభ్యాసాలను చిత్రించి... గంభీరమైన యూనివర్సిటీ గర్భంలో మంచికీ... చెడుకీ... మధ్య జరిగే అంతర్యుద్ధానికి అద్దంపట్టారు.

-ఎస్. కొండలరావు,
మండపేట

## చక్కని మనస్తత్వ విశ్లేషణ

*(నాల్గవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

**ఉ**త్తమమైన నవలలను అందించే 'చతుర' ఈసారి కూడా తన ప్రత్యేకత నిలుపుకొంది. నేటి విద్యార్థులే రేపటి పౌరులు. ఆ విద్యార్థుల మనస్తత్త్వాలను సహజమైనరీతిలో 'ది యూనివర్సిటీ' నవల ద్వారా విశ్లేషించిన శ్రీ సురేష్ అభినందనీయులు.

తరాలకు తరాలకు మధ్య అంతరం, జనరేషన్ గ్యాప్ విద్యార్థులలో ఎంత త్వరగా ప్రతిఫలిస్తుందో చక్కగా వివరించారు. విద్యార్థుల లక్ష్యాలు పరిస్థితుల ప్రభావానికి లొంగిపోవడంపట్ల రచయిత ఆవేదన నవల అంతా స్పష్టంగా కనపిస్తుంది.

నాయకత్వ లక్షణాలున్న రాజు, సమానత్వం కోసం పోరాడే పావని, డ్రగ్స్ వాడే అర్జున్, ఊగిసలాడే శరత్ వీరు ప్రతీ కాలేజీలోనూ ఉంటారు. అందుకేనేమో యూనివర్సిటీ నవలలో యూనివర్సాలిటీ! విద్యార్థులు సమస్యలపట్ల స్పందించేతీరు, పారలల్ యూనివర్సిటీలాంటి విప్లవాత్మకమైన ఆలోచనలు ఇవన్నీ ప్రతి పాఠకుడినీ ఆలోచింపజేస్తాయి. విద్యార్థుల మధ్య 'హ్యూమన్ టచ్' ఎంత అవసరమో రచయిత చక్కగా ప్రస్తావించారు. సమాజంలో జరిగే మార్పులను విద్యార్థులు ఎంత త్వరగా రిఫ్లెక్ట్ చేయగలరో చాలా అందంగా వివరించారు.

'చివరికి మిగిలేది' నవల ప్రభావం ఈ నవలలో చాలాచోట్ల కనిపిస్తుంది.

కొన్నిచోట్ల సంభాషణలు ఉపన్యాసాల ధోరణిలో అసహజంగా ఉండడం, కథకు అవసరంలేని వివరణలూ, వర్ణనలూ, సంఘటనలు

అస్పష్టంగా, అసమగ్రంగా ఆగిపోతూ ఉండడం ఇలాంటి చిన్న చిన్న లోపాలు పాఠకుడిని అస్పష్టమైన భావాలలో ముంచుతాయి. సమస్యను వివరించడంకన్నా ఎక్కువగా విశ్లేషించడం వలన సాధారణ స్థాయి పాఠకుడు కన్ఫ్యూజ్ అయ్యే అవకాశాలు ఎక్కువ.

మొత్తానికి కొత్తకి, పాతకు మధ్య జరుగుతోన్న సంఘర్షణలో రచయిత ఊగిసలాట, సమస్యలపట్ల అతను ఆలోచించే కొత్త విధానం మనకు కనిపిస్తాయి. బోరింగ్‌గానూ, విస్తృతంగానూ ఉండే సబ్జెక్ట్‌ని తీసుకొని దానిని సొంపైన రీతిలో మలచడానికి ప్రయత్నించిన రచయిత సాహసం నిజంగా అభినందనీయం.

-డి. సత్యనారాయణమూర్తి,
హైదరాబాద్

## అసమగ్రచిత్రం

*(ఐదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

**జులై** నెల నవల 'ది యూనివర్సిటీ' రచయిత సురేష్ చేసిన ఒక మంచి ప్రయత్నం. సమాజంలో జరుగుతున్న అన్యాయాలపట్ల, ఒకనాటి యూనివర్సిటీ వాతావరణంలో స్పందన ఉండేదని, మానవతా విలువలపట్ల సదవగాహన ఉండేదనీ, నేటి ఉన్నత విద్యా జీవితంలో అవి మృగ్యమైనాయనీ, సర్వత్రా కెరీరిజం, స్వార్థం చోటుచేసుకున్నాయని చెప్పటానికే ఈ నవల ఉద్దేశించబడినట్లు అనిపిస్తుంది. ఈనాటి స్థితికి కేవలం విశ్వవిద్యాలయాలే కాకుండా, బాహ్య, భౌతిక పరిస్థితులు కూడా దోహదం చేస్తున్నాయని నిర్ధారించబడింది. తల్లిదండ్రుల ఆలోచనాసరళి మరొక కారణం.

ఎన్నుకున్న కథావస్తువు చాలా విస్తృతమైనది. వెలిబుచ్చిన భావజాలం ఆలోచనలను రేకెత్తించేవిగా ఉండటంచేత, చిన్న నవలలో సమగ్రచిత్రణ ఇవ్వటం చాలా కష్టం, దాదాపు అసంభవమనే చెప్పాలి. అందుకనే సత్ప్రయత్నంగా మలచిన ఈ నవల ఒక అసమగ్ర చిత్రంగా ఉండిపోయింది. మొదటి ముప్పయి పేజీలు బలవంతంగా చదవాల్సి వస్తుంది. తరువాత వేగం పుంజుకుని చకచకా నడుస్తుంది. అయితే నాటి యూనివర్సిటీ జీవితాన్ని చిత్రించటానికి దాదాపు వందపేజీలు నిండితే, నేటి స్థితిగతుల వర్ణనకు కేవలం ఇరవైపేజీలలో కుదించాల్సివచ్చింది. దీన్నిబట్టి పరిమితిని అర్థం చేసుకోవచ్చు.

'వ్యక్తి సమస్యనుంచి, సమాజస్థాయికి నడిపించటం అనే పర్సన్‌తో ఒక కదలికను తేవాలి. దానికంటే ముందు సాంస్కృతిక పతనం, విలువల రాహిత్యంమీద మన పోరాటం ఉండాలి' అంటుంది పావని. కానీ 'లోకలైజేషన్ ఆఫ్ ది ఇష్యూ' అనేది ప్రస్తుతం ఎక్కువగా ఆదరింపడుతున్న ఆదర్శం. చాలామంది ఆఫ్రికన్ రచయితలు కూడా తమ తమ లోకల్ లైఫ్‌ను చిత్రిస్తూ సాహిత్య సృష్టి చేస్తున్నారు. ఆ రకంగా చూస్తే పావని ఆలోచనాసరళి అంత ఆరోగ్యవంతంగా అనిపించదు. ఒకవైపు ప్రత్యామ్నాయ సంస్కృతిని స్థాపిద్దాం అనుకుంటూ మరోవైపు సాంస్కృతిక పతనంమీద పోరాటం ప్రకటించడమెందుకో అర్థం కాదు.

ప్రథమ పురుషలో సాగుతున్న కథనం, అర్థాంతరంగా ఉత్తమ పురుషలోకి ఎందుకు మారిందో తెలియదు. వాక్యనిర్మాణంలో కొన్ని అవకతవకలు ఉండటంవల్ల కథనంలో కొంత అస్పష్టత చోటుచేసుకుంది.

ఏదిఏమైనా ఒక మంచి ప్రయత్నం చేసినందుకు రచయిత నిస్సందేహంగా అభినందనీయుడు.

-సి.హెచ్. శ్రీనివాసమూర్తి,
హనుమకొండ

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel: 290328; Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 318181, 399444; Madras: 470434; Vijayawada: 476685; Visakhapatnam: 52211; Tirupati: 5291; Anantapur: 22977; Rajahmundry: 71390; Karimnagar: 8316.

CHATURA Telugu Monthly Hyderabad-500 482 Regd. No. H/HD/402